క॥ ఆపీరు ప్రవేశంబున, నావేశిత యయ్యె నొకమహోద్యుతి గుణసం
భావిత యయ్యె సభాస్థలి, శ్రీవిలసితవృత్తు లొలయు చిత్కల లూరన్. ౮౩
క॥ వేదవిదుదాహృతములు ప్ర, మోదావహములు సుపుణ్యములు తతపుణ్యా
హోదితరవోచితములు గు, రూదయపదములు పదంబు లూర్జితుఁడు వినెన్. ౮౪
క॥ లలి లాజ లక్షతలు పూ, వులు ఘృతదధిపాత్రికలునుఁ బొలుపొందఁగఁ బూ
జలఁ గైకొను మంత్రార్థవి, దుల విప్రులఁగాంచె మహితదోర్బలుఁ డబలా ౮౫
ఆ॥ తేజు నెఱయ నెఱిఁ బ్రదీప్యమానుఁడు వాఁడు, దానవౌఘపూజ్యమానుఁ డగుచుఁ
గొలువుగద్దెపైనిఁ గూర్చున్న ధనదాను, జునకు సుభుజుఁ డెనసి వినతిఁ గూర్చె,
ఆ॥ నాథు చూడ్కి గవిసి నవనవోన్మిషిత మా, నొక్క పసిఁడిగద్దె నుచితవృత్తి
నమరె నమరసదృశుఁ డాచారవిదుఁ డతం, డాచరితతదర్థుఁ డగుచు మగువ!,
క॥ రావణు మహామహు జగ, ద్రావణు మంత్రియుత మై పరవ్యవహిత మై
శ్రీ వెలసెడు నక్కొలువున, సేవింపుచుఁ దత్ప్రసాదసిద్ధి నరయుచున్. ౮౮
తే॥ అన్నతో నిట్టు లనె విలసన్నయుండు, కలితసాంత్వ ముపస్థితక్రమము గాఁగ
దేశకాలార్థసంవాది దృష్టలోక, సంచయుపరావరుం డసంశయుఁ డతండు. ౮౯
క॥ ఏవేళ నడుగుఁ బెట్టిన, దో వైదేహీ యదె మొదలు దోఁచెడుఁ బురిలో
దైవికము లశుభములు నొ, నా వెడఁగునిమిత్తములు మహాత్మా! యెపుడున్.
సీ॥ పొగగట్టి మిణుఁగురులెగయ మంత్రితుఁడయ్యు నభివృద్ధిఁగనఁబోఁడుహవ్యవాహుఁ
డగ్నిశాలికల బ్రహ్మస్థలులం బాము లటు పిపీలికలు హవ్యముల నొదవు
నాల పాల్డిందె నొయ్యన మదావళముల మద ముడివోయె దీమసము సెడఁగ
మొగియఁజూడవు గ్రాసము లిడ నశ్వోత్తమంబులు దీనగతిని హేషల వెలిఁగ్రుచ్చ
నాఖరంబు లొంటె లశ్వతరంబులు, భిన్నరోమములుగ బెరసువాఁటి
కనుల నెపుడు నీరు గాఱంగ వగ సెడి, యుండు నేచికిత్స నొరవుఁ గనక. ౯౧
క॥ కాకులు మొత్తము లగుచుం, గా కా యని విడుమరకునుఁ గాక విమానా
గ్రికాయనము లగుచు బి, ట్టాకాలం బఱచుచుండు నతిఘోరముగన్, ౯౨
తే॥ మండలముఁ దీర్చి గ్రద్దలు మాన కెపుడు, నిండ్ల పై పయిఁ గూర్చుండు నెల్లవిడిచి
కప్పు గప్పిన తెఱఁ గొంటఁ గానిపింప, నుభయసంధ్యల నక్క ల ట్లొలసికూయు.
క॥ క్రవ్యాదమృగము లిప్పురిఁ, గ్రవ్యాదాధీశ! పెల్లుగా ద్వారములం
దవ్యాహతార్భటుల నటు, పవ్యదేశికంబు నెఱయఁ బఱపెడు నెపుడున్. ౯౪
ఆ॥ ఇటు ప్రసక్త మైన యీయనర్థ మెడల్చ, నెప్పు నీదు చిత్త మొప్పె నేని
రాఘవేంద్రునకు ధరాసుత నర్పించి, శుద్ధభావ మొలయు సుకృతి విపుడు. ౯౫
క॥ ఈప్రాయశ్చిత్తము గా, కేప్రాకృతకృతియు యేని నెసఁగదు బహుదో
షప్రసవ మైన నీదగు, దీప్రాఘౌఘంబు నోపి తెరలింపంగన్, ౯౬

ఆ॥ తెలిసి తెలియ కేనిఁ దిప్పుట మైనేని లో, భంబువలన నేనిఁ బలుకువాఁడఁ
గానఁ దప్పులున్న క్షమియించి నీ మేలు, చూచుకొనుము మమ్ముఁ బ్రోచుకొనుము.
క॥ ఈనా తెలిపిన దోషము, లోనాయక! యెల్లరకును నుపలక్షితముల్
గానివి గా వంతిపురియు, నీనగరియు నెల్ల యెఱిఁగి మొరియుచునుండున్. ౯౮
క॥ కన్నది విన్నది దెలుపక, మిన్నక యుండంగ నేర్పు మెయివాఁడను గా
నన్నా! నీమంత్రు లెఱిఁగి, యున్నికృతి మెచ్చుచుందు రొఱ వరయ కోగిన్.
క॥ ఈయుది మది నునిచి యథా, న్యాయంబుగ నిశ్చయించి యను వారసి నీ
వీయొఱకాటము గడచి వి, ధేయులతో మనుము కృతి విధిజ్ఞులు మెచ్చన్. ౧౦౦
ఆ॥ అనుచు భ్రాత మంత్రు లందఱ నడుమ నా, భ్రాతఁ గూర్చి పలికెఁ బథ్య మరసి
రాక్షసాధినేత రావణుం డితఁ డంచు, బెడియువాఁడై యావిభీషణుండు. ౧౦౧

—♦ విభీషణు హితవాక్యముల రావణుఁడు నిరాకరించుట ♦—

క॥ హితము మహార్థము భూతా, యతి సంప్రతికాల యోగ్య మనవద్యము సాం
త్వితము సహేతుక మై తగు, నతని పలుకు విని జ్వరార్తుఁడై వాఁ డనియెన్.
మ॥ భయ మేవెంటను లేదు రాఘవుఁడు నన్బ్రాపింపఁగా నేరఁ డె
మ్మెయి సీతం గాని యేగువాఁడు సురలు న్మేకొన్న యిందుప్రిందు ద్రా
నయి తో డే నని వచ్చినన్ గపులగుం పాయగ్నిపై శాలభం
బయి పోదే నిలువంగలండె యతఁ డే నల్లాటలాడింపఁగన్. ౧౦౩
చ॥ అని సురసైన్యనాశనుఁ డహంకరణోచితుఁ డాత్మసారుఁ డ
ర్థనిరతవర్తనుండు పరితఃప్రథితక్రమవిక్రమప్రసా
ధనుఁడు దశాననుండు తనతమ్ముని సన్మని నవ్విభీషణున్
జన దన కాప్తవాది యనఁ జాలక యూరక వీడె నయ్యెడన్. ౧౦౪
ఆ॥ మ్రొగ్గినాఁడు కామమోహితుఁడై వాఁడు, కామజనని సీతఁ గాంచి కానఁ
డదియె మిత్తి యనుచు నండఁడే కార్శ్యము, నాదరము నఘమ్మయమ్ముఁ జేఱుప.
క॥ పాపుఁడయి యేపుసెడి వాఁ, డాపదపడుసమయ మట్టిఁ డధిగత మయ్యెన్
బో పగతు లౌదు రాప్తులు, శాపం బిడినట్లు లై పరిశస్తి తలఁగినన్. ౧౦౬
ఆ॥ ఆయతీతకాల మటె కాల మనుకొనె, రావణుండు రాము రాక దెలిసి
యింక యుద్ధయోగమే యెంచె మంత్రుల, తో సుహృచ్చయంబుతోడఁ గలిసి.

—♦ మఱునాటి కొలువుకూటమున రావణుఁ డెల్లరాక్షసుల రావించుట ♦—

క॥ మఱునాటి వేకువనె మఱి, పఱిఁ గృత్యము లెల్లఁ దీర్చి యఱుకువ మొదలో
మఱుపడియు నెఱియఁ దగు న, క్కఱకై యక్కఱతలాఁడు కలఁగం బసుదున్.

సీ॥ మేలిబంగరుతోడి మెఱుఁగారు రతనంపుఁ బనిమెచ్చుగల తేరిపైఁ దనర్చి
మొయిలు చప్పళ్లతో మొనసి పంతములాడు నేమినిస్స్వనముల నిరతి నరసి
యసిచర్మధరులు సర్వాయుధహస్తులుఁ దొడరి యోధులు ముందు నడువ నడరి
పలువేసములు భూష లొలసి యిమ్ములఁ గ్రమ్ము పరివారముల బరాబరులు మెచ్చి
సభకుఁ బోవు వేడ్కఁ జా నయి నయముతో, సనఁగి పెనఁగ మంగళాస్పదములు
తూర్యరవము లొప్పఁ దోడ్తో వెడలి వాఁడు, రాజమార్గ మెనసె రాజవదన!

క॥ వానికిఁ బట్టిరి నెర వై, జా నగు ముత్యాలగొడుగు స్వచ్ఛతర మదే
దానవనాథుని యాదల, పై నెలకొని పూర్ణచంద్రు ప్రథితిఁ దనర్చెన్. ౧౧౦

తే॥ ఇరుగడల నొప్పె స్ఫాటికహేమమంజ, రీసముల్లసితోచ్ఛ్రితశ్రీఁ దలిర్చు
చామరవ్యజనము లసిచామరారి, విభుని ప్రభుధర్మ మెల్లెడ వెలయుచుండ,

ఉ॥ అందఱు నేగుదెంచి రథమం దధినాథునిఁ గాంచి యంజలుల్
ముందలలం గడల్కొనఁగ మ్రొక్కిరి భూస్థలి నుండి రక్కసుల్
గొందఱు తత్ప్రభావములఁ గోర్కులు మీఱ నుతించి రందు ని
ష్పందజయాశిషోక్తుల ప్రసక్తుల మెకొని రెందఱేనియున్. ౧౧౨

మ॥ అటు లేతెంచి మహామహుం డెనసెఁ బ్రోద్యద్రత్నశోభాంచిత
స్ఫటికానల్పితకల్పనాయుతఁ దపస్యాలబ్ధశుద్ధాగమో
ద్భటశిల్పిప్రవరప్రసాధిత లసత్స్వర్ణపట్టాంశుకో
త్కటరక్షోగణగుప్త స్థూణశతలక్ష్మ్యన్ రాత్రుసాధ్యన్ సభన్. ౧౧౩

తే॥ అందు వైడూర్యమణిమయ మై తనర్చి, ప్రియకప్రియకాజినప్రావృతంబు
నై యమేయోపధానంబులంది పొందు, సుమహితాసనమందుఁ గూర్చుండె నసురఁడపుడు.

ఆ॥ ఈశ్వరుండు నేఁడె యీరేడుజగముల, కనఁగ నెగడి దూతలను లఘుక్ర
ములనుఁ జూచి వాఁడు మున్నాడి యిట్లనెఁ, దనదు ప్రాభవంబు తలకు మిగుల.

క॥ పెద్దపని గలిగినది మన, కిద్దెసఁ దీర్పంగవలయు నిందఱు మొకఁ దై
తద్దయుఁ బుఱిఁగలవారల, నుద్దవిడిం జేర్పుఁడా సముద్ధతి పుఱియన్. ౧౧౪

క॥ అని శాసించిన శాసన, మనుపదమే కొంచు వార లరిగి యనుగ్రహం
బును వలగొని కడుదర్పం, బునఁ దొడరిన కర్జ మెఱుక పొనరించి రొగిన్. ౧౧౫

క॥ పానాహారరతుల ను, ద్యానవిహారైకమతుల ననుగతశయన
స్థానాంచితుల నభీతత, దానవులు పరిభ్రమించి తటిమిరి పిలుచన్. ౧౧౬

చ॥ రుచిరరథోత్తమాశ్వగజరూఢత గాఢతరప్రయత్ను లై
సచివత నెక్కొనం బెరయసాగి రతేగి రటం బదాతు లై
ప్రచితసమృద్ధు లూర్జితులు బంటులు గంటులు లేనివారు దా
రుచిత మెటింగి నింగి భువియు న్బలుభంగులఁ దొంగలింపఁగన్. ౧౧౭

క॥ పుర మన్నెఱి తతరథకుం జరహయసంభేద మొనసి జొన్నై యపు డం
బరము గరుత్మత్సంపా, తరమ న్దర మరయఁజాలుఁ దా నసఁజాలెన్. ౧౨౦

ఆ॥ వచ్చి వాహనముల వరుస నెక్కొన నిల్పి, చొచ్చి రంఘ్రిగతిని శోభమాను
లగుచు నద్రిగుహను హర్యక్షముల యట్లు, రహిఁ దనర్చి దనుజరాజసభను.

క॥ తేని పదయుగలమున కెడ, మీని గతి నృతు లొనర్చి యెదుటనె దరి నే
నేనే నని సత్కృతిఁ గని, వాని సరసఁ దనరి రెల్లవారు న్నతులై. ౧౨౧

ఆ॥ రాజశాసనమున రాణమైఁ దనరారి, వచ్చి వానితోడివార లగుచుఁ
దగినయట్లు నిలిచి తద్దయుఁ బెనుపొంది, నిశ్చయార్థదృష్టి నెలవుకొనిరి.

క॥ వందలకొలఁదిగ మంత్రు ల, మందప్రతిభాసమాన మాను లమాత్యుల్
కొంద ఱన నేల యున్నిఁట, నందఱు నసమాను లగుచు నమరి రచటనన్.

క॥ ఆహేమవర్ణ సభ తగ, నాహవపాండిత్యగుణసమర్థులతోడన్
సాహిత్యమునఁ బ్రతాపం, బాహితమూర్తి యయి తనరె నన ఘనవేణి.

ఆ॥ మేలి టొలు సేర్చి మెఱుఁగుబంగరుకట్ట, డం బొనర్చి యిదె వరం బటంచుఁ
బేరు సెప్పి భిక్ష పెట్టిన తన యుర, దమున ఘనమహాహ్లాదయుమునఁ దనరి.

క॥ ఆకీర్తిశాలి మహితుఁ డ, భీకుఁడు సుకృతాత్ముఁ డవ్విభీషణుఁడు నయం
బీకరణిఁ దోఁచె నౌ నన, నాకాలం బరుగుదెంచె నగ్రజు సభకున్. ౧౨౬

ఉ॥ అన్నకుఁ బేరుగొం చడుగులం దభివందన మాచరించి యా
సన్న శుకప్రహస్తులు ప్రశస్తతరాసనము ల్ఘటింప సం
పన్నుఁడు మంత్రులుం దఱియ భాసురవృత్తి నలంకరించి యా
సన్నతఁ బొల్చె నిందఱకుఁ జాలు నితం డొకఁడే యనన్ సిరిన్. ౧౨౭

చ॥ రతనపుఁజెక్కడంపుఁబని రాణఁ దనర్చు పసిండిసొమ్ములన్
దతిగొని మేలివస్త్రములఁ దాల్కొని పేర్కొన నైన కాంతిస
న్తతులు దివంబు నాఁచికొన నవ్యవిలేపనమాల్యగంధసం
గతములు గంధవాహములు గ్రక్కున నెక్కొని దిక్కు లానఁగాన్. ౧౨౯

శా॥ ఆక్రోశింప రబద్ధ మాడ రపరార్థ్యంబు ల్ప్రశంసింపఁబో
రాక్రవ్యాదవిభుం గనుంగొనుచు నెయ్యం బొప్పఁ దత్కార్యపుం
బ్రక్రాంతిం దలపోయుచుండి రభయు ల్భావజ్ఞు లుద్వీర్యులు
న్విక్రాంతిన్నెఱి గన్నవారు నగు మన్నీలున్ సభాస్తారు లై. ౧౩౦

ఉ॥ మనసున నస్త్రశస్త్రముల మన్ననఁ గన్న ఘను ల్బలాఢ్యు ల
ల్లొనసిన యాసభం దగ సమేధితమానసుఁ డైన రావణుం
డనితర మైన దివ్యసభయందు వసుప్రవరుల్ ప్రభాకరుల్
దనరఁగ మధ్యభాగమునఁ దద్ద పొసంగెడు వజ్రి చాడ్పునన్. ౧౩౧

తే॥ అట్లు మొనసిన యోలగమంతయును సు, రాంతకుఁడువాఁడు కలయంగ సరసి సిగసి
యున్నవానిఁ బ్రహస్తు బహుస్తుతౌజు, నఖిలవాహినీపతిఁ గాంచి యనిరి సుస్తు.
క॥ ఆనాలుగుతెఱఁగులఁ దగు, సేనల సేనాచరులఁ బ్రసిద్ధబలుల వి
ద్యానయదక్షుల నీక్షణ, మే నీనెఱి నధికరక్షఁ కేర్పఱుపఁజనుర్. ౧౩౩
ఆ॥ అనినయంతమాత్రి నాప్రణీతాత్ముఁడు, మందిరమునఁ బురమునందు లోన
బయలునందు దుర్గపదమార్గనిర్గమం, బులను బలుబలంబు లలవరించి. ౧౩౪
క॥ ప్రబలులపైఁ గాఁ బమరఁగ, నబలాజనరక్షణంబు ననుపుపఱిచి వాఁ
డుబుసుచననీక క్రిమ్మఱి, ప్రబుద్ధుఁడై విభుని కొలువుపట్టున నిలిచెన్. ౧౩౫
క॥ ప్రముఖమున నెలవుకొని తఱి, సుముఖుఁడగు రాజువలను సూచుచు మనమం
దమలత చొప్పడ నిట్లనె, సమరాంరప్రభుని దగుసమూద్వృతి నెఱయన్. ౧౩౬
మ॥ బలవద్గుప్తి పొనర్చినాఁడ బల ముద్భావించి సంపత్తి కా
పిలభావం బనరాదు నీవలనునన్ వేరెల్పెనపలేఁ డొండు ని
శ్చలచిత్తుండవ కానె చందమున క్లిష్టంపైన యక్కార్యమున్
దలపెట్టం దమకింపు మీఁదదప్పు సందర్శించిని నిప్పట్టునన్. ౧౩౭
ఆ॥ అను ప్రహస్తు పల్కు లాలించి మేలెంచి, సుఖముఁగోరువాఁడు సూనృతుండు
గాఁడు రాజ్యశక్తి గైకొన్న కబళిమై, యెల్లవారిఁ గాంచి యిట్టు లనియె. ౧౩౮

—• రావణుఁ డందఱు వినఁ బ్రకృతము వినుచుట. •—

క॥ ప్రియ మప్రియమఘము సుఖము,వ్యయమున్ లాభముహితాహితార్థములును స
న్నయవిదులరు మీ రరసి య,భయతం గడుకొండు మత్రివర్గమునడుపన్. ౧౩౯
శా॥ ఏనాఁడేనియు నెంచి పొంచి యిది యిట్లే యంచు సన్మంత్రియో
గానూనంబుగ నర్థసంపదల నెయ్యం బొప్ప నెప్పాటునం
బూనంజాలితి రట్టి కర్జ మెదియుం బోదొంట వైఫల్య ను
ల్లేనిం బోలదు కాంచ వింతయొఱకం బీనాఁటికిం గల్గునే. ౧౪౦
తే॥ చంద్రసూర్యగ్రహర్క్షసంశ్రియతఁ దనరు, నమ్మరుత్తతిభృతి దివిజాధినాథుఁ
డెట్టు లట్టులె యేను మీ యెనఁగు వృతిని, గంటి నవ్యాహతస్థితిఁ గన్న సిరిని.
ఆ॥ ఇపుడు పాలుపడిన యీయర్థముననుఁ బ్రే, రేపవలయునంత రీతి లేదు
గాని స్వప్నగతుని ఘటకర్ణు బోధింప, నైతిఁ గానఁ గలిగె నవసరంబు. ౧౪౨
ఉ॥ ఎక్కడు మేటి యేయెడల నెన్నియుఁ దీర్చినవాఁడు నాకె యే
చక్కటిఁ గూర్చువాఁడు శరజాలసమృద్ధి మహాబలోన్నతిన్
నెక్కొని పేరుగన్న కృతి నేర్పరి మేల్కొనె నేఁడు నిద్దురన్
జక్కఁ దెరల్చి యార్నెలలసంయమ మీసమయాప్తికై చనన్. ౧౪౩

ఆ॥ వానిఁగూర్చి తెలుపవలసె నిప్పట్టున, నాఖరాదు లోలసి యుండఁగొన్న
దండకాటవిం బ్రదక్షిణింపఁ బెచ్చితి, రాము మిహింపి జనకరాజదుహిత. ౧౪౪

సీ॥ నా సెజ్జఁ దఱియ నొ నయము పాటింప దమ్మందగామిని గాము మాటఁ దక్క
ముజ్జగంబుల దాని మొనయ నొ వగలాఁడి నెఱి గాన మను పల్కు నిశ్చితంబు
పిడికిలిఖిష్టు కౌ పేద లేఁగా నన్న నాపృథుశ్రోణిరో యలముఁ బృథ్విఁ
గరఁగి పోసిన మేలి కనకంబు బింబంబు సైదోడు దన కనుఁ జందురి వదన
మెటి మాయయో యు దెట్టిలు పొడమెనో, మయవినిర్మితిప్రమాణ మొక్కొ
యహా హుతాగ్నికీల యూ సౌరి లీల హో, యనుచుఁ గాంచువార లాడుకొందురి.

తే॥ సులలితములు సులోహితతలము లట్లు, సుప్రతిష్ఠితములు తామ్రదీప్రనఖము
లైన మానిని చరణంబులానికొలుచు, కొలువుగొని డాయునదె వేయికోట్లు సేయు.

తే॥ సకియ మోమార చారులోచనము విపుల, ముదిత మున్నతనాసిక మోష్ఠరుచిర
మోపుదు గనఁగంటినదె మొదలేచుచున్న, వాఁడుకఱకట్లమారి కావరుఁడుమరుఁడు.

తే॥ సనుము తెవనికిఁ గ్రోధవార్షములు రూపు
మార్పనర్పంగ నెవ్వాఁడు మలయువాఁడు
శోకతాపంబు లెవ్వాని చూపుకోపు
లతఁ డతనుండియ్యాదనున నన్నలమినాఁడు. ౧౪౭

తే॥ పతిఁ బ్రతీక్షించువెరవున్మెఁ బరఁగ వేఁడె
నొక్కయేడే గడువుగాఁగ నుత్పలాక్షి
భామినీమణి నెఱిఁ జిల్కు పల్కుఁ గొంటి
మంచి నూహించి పొసఁగు నమ్మాట నుంటి. ౧౪౮

క॥ తాంతుండ నైతిని మార్గ, శ్రాంతము హాయ మట్లు బిట్టు స్మరుదాడిబడిన్
గాంత తలఁ పరయనోప ని, తాంతత దేకాంతనిహితతాత్పర్యధృతిన్, ౧౫౦

క॥ తెరియింప నోపుదు రె యే, తరి లేక వనాటు లిట్టితఱి నెట్టన సా
గరము బహుసత్త్వకీర్ణం, బఁణబలు లైన నేమి యారఘువరులున్. ౧౫౧

మ॥ కడు నక్షోభ్యమె యాను వార్ధి యయినం గార్యస్థితుల్ మార్పు నొం
దెడు దుర్జేయత నెంచ నోఁ బోరిపొరిన్ దిష్టంబు దేశంబు నొ
క్కఁడు గాఁడో కపి లంక సొచ్చి కడఁకం గావించెఁ గల్లోల మే
ర్పడఁగాఁ గానఁ బ్రబుద్ధ లీ రనుమతి న్భావింపుఁ డీయర్థముల్. ౧౫౨

క॥ మనుజునివలనిభయము నా, కనుగత మనరాని దింత యూ నిజ మైనన్
బనితలవిమర్శనం బా, వ్వనిదే మీ నెఱియు నెన్నఁబడనిదె యెందున్. ౧౫౩

ఆ॥ ఎన్నిమార్గములు రాకాసులు తెగిచిపడిరి వారి, నెన్నితీర్లఁ దోలి యెనయఁగంటి
గెల్పు వేల్పులఱుమఁ గీర్తిఁ గైకొంటి మీ, యరుస మొసఁగు సాయమందగనుట.

క॥ సుగ్రీవముఖులఁ బ్లవగుల, నగ్రిగులఁ బొనర్చి యబ్ధి యవ్వలిదరిఁ గం
బుగ్రీవ నరయఁ జేరెద, శగ్రీవు నదల్ప భర్త సహోదరుఁ డై. ౧౫౫

ఉ॥ కావున మంత్రి మిట్టితటి గావలయుం గద యెట్టివారికిన్
దావల మంచు మీ మొదటఁ దార్చితి నింతయు నూహ సేసి మీ
రేవలనేని నిందుముఖి నీయక యుండఁ నరేంద్రపుత్రులన్
దోలివఁగ రిత్తవోని నెఱతోరపు గతిం గమనించి తెల్పుఁడీ. ౧౫౬

ఉ॥ ఒంటికిఁ గద్ద శక్తి యెటు లోటమి పొల్పఁ పడుంట గల్గు నా
కొంటయె వార్ధి దాఁటి నెఱకోల్తల సేయుట ధాత్రి నేరి కే
వెంట జయంబు గూరు హరివీరులతో నరుఁ డేగుదెంచి నా
ల్గంటిఁ గొనంగలాఁడె ననుఁ గన్గొనువాఁడె జయంబు మాకె పో. ౧౫౭

క॥ కావున నాకే కలిగెడు, నేవలనున నేని విజయ మెల్ల సచివు లా
త్రోవతల యిది యనుచు మీ, రావేదింపంగ ముదల యగ్గ్యద గనిసన్.

ఆ॥ కామనిహతుఁ డగుచుఁ గావలంబులు పల్కు, వాఁ డటంచు మది వాని వర్తనంబుఁ
గినిసి యిట్టు లనియె దనుజారివిద్వేషి, కుంభకర్ణుఁ డాఁచికోలు నెఱయ. ౧౫౯

—♦ కుంభకర్ణుఁడు రావణునకుఁ బ్రత్యుత్తర మిచ్చుట ♦—

ఉ॥ రాము సలక్ష్మణు న్మొఱఁగి రాజముఖి న్గొనివచ్చువేళ లే
దీమెయి నిశ్చయంబు నపుడే యమునానది యామునంబు న
ట్లామె కొనంగ నైన మది యాఱడిఁ బొల్పొనరుంపఁ గాద నీ
సేమ మెఱుంగ కిట్టికృతిఁ జెచ్చెరఁ జొచ్చితి వేమి సేయుదున్. ౧౬౦

ఆ॥ మమ్ముఁ గూర్చి తొలుత మంత్రించి యిట్టి దా, కర్మమునకుఁ దొడరఁగంటె వేని
నప్రతిఘ మనంగ నయ్యెడు నయ్యది, గతజలమున కింకఁ గట్ట యేల. ౧౬౧

ఆ॥ కాల మరసి రాచకర్జము ల్నెఱపంగ, వలయు న్యాయ్యమైన వర్తనమున
యను వెఱింగి యో మహారాజ యానిశ్చి, తార్థుఁ డవలఁ దాప మందఁబోఁడు.

క॥ అనుపాయక్రియమాణము, లనుపదమే చెడును గడునవగ్రముల నిష్టన్
బొనరు నె యపాత్రముల నుం, చిన నెట్టి హవిస్సు లైన సిద్ధసమృద్ధిన్. ౧౬౩

ఆ॥ పూర్వకార్యములను బొనరింపఁగఁ దలంచుఁ, బిదప నపరకృతుల ముదల నెంచు
నెవ్వఁ డాజఘన్యుఁ డెఱుఁగఁడు రాజన, యానయముల వేళ యనఁగ నేల.

తే॥ క్షిప్రకారి బలోన్నతుఁ జెనక నేర, కతని లోఁగొందు రొకరంధ్ర మరసి యరులు
క్రౌంచబిలమునఁ జొరఁబాఱు ఖగము లట్లు, గాన నేర్చి ప్రవర్తింపఁగాఁ బొసంగు.

కం॥ ప్రతిచింతిత మొనరింపక, కృతిఁ దీఱనిదానిఁ గొంటి కేవలముగ నా
కతన ఫల మేమి స్వాత్మవి, రతి యొక్కటి దక్కఁ గలదె రజనిచరేంద్రా. ౧౬౬

సీ॥ సామాన్యుఁగా నెంచె రామావనీంద్రునిఁ గాలుండె నీకయి కడఁగినాఁడు
కాళియే నినుఁ ద్రుంపఁగా సీత యనఁ దగి జనకుని జన్నంపుభూమి జనించె
విషమిశ్రమైన యామిష మట్టులే పీడఁబడితివి శద్దృష్టిపాలు గాక
యప్పటికప్పు డాయాగాములకు నడ్డపడె మేలు మేలు నీభాగ్య మెదియొ
మునివరుఁడు దెల్ప వింటిని మోస మింత, లేదు నారాయణుఁ డతండు లేమలక్ష్మి
యనఁగ ననద లై రక్కసు లడుగుబట్టు, వారుగా నీ కొదవె నిట్టి వర్తనంబు.

కం॥ మానక యామిష మనుకొని, మీనము బడిశమునుఁ బట్టి మ్రింగఁ దలఁచుచే
నీనెఱిఁ గన్పడె నట నే, మానో ప్రవను మెఱుంగు నాసురనాథా! ౧౬౮

కం॥ ఆమెం గోము నిఁకే మగు, నీయనౌచిత్యేతరంబు నిందింపంగన్
జేయాక సొలఁగవలెఁ దగు, సాయముఁ గొని వైరిబలము సమయింపంగన్.

కం॥ నీనెఱపిన యిక్కార్యం, బేనేర్పరి యైనఁ దీర్ప నెనసి మనఁడ పో
నానెఱి సమీకరించెదఁ, బూనిక మెయి శత్రుసమితి పొలు పెడలంగన్. ౧౭౦

ఆ॥ శక్రసూర్యలేని శ్వసనానలులయేని, నాకబేరవరుణు లైర యేని
నీదు రిపుల సర్థనిమిషమాత్రంబున, నెగిచి కముచునాఁడ నింత నిజము. ౧౭౧

కం॥ కొండవలె మహాపరిఘము, దండంబు గొని నిలిచి తీక్ష్ణదంష్ట్ర లడర బ్ర
హ్మాండము మిగుల నార్చెడు నా, దండఁ బురందరుఁడుఁ జేరఁ దలఁకక యున్నే.

ఉ॥ ఒండొకఁ డమ్ము నాటి నను నుజ్జ్వలతేజుఁడు రాముఁ డుద్ధతిం
రెండవ ముల్కి గ్రుచ్చి యనుకిత్తు నొనర్చెడు నంతలోన న
ట్లుండక త్రొవుపాఁడ నిజ ముద్ధత మస్త్రము గాన నూరటన్
దండితనంబునం బెరసి తత్పరత న్సుఖవృత్తి నుండుమీ. ౧౭౩

ఆ॥ తద్ద గూర్తు జయము దనకు దాశరథికి, స్వవధమాత్రలాభసౌఖ్య మింత
నమ్మి మనుము యూథనాథులతోఁ గపి, వరుల మ్రింగి యుమిచి వత్తు నిటకు.

కం॥ నాజతన రామలక్ష్మణు, లోజమెయి న్మలఁగనేర రోయసురవరా
మోజించిన నానో రిపు, డీజగమంతయు గ్రసించి యెడలింపదొకో. ౧౭౪

ఆ॥ ఇచ్ఛమెయి రమింపు మెనయింపు వారుణి, నవికృతిం బొనర్పు మన్ని కృతుల
నేను రాముఁ దుంప నీ కవశ్య యవశ్యమవనితనయ యాయ పక్షయముగాన్

కం॥ అను కుంభకర్ణు నుడులకుఁ, గనలుట నూహించి తేర్పఁగా నెంచి విభుం
గని పలికె మహాపార్శ్వుఁడు, ఘనసారుఁడు ప్రాంజలిత్వకలన పొసంగన్. ౧౭౬

—◆ మహాపార్శ్వుఁడు రావణున కనుకూలముగ బలుకుట. ◆—

సీ॥ ఎవ్వఁడు వనదుర్గ మెనసి బాలిశుఁడ కా కధిగతం బగు సుధ వాని కెడయు
నున్నాఁడె యాశ్వగం ద్రొక్కఁగా డీశ్వరుం డనఁబరఁగుదు నీవ యఖిలమునకుఁ
బగఱ యూదలపైఁ బాదమ్ము మోపుము జానకి రమియించు సంగతమున
కతిమి యర్మిలి సుందరాంగి భోగింపుము కుక్కుటవృత్తిమైఁ గోర్కు లలర
నాత్మకాముఁడ వైన నీకవలనొకఁడు, భయము ప్రాప్తంబగున నొండుభంగినుండు
నదియు నంతయు నోర్వ నా నంతకునకు, వెలువ విస్మయము వెలువున వెడఁగుపడెదె.

ఆ॥ కదన మొదవఁ గుంభకర్ణుండు మేఘనా, దుండు మమ్ముఁగూడి తోడరి యడరి
సాహసమునఁ దీక్ష్ణసాయకంబుల గ్రొచ్చి, వజ్రిధగునయోధి వ్రచ్చియిడరె.

క॥ ఉపదానము సాంత్వము భే, దనదమున నిపుణులు గలిగెదగు వానిని మా
ని పరాక్రమమున సిద్ధిని, నిపుణతరా! నీవు గొనమి నిష్ఠితబుద్ధిన్. ౧౦౧

క॥ పో నేల కా దనకు మది, గానేలా రిపుల నోడరి గాని మన్ననలన్
గా నగుపని గాని మన్నని, గా నీకయి కాను గుదురఁ గాదింపంగన్. ౧౦౨

క॥ అని నొడువు మహాపార్శ్వుని, యనుగుణవాక్యములు మెచ్చి యూరగవిభుఁ డి
ట్లనెఁ దనమదిఁ గల తత్త్వం, బనువున నెల్లగు వినంగ నతిగంభీరముగన్. ౧౦౩

—◆ రావణుఁడు దన రహస్యమును జెప్పుట ◆—

సీ॥ విను మో మహాపార్శ్వ! వివరించెద రహస్య మయ్యర్థ మెఱుఁగ కెవ్వండిఁ దీను
చిరవృత్త మదియును జేవాఁడెతెనమున వచ్చినదే కామవర్తనమునఁ
దిరుగుచుండి యొకప్డు దేదీప్యమాన మై యగ్నిశిఖం బోలి యాకసమున
జంచూర్యమాణ యా సన్మూర్తిఁ గనుఁగొంటిఁ బుంజికస్థల యను బోటిఁ దిమిస్న
నటు పితామహు సేవింప నరుగుచున్న, దాని నిర్బంధమున నభిమాన మెడలఁ
జేసి భోగించి యె ట్లట్లొ యాస దీఱ, వివసనయు కాఁగఁ బుచ్చితి వెలువు తీర.

ఉ॥ లోలిత మైన యన్నలిని లోలవిలోచన పోల నై సుసం
లాలిత మయ్యు దేఱని కలావిభవంబు పురోగమంబు గా
వ్రాలుచు సోలుచుం జని యవారణ ధాత పదాబ్జయుగ్మమున్
గాలువగట్టె కన్నుఁగవఁ గాఱెడు నీట మునుంగఁ జేసినన్. ౧౦౪

ఆ॥ ఆపె దెలుపఁ జెయిద మంతయు విననోపు, జాలి దోఁప సద్గుణాలవాల
మడరి నన్నుఁ బిలిచి యాదట ననె భగ, వంతుఁ డతఁడు కోపవహ్ని నెఱయ.

క॥ ఓరీ! యిది మొదలుగఁ బర, నారి న్వల దన రమింప ననిచెద వేనిన్
నేర మదె కాఁగ నీతల, వారక యొక్కొకఁడు నూఱు వ్రక్కలగుఁ జుమీ.

క॥ తప్ప దికఁ నాదు వాక్యం, బప్పటి కప్పుడె ఫలించు నని పెడను నా
త ప్పెఱిఁగి యుంట నేఁడీ, యొప్పని సీతం గొనంగ నొఱకట మయ్యెన్. ౧౦౫

ఆ॥ మున్నె రంభఁ గొన్న యన్నిట్టి కన్నుల, కూబరుండుఁ దిట్టెఁ గుపితుఁ డగుచు
నేది యెట్టు లున్న నీయమ వైదేహి, ముట్టఁగవిసి రట్టు మొనయరాదు. ౧౮౯

సీ॥ సాగరంబున లోఁతు సరస నౌ రభసంబు నాసదాగతిద యౌ నట్టి గతియు
నాయవి యంచు నెన్నఁడు రాముఁ డెడసంచుఁ గొనివచ్చుచున్నాఁడు కోల్పడంగ
గిరిసుప్త మైన కేసరిని మేల్కొలుపంగ మిత్తికోఱల నొత్తి మేల మాడఁ
దలచుట గాదె నన్నాఁకి పేరిరేచుట యాద్విజిహ్వంబుల యట్టి శరము
లడరఁ గని కానికానఁబోఁ డంతరంబు, వజ్రనిభము లౌ నవ్వాని వరుస నెఱయఁ
గొఱపు లగపడఁ బొఱెడు కుంజరంబు, ననుకరింపఁగలం డిప్పు డనగఁ నేల.

ఆ॥ ప్రబలబలము తోడుపడఁ జొచ్చి యాతని, బలము నెల్ల నేలపా లొనర్తు
సవిత యుదయ మునయఁ జాలునే నక్షత్ర, సమితి మెఱయ నెట్టిజతన మైన.

క॥ వేయుగసులవాఁడేసియు, నాయంతకుఁడేనియు న్మహాహవ మొదవన్
నా యెదుర నిలువఁజాలిరె, పాయఁడె పాశధరుఁ డట్లు పడి తోడ్తోడన్. ౧౯౧

ఆ॥ మూడుకనులవాఁడు మొనకొను చుట్టంబు, దనకు దాను మేటి దర్పమునను
విడిచినాఁడు పురము వెన్నంటఁ బుష్పకం, బొసఁగినాఁడు ధనదుఁడోసరిల్లి. ౧౯౨

క॥ ఒంటికి జంబుకుడునే ము, క్కంటికి నేఁ దలఁక నసఁగఁ గంజభవుని వా
క్కంటికొని కాల్చు నని వా. ల్గంటిఁ గవియఁ గుంటిపడితిఁ గాక భరంబే. ౧౯౩

ఆ॥ అని నిశాచరేంద్రుఁ డాడుమాటలు కుంభ, కర్ణ గర్జితములుఁ గడమవారి
వ్యర్థపదములును హితార్థ విభీషణుం, డాలకించి పలికె నధిపుఁ గాంచి. ౧౯౪

— ♦ విభీషణు ప్రౌఢభాషితములు ♦ —

ఉ॥ ఏల వరింప నెంచితి మహీజ మహాహిభుజాంతరాంచితో
ద్వేలితభోగ యార్తివిషవిశ్రుత సుస్మితతీక్ష్ణదంష్ట్రికా
జాల కరాల పంచనఖసంచితవంచశిరోతికాయ మ
మ్మేలఁ దలంపు లేనో యటి యింతకుఁ దీఱెనో రాక్షసేశ్వరా. ౧౯౫

ఉ॥ పర్వతకూటసన్నిభులు ప్రాంశునఖాస్త్రులు తీక్ష్ణదంష్ట్రులున్
గర్వితులు న్వలీముఖులు కాఱులు వల్కుచు లంకలోపలన్
బర్వులు వెట్టుచుండఁగ సుపర్వులు గన్గొని నవ్వుచుండ నా
పర్వము రాకము న్మహిజ భాసురులీనున కిచ్చు టొప్పదే. ౧౯౬

ఉ॥ వాయుసమానవేగములు వజ్రనిభంబులు రాము బాణముల్
పాయక జొచ్చి రాక్షసుల ప్రాణములున్ దలలున్ హరింపఁగా
నాయన లంచు బిడ్డ లని నాథు లటం చని పొరు లేడ్వ నా
నాయశుభంబు పాల్పడని యప్పుడె యాతని కిమ్ము తత్సతిన్. ౧౯౭

ఉ॥ ఓయి! ప్రహస్త పొంగెద వదేమో యొకయింత నెఱుంగ వో పవి
ప్రాయము లట్లు ప్రాణహృతిపర్యవసానము లైన సంధిలో
నాయకు సాయకంబు లొకనాఁడును నీతను వ్రచ్చిపోవఁగా
నాయితపాటు లైకొనమి నాయె న్వకీయవికత్థనార్భటుల్. ౧౯౮

తే॥ కుంభకర్ణుండు రాజు నికుంభకుంభు, లిందజిత్తు మహాపార్శ్వుఁ డీమహోద
రుండు నతికాయుఁడును మేటిగండ లైన, నిలువ లే రని నిక్క మన్నేత నెదిరి.

చ॥ చెనకితి వేని రాముఁ డిఁక జీవముతో మఱలంగనీఁడు ని
న్నినుఁడు మరుత్తులు న్మనుప నెంచిర యేనియు వాసవుండు పా
యని కృప నంక మందిడిన నంతకుఁ డే నని చెంతఁ జేర్చినన్
మును మనుచోట టంచుఁ దల మోప రసాతలమందుఁ జొచ్చినన్. ౨౦౦

క॥ అని విభునకు దుర్బోధన, లొనరించుట నెంచి తిట్టనోడ కితండా
తనిఁ గూర్చి యిట్లు లనె మ, న్నన గలమానిసి నటంచు నాథుఁడు వినఁగన్.

ఆ॥ మాకు లేదు భయము మహిజానిసుతువల్ల, పితికి నీవు గానఁ జెదరనీసి
పలికె దిట్లు లనఁగఁ బాడియే ప్రాణము, లిట్టు పటంచుఁ దరలి తిరిగ దొలఁగ.

ఉ॥ ఎన్నఁడు జంక మిందురిసకునేనియు దివ్యులకేనియుం దదు
త్పన్నులకేనియుం బతగపన్నగకిన్నరయక్షరాక్షసా
భ్యున్నతవర్గము ల్పెదరి యోసరిలం బెనుపొంది నేఁటి కీ
మ న్నొకయింత యేలు వెడమానిసికై తడబాటు గాంతుమే. ౨౦౩

తే॥ అనుచు నహితముగా నాతఁ డాడ రాజ, హితము గోరినవాఁడు మహీయసుఁడు
ధర్మకామార్థదర్శనమర్మవిదుఁడు, పలికెను విభీషణుఁడు ప్రౌఢభాషణముల.

చ॥ పలికిన యంత చేయఁగల ప్రాజ్ఞుఁడు వల్కనె యిట్లు లెంచి నీ
కలబల మెంటె యా బలముఁ గాంచితె నీవును కుంభకర్ణము
ఖ్యులు ననిన ట్లొనర్పగలరో రఘురామునిఁ గూర్చి పావబు
ద్ధుల కగునే సువర్గగతి తోఁచిన తీరున నన్నుఁ దిఱునే. ౨౦౪

శా॥ నీకు న్నాకును సర్వరాక్షసులకు న్మేకోలు గావించి న
క్లైకాత్మ్యగుణధాము రాముఁ బొదువన్ హింసింప శక్యంబె తాఁ
బ్రాఁకు లెట్టఁగ వార్ధి వప్లవునకున్ ప్రావీణ్య మొప్పారునే
లోకేశుం డతఁ డార్భటుల్ విని నిరాలోకుండు గానేర్చునే, ౨౦౫

క॥ ధర్మప్రధానుఁ డధికుఁడు, నిర్మలభావుండు చేయనేర్చినవాఁ డా
కర్మతుఁ దెరల్పఁగా దు, ష్కర్ములకుఁ దరంబె మాధ్యగాములు గారే. ౨౦౬

క॥ ఆతనిదగు సంగర మన, నాతామరచూలి వడఁకు నమరు లలుకటే
బ్రాఁతిమె నినుఁ బోలిన యవి, నీతుం డెటు లనినఁ జెల్లు నే ర్పరయనివాన్.

తే॥ కంకపత్రంబు లనిమొనఁ గంకటములు
వ్రచ్చి లోఁజొచ్చి యసువులఁ బుచ్చునపుడు
రాముఁ బొగడెద వోరి యరాతిభీము
నఱవఁగావచ్చుఁ గాదు లి ప్తధిపుసభను. ౨౦౯

క॥ శక్రసము నెదిరి నిల్చి యు, వక్రముఁ డీవిభుఁడయేనిఁ బరఁగున నీమీ
విక్రమము లట్టులుండఁ గ్రది, విక్రమభావంబు నెఱపు విధ మతఁ డొలయున్.

వ॥ బలవంతు లైన దేవాంతకనరాంతకాతికాయత్రిశీర్షాకంపనప్రముఖులును శైలసమానసారు లైన కుంభకర్ణకుంభనికుంభముఖ్యులును కృతమాఘవవినోదుం డగు మేఘనాదుండును నీవు నీయొడయుండును రణరంగంబున దాశరథి నెదిర్చి పేర్చి నిలువంజాల రింతయు నిక్కువంబు.

తే॥ తాను సప్తవ్యసనములఁ దవిలినాఁడు, మిత్రు లగు మీ రమిత్రప్రమితులు ప్రకృతి
తీక్ష్ణుఁ డసమీక్ష్యకారి విదీర్ణుఁ డగుచుఁ, గులము నిర్మూల మొనరించి కూలఁడెట్లు

ఆ॥ అయ్యనంతభోగ మాసహస్రోత్తమాం, గంబు భీమ మతిబలంబు నైన
నాగ మిపుడు చుట్టె నాయకు విడిపింపఁ, దలఁచు టనదుగాని దారిగాదొ. ౨౧౩

మ॥ పరిపూర్ణోత్తమకాము లై మనెదు నాపద్బాంధవుల్బాంధవు
ల్పరిరక్షింప రిదేమి భీమబలదీవ్యద్వ్యాఘ్రసంగ్రస్తు ని
వ్వరుఁ గేశగ్రహణంబు మీఱకునికి న్భావించి వారించి త
త్పరతం జూడక "యీఁదు పావన!" యన న్బాపాత్ము లై పోవరే. ౨౧౪

తే॥ సాగివచ్చెఁ జుమీ రామసాగరంబు, దివి భువియుఁ గ్రమ్మ వేల నతిక్రమించి
యాజిభూబలిసద్మంబు నందకుండఁ, గాచుకొనవలె నిపుడు రక్షఃకులేంద్ర. ౨౧౫

క॥ సహాదనుజవరము పురమును, సుహృజ్జనముతోడి రాజ్య సుఖ మొనయఁగ నే
విహితము సుహితముఁ దెలిపెద, మహిసుత రాఘవున కొసఁగు మతమగు ననుచున్

మ॥ పరు బీరంబు స్వసార మారసి మహాప్రావీణ్య మొప్పార న
వ్వరుస న్వృద్ధి క్షయంబు స్థానమును వైరిస్వీయపక్షంబులన్
వరయుక్తిం బరికించి స్వామిహితము న్వాక్రువ్వఁగాఁ జాలు నే
ర్పరి పో మంత్రి యనంగ నొంటి కరికి న్భావింప వే యున్నదే. ౨౧౭

క॥ అని యిట్లు బృహస్పతి కి, య్యనఘుఁడె తుల్యమతి యనఁగ నగు చొప్పునఁ బ
ల్కిన నాతని నుడు లెట్లో, విని వీరుం డింద్రజిత్తు వెసఁ దా ననియెన్. ౨౧౮

—♦ ఇంద్రజిత్తు విభీషణు నతిక్రమించి బీరము లాడుట. ♦—

మ॥ అగు నయ్యా! పినతండ్రి! యి ట్లనఁగ నియ్యర్థం బనర్థావహం
బు గదా భీరుత యేల పాల్పడితె నీవు ట్టీకులంబందు వే

చ॥ ఎదు రయి యాజి రామవిభుఁ డేయు శరంబులు మృత్యుతుల్యము
ల్చదలునఁ గాల్చుచుం బఱచు జ్వాలలుఁ దోడుగ నీడఁబోని వై
యదనునఁ గాలదండములొ యాతుయకాలకృశానుమూర్తులో
కదె యనఁ బైకొన న్నిలువఁ గర్బుర యొక్కఁడ యేని శక్తుఁడే. ౨౨౮

ఉ॥ మాయలు మంత్రము ల్నిగిడి మండెను నాఁటికి నేఁడు యోద్ధుకా
మా! యతిమాయుఁ డంచదతిమానుషకాయుఁడు డాయవచ్చెఁ గ
న్మాయఁగనీయఁ డాదానల మూతు లెడల్చి మొగమ్ము సూప నీ
చాయకు వింత వచ్చెఁ గొని సాగెను రాముని సాయకౌఘముల్. ౨౨౯

ఆ॥ పిన్నవాఁడ నెట్లొ పేరును జెప్పను, గన్నవాఁడ వింకఁ గాఁగలాడ
వున్నప్రాభవమ్మొ మిన్నకచనఁ జన్న, సన్న యొకఁడుఁ గలదె సరణి వలదె.

వ॥ అని యిట్లు లాతని నోనాడి ధర్మపథానుసరణంబున రణంబునం బేరువాడ నైన యవ్వాఁడిమగండు మోడి నీడనివాఁ డయ్యు వీఁడు దోడునీడ కదా యని దాయ యనక తోడిపుట్టునం బట్టి నెట్టనం దెరల్పరాని వాత్సల్యంబునకు వశ్యుం డై లోకవిద్రావణు రావణుం దిలకించి యల్లనల్లన ని ట్లనియె. ౨౩౧

శా॥ అన్నా నాపలు కాలకింపు తఱి యె ష్టన్నట్టులే కాదు నీ
బన్నం బారయలేక నే విడువకే భాషించెదన్ సూనృతం
బన్నాలీకభవాదినంద్య రఘురామాధీశు సేవింపు మే
మన్నం గా దిఁక వీడుకో ల్నెఱప నన్యాయంబు వాటిల్లెడున్. ౨౩౨

ఆ॥ మాన్య సీతఁ గొంచు మహిజానిఁ జేరంగఁ, జని యమూల్యవసనసముదయాఢ్య
రత్నరాజిశోడ రామార్పణం బంచు, రాము నొసఁగ నగు నిరామయంబు. ౨౩౩

క॥ కన్నత్తి తేఱిచూడఁగ, నెన్నికగలవాఁ డొకండ యేనియు గాఁ డా
తెన్నున మను ని న్నొవ్వని, మన్నిలం దెట్టి తలఁపు మలగొన నైనన్. ౨౩౪

తే॥ అనుచు సునివిష్ట మై హితమై తనర్చు, పలుకు వలికెను తమ్ముని పాడి మెచ్చ
కసుర యిమ్మయి కఠినోక్తు లాడఁజొచ్చెఁ, గాలుఁ డాఁకొని ప్రేరేపఁ గంజనయన!

—♦ రావణుఁడు విభీషణు నిందించి వెడలనడచుట ♦—

సీ॥ వసియింప నగు మేటి వైరితో నైన రుష్టాశీవిషంబుతో నైనఁ గూడి
కూడదు కూడ దకూర్కుళి మిత్రపర్భుం డరిసేవి యగువాని యండఁ గొనఁగ
నెఱుఁగుదు జ్ఞాతుల కెల్లలోకంబుల శీల మొక్కఁడు గాఁగఁ జెల్లుచుండు
నవ్వుచుందురు వ్యసనములు పాల్పడ మేల్లు గూడిరా లోలోనఁ గుందుచుందు
రెందునుఁ బ్రధానుఁ డైన గుణోన్నుఁ డైన, వేత్త యైనను ధర్మప్రవృత్తుఁ డైన
శూరుఁ డైనను మెచ్చరు చూతురు తఱి,గాఁ బరాభవ మొనరింపఁగడఁగుచుంద్రు.

శా॥ ఓరీ! నీమొగ మింకఁ జూడఁ జను నెట్లో మంటి లే యిట్టి దా
దారం బల్కియు నన్నుఁ డిట్టు లనినం దత్కాలమే చచ్చువాఁ
డౌరా రాక్షసవంశపాంసనుఁడ వీ వైనాఁడవీపొత్తునన్
శ్రీ రాజిల్లదు మమ్ముఁ గూర్చి చెడు గీశీలమ్ము మూలమ్ముగాన్. ౨౪౯

కం॥ హా హా మ్మని తోఁచిన న, ప్పాపాత్ముని వ్రేటు పరుషభాషణములుఁ ద
న్నేప నయవాది యన్వయ, దీపకుఁడు విభీషణుండు తేఁకువ వెలయన్. ౨౫౦

—◆ విభీషణుఁడు రావణపరాభూతుఁడై యాకసమున కెగసి చివరమాటలు పలుకుట. ◆—

కం॥ నలువురు దనుజులు తనతో, నలఘుతరము గత మటంచు నలరుచుఁ దరలన్
బలుగదఁ గొని గొనకొని యు, క్కలనన్ దివి కెగసి యున్నఁ గని యిట్లనియెన్.

ఆ॥ తనదు మేల కోరి తగనాడ వినని వాఁ, డయ్యె నదియ చాలు నతనిఁ దిట్టి
యోరి యనేల తలఁచె ద్రోహి నాఁ డింకెట్టు, గాలకుండు వాఁడు కంబుకంఠ!

ఉ॥ ఇంకను నాపయిం గినిసి గొట్టుటకు లాడఁదలంచినాఁడ వా
వంకన పోవనిమ్ము నిజవాగ్విభవమ్ము గురుండ వంచు నా
శంకత నేమియుం బలుకఁజాలదు నో రఘ మన్న నింతయుం
జంకదు నీమనం బని పరిసక్తిఁ దొంగుటకై తలంగితిన్. ౨౫౩

కం॥ పితృసముఁడు జ్యేష్ఠుఁ డనుట వి, దితమే గ్రామునఁ బ్రసక్తదిగ్భ్రముఁడవు నీ
మత మొప్పు దన్నుతి మగుటఁ బ్ర, స్మృత యమ్యోం బరమగతియు సిద్ధి పొసఁగునే.

ఆ॥ ఏ సహింపఁజాల నిట్టి పాపము హితు, నృత్తిఁ గఱపు పెల్ల విషము మన్యు
నరయఁబోకు మంచి నకృతాత్ములైన వారు, కాలవశతఁ జిక్కి కూల లగుచు.

కం॥ ఇచ్ఛకముగఁ బలికెడువా, రిచ్చ నొయి న్వినెడువారు నెందు సులభులే
యచ్చపుఁ బథ్య మనన్ విన, బొచ్చె మెడయు జనులె దుర్లభులు భువి దేవా.

తే॥ కలుగు భూతములనుఁ గట్టు కాలపాశ, మునకుఁ గన్పడి సిల్లయై మొనయువానిఁ
గాల నైన గృహంబునఁ గని యుపేక్ష, సేయఁబోలమి నిమ్మెయిఁ జెప్పవలసె.

కం॥ లయ పావకసంకాశము, లయమిత్రగతులైన రాము నస్త్రంబులచే
తయ మొందెదు నినుఁ గనలే, కయ్యొడరితి నింతవట్టు గాఱులు వలుకన్.

కం॥ కాలాభిపన్నులగువా, రేరిలఁ గృతాత్ములైన నెంత బలమునన్
గ్రాలినఁ గూలుదు రొక్కట, వాలుకసేతువుల యట్లు వడిఁబడి యధిపా. ౨౫౯

కం॥ కాలుఁడు కాళియు సీతా, లోలుఁడు జనకజయు నాగ లోకము భరముల్
జాలి హరింపఁ బొడమినా, రాలలిఁ ద త్ప్రేరణమున నరయవు సరణిన్. ౨౬౦

సీ॥ ప్రకృతి కవ్వలివాఁడు పరమాత్ముఁ డీ రాముఁ డఖిలభూతాంతరంగాంచితుండు
బ్రహ్మాదులలో నగ్గిమాడ్కి నొక్కండయ్యు నానాత్వ మంది తన్మయత నుండు

నజ్ఞానదృష్టుల కాకృతిభేదంబు గనుపట్టు జ్ఞానులు గాంతు రొకటఁ
బరఁగు రంగులపొంతఁ బటికమ ట్లతఁ డొప్పఁ బంచకోశాదిసంప్రాప్తి ననసి
నిత్యముక్తుఁ డయ్యు నిజమాయ గొనముల, భేదమునను వింత పేళ్లు వెలయఁ
గాల మని ప్రధానకం బని పూరుషుం డనియు వ్యక్త మనియుఁ దనరు నెపుడు.

క॥ జగముల నెల్ల సృజియించును, వగ కాఁడు ప్రధానపురుషవర యోగమునన్
జగముల కలనల నడపును, జగదాత్ముఁడు కాలరూపసద్భావమునన్. ౨౬౭

ఆ॥ అట్లు కాలరూపుఁ డా భగవంతుండు, రాముఁ డగుచు మాయ గాఁ బ్రనత్తి
బ్రహ్మ వేఁడ నిన్ను వధియింపఁగా వచ్చె, నతని గా తలంపు విశద మగునె.

క॥ నిను నీవారినిఁ బొలియిం, చును రాముం డిందుఁ జొచ్చి చూడఁగ మును నే
చనియెద నాతని గొలువుం, గొన నపరిచ్ఛదము గృహముఁ గొనని తెలఁపునన్.

క॥ నాతప్పు సహింపుము ని, న్నీతఱి పింత మొంచి యెట్టులేని ననిన చౌక
భ్రాంత వగుట నొడివెదఁ బురి, నీతనువుం గాచుకొను మనిందుఁడ వగుచున్.

తే॥ స్వస్తి యగుఁగాత మేగెద సౌఖ్య మందు, మేను లేకుంట ననసి వింత ముందుఁ
బరఁగు మదె లెన్న గద యెల్లభంగి నిచ్చ,వచ్చుదారి సులంగు నవ్వాలను మీఱియు.

—♦ విభీషణుఁడు తల్లి యనుమతిఁ గైకొని శ్రీరాముని శరణాగతుఁడు సేఁగఁబోవుట ♦—

చ॥ అని యిటులాడి యాయనఘుఁ డచ్చటు వీడి సొనంగు సాడి న్నే
జనని పదంబు సేరఁగని సాగిలి మ్రొక్కి ప్రసక్తమెల్ల నె
ట్టన వివరించి నీకృపఁ గడంగెద రాముని గొల్వఁగా ననన్
దన కడగొట్టుబిడ్డఁ గని తద్దయు వత్సలభావ మొప్పఁగాన్. ౨౬౮

క॥ కైకసి విశ్రవుకరుణా, శ్రీ కాస్పద మై ముదాప్తిఁ జేన్నారిన స
త్ప్రాకటయశోనిధానం, బాకాలం బతనిఁ దివిచి యని నిట్లనుచున్. ౨౬౯

క॥ ఓచెల్ల వేరటుపడితే, నాచల్లని కానుపా! వినమ్రుఁడ వగుచున్
రాచదొరఁ గొలిచి మనఁ జన, యాచించెదె నాదు ముదల నందెడు నిచ్చన్.

తే॥ నీదుధర్మవె నిను మన్చు నిర్మలుఁడవు, తండ్రితాతల కీర్తిఁ దద్దు నిలిపి
తనదు గా దీకృతియు నిక్క మరయ గురుల,మైన దుష్టభగతుల నెయ్యంబువలనే

క॥ పొమ్మన్న చిరంజీవివి, గమ్మన్నా! రామవిభుని కారుణ్యమునన్
రమ్మన్నా మహితుఁడ వై యిమ్మన్నా! మహము మరల నీకన్నులకున్. ౨౭౧

ఆ॥ అనుచు బుజ్జగించి యాశీర్వచించి యా, యమ యనుజ్ఞ సేయ నంతవట్టు
దన కుటుంబినికినిఁ దార్కాణ గావించి, వెడలె నతఁడు సచివవితతిఁ బెరసి.

క॥ అసత్యసంధుఁ డిమ్మెయి, దా సంధాన మొనగూర్చెఁ దద్దయు నెదకున్
బ్రాసంగిక మగు రామప, దాసంజితభక్తిసార మగు తత్వమునన్. ౨౭౩

మ॥ కొలుతున్ రాము పదారవిందములఁ గోర్కొల్లఁ గ్గదా సంపదల్
దలఁతున్ బ్రహ్మపదార్థ మబ్బె ననుచుం దద్వ్యాప్తినై నెప్పుడున్
మలఁతున్ స్వేంద్రియపంచకాఖ్య మగు నమ్మర్త్యభవర్గంబు దే
వలతుం దత్వపదైకసాధ్య నయ మొప్ప న్ముక్తిరామామణిన్. ౨౭౪

క॥ నే ధన్యుఁడ న్నతి జగ, న్నాథుని కొలు వబ్బె నింక నాయన నను సం
బోధించి రమ్మనసోమును, రోధింపరుగా నయాకరు ల్కేశవరుల్. ౨౭౫

సీ॥ ప్రొద్దుప్రొద్దున నె యప్పురుషోత్తముని గాంచి యాదరంబున సేవ లరయుచుండు
నవనవోన్మిషితము ల్నాయన్న పాదారవిందము ల్భద్భక్తి వెలయఁ దలఁతు
నిదుర దేలిన సామి నేత్రమ్ము లాకను ల్జిలుగు రుమాలఁ జేర్చి తుడుతు
గద్దియ నలకొల్పి కాంతు దీఱ నొనర్తు నర్ఘ్యపాద్యాదిసమర్పణంబు
చాలుగొజ్జంగిపన్నీట జలకమార్చి, తడవి తడియొత్తి మంగళార్థము లమర్చి
మేటి కస్తురితిలకమ్ము మేళవించి, పూజఁ గావింతు మేల్మేలి పూవు లేర్చి. ౨౭౬

క॥ ఆదటఁ దగు నుపచారము, లాదృతిమంగూర్చువాఁడ నధికం బగు సం
మోద మిడ వేదమార్గము, దేవుఁడు గాననయ్యె నరమఱ లున్నే. ౨౭౭

క॥ కనుఁగనఁ దచ్చరణాబ్జము, లనవరతం బద్దఁగలుగు నంతటిభాగ్యం
బనుపదమే తనరారెను, దనకై తాఁ నన్నుఁ బోలు ధన్యుఁడు గలఁడే. ౨౭౮

క॥ అని నెమ్మది నుప్పొంగుచు, ననుపమునఁ దనమునుం దటం దహార్పతిఁ దేజం
బున మీఱుచు నప్పథమున, ననంతరము కదలె జలరుహాసనవినుతా. ౨౭౯

క॥ త్రైగ్తిరకాంత్రుం దైతై యుక్త మిదే యనుచు సంపదున్మేషికలా
యుక్తుఁ డగు రామసేవా, రక్తుం డేతే వాఁడు చనియె రాజీవాక్షీ. ౨౮౦

క॥ ఎన్నన్ని తనువు లెనసిన. నెన్నికఁ గన్నన బుడమి నేలినఁ దుది నా
పన్నుఁడె యూరఁ గా దది నం, పన్నత్వం బిదియ చూవె పర్వతతనయా. ౨౮౧

క॥ అని నల్లభుఁ డటేఁగించిన, విని పార్వతి పిన్ననవ్వు వెలయఁగ నీ వ
య్యనఘుని శరణాగతి న, ట్లనెదో యెడది వేగఁ గూర్పు మనివేఁడుటయున్.

చ॥ సుజనవిధేయ దర్పణనిభుందన తిర్పతినాకలోక స
ద్విజనసమానలోక గుణవార్ధి వివేకకలాకలాప భా
వజనిపకాగకోటిన ప్రభావవాతేషణాన్వితిలక్ష్య మ్మ
త్యజయనిగాపదున్నతమహాదయనా యజయాసమాశ్రితా. ౨౮౩

క॥ పరమైశ్వర్యగుణాకర!
వరవిక్రమ యోగివర్య వర్ణితచరితా
సురుచిరమహిమాఢ్య శుభో
త్కరసంపత్ప్రభవ నిఖిలకారణవిభవా. ౨౮౪

స్రగ్విణీ॥ శుక్లకర్మాఢ్యసంస్తూయమానక్రమా
విశ్వబాహ్రాకృతావేలవాక్ప్రౌఢిమా
యుక్తమాయత్నితావ్యాహతామేయస
త్యక్తిదిప్రాపితార్థశ్రితాంచద్దయా. ౨౮

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబున
యుద్ధకాండంబు పూర్వభాగంబునం
ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీశివాయగురవేనమః.

# శ్రీరామకథామృతము

## యుద్ధకాండము.

———:o:———

### పూర్వభాగము - తృతీయాశ్వాసము.

———:o.———



శ్రీకరుణాయితవీక్షా
ప్రాకరణికవిషయవిజ్ఞభావాంచిత దీ
క్షాకలితార్థజనానయ
నాకల్పితరామరక్షయఖిలాధ్యక్షా. ౧

ఆ॥ అనఘరిపుమయ్యా యచలేంద్రతనయతోఁ, నిట్టులనియె శర్వరీంద్రముకుటుఁ
డతివ ! రామచరిత మద్భుతామృత మని, యనఁగలేరు లోక మరయువారు. ౨

తే॥ వనిత ! యప్రాకృతార్థంబు వలనెఱింగి
ప్రాకృతేంద్రియార్థముల చేడ్పాటు దలఁచి
సకలసంత్యాగ మొనరించి చనియె నసుర
రాము సహాలక్ష్మణును మనోభిరాముఁ దఱియ. 3

ఆ॥ మెఱుఁగు మెఱసినట్లు మెఱయుచు మేరుశృం, గాకృతిం దనర్చి యాకసమునఁ
దోఁచువాని వాని దోషాచరేంద్రుని, యనుజుఁ గనిరి వానరాధిపతులు. ౪

క॥ తనతోడివారితో నా, ఘనుఁ డైదవవాఁడు గాఁగఁ గనుపట్టఁగ న
ట్టనఁ గపినాథుఁడు హరివరు, లనుఁ గొని చింతనకలాభిలాషుఁడయ్యెన్. ౫

క॥ మతిమంతుఁడు దుర్ధర్షుం, డతులశ్రీముఁ డశోకముహూర్త మాలోచన మా
యతిఁ గూర్చి మతి నెఱపి స, న్మతులు హనూమన్ముఖులు వినఁగ నిట్లనియెన్.

సీ॥ కంటిరే వీఁడు మిన్నంటి సన్నద్ధుఁ డై యుక్కునైఁ బర తెంచుచున్న వాఁడు
వీనితో రాక్షసవిరులు నల్వుర ట్లరుదెంచువారు నై హేయసగతి
మేటిశూరుఁడ కాని మేకొనఁబోవ డీయర్థ మనాలంబ మనఁగఁబోల
దాకస్మికం బగు రాకయే వ్యాపాద మెఱిఁగించుచున్నది యింతవట్టు
మీరు బుద్ధిమంతు లారూఢిమై మించి
కాంచి దేశకాలకలన లరసి
తెలుపుఁ డిందుఁ జొచ్చి తెఱఁగెంచి తఱిఁబొంచి
యలఁచువాఁ డటంచుఁ దలఁచువాఁడ. ౭

మ॥ అను సుగ్రీవుని పల్కుల న్వినఁగనే యవ్వానరు ల్తత్తరం
బున సాలంబులు శైలము ల్గొని దొరా! మున్నాడి యి మ్మాన న
మ్మానము ల్వాంగెడు నిద్దురాత్ములఁ గలంమాత్రమ్ములోఁ దుంచి తె
ప్పున నప్పంటవలంతికిం బలియిడం బుణ్యాహ మూహించుచున్. ౮

ఆ॥ అనుచు వార లొంటఁ గనుచు నన్యోన్యసం, భాషణము లొనర్చి ప్రబలుచుండ
నావిభీషణుఁడు మహాబ్ధి యుత్తరపుఁదీ, రంబుఁ బెరసి యంబరంబు దొరసి. ౯

క॥ నిలువఁబడి మహాప్రాజ్ఞుఁడు, కలితమహాస్వరత ఘోసఁగఁ గానచ్చటి నా
వలనారసి సుగ్రీవు, న్వలీముఖులఁ గాంచి పలికె వాసవవినుతా. ౧౦

ఆ॥ రావణుం డనం గరంబు దుర్వృత్తుండు, రాక్షసేశ్వరుండు రక్కసుండు
గలఁడు వాని కేనుఁ గడగొట్టుతమ్ముఁడ, నటు విభీషణాహ్వయశ్రీసుండ. ౧౧

ఆ॥ అతఁడు దెచ్చె సీత నాజనస్థానంబు, వలను బాపి గృధ్రవర్యుఁ దునిమి
దేవి రుద్ధ వివశ దీనయు నై యుండె, రాక్షసీజనాభిరక్ష నఱల. ౧౨

ఆ॥ వాని కరసి యొరసి వలయు హేతూక్తులు, నెఱయఁ దెలిపినాఁడ నేఁటివఱకు
సీత లోకమాత శ్రీరామునకు జగ, న్నేత కొసఁగు మనుచు నెఱిపొసంగ. ౧౩

తే॥ కాలచోదితుఁ డై వాఁడు కల్లసేసెఁ, బథ్య మగు నాహె నర్చిన భాషితంబు
హిత మగున యోగ్య మౌషధం బెందు నేని,రోగి విపరీతుఁడై యొండురోయుచుండ

క॥ పరుసములు పలికె నెట్టనఁ, బరాభవంబునకుఁ గూర్చెఁ బాపుఁడు నన్నుఁ జా
కిరివానికన్న హీనపుఁ, దెరువున నదలించి తిట్టి తెరలించి వెసన్. ౧౪

క॥ ఇక్కరణిఁ ద్రోపువడి యే, దిక్కున్నక రామవిభుఁడె దిక్కనుమతి నా
చక్కటిదారసుతాదుల, నిక్క న్విడనాడి విరతి నిట రాఁగంటిన్. ౧౫

తే॥ సర్వలోకశరణ్యుఁడు సాధువత్స
లుఁడు మహాత్ముండు నగు రాఘవుఁడు వినంగ
వీఁడు శరణార్థి యని నాదు విధము దెలియఁ
బలుకుఁడో యన్నలార! మీ ప్రాపు వెలయ. ౧౭

క॥ అని యిమ్మెయి నొడివిన దను, జునిఁ గని లఘువిక్రముండు సుగ్రీవుఁడు రా
ముని లక్ష్మణసహితునిఁ జే, రి నితాంతవ్యగ్రతం బొరిం దాఁ బలికెన్. ౧౮

— సుగ్రీవుఁడు విభీషణుఁ జేకొనవల దని సహేతుకముగఁ బలుకుట. —

ఆ॥ అరికిఁ జిన్నతమ్ముఁ డట విభీషణుఁ డని, పేరుఁగాంచెనట యభీకు లైన
నలువు రసురవరులు నలువంకలం గొల్వ, వచ్చినాఁడు శరణుఁ జొచ్చినాఁడు. ౧౯

తే॥ రావణావరజత్వంబొడి రభస మరసి, మంత్రిణవ్యూహనయచారమార్గయుక్తి
నెదిరి తమవారి పక్షంబు లెన్ని కడఁగి, నెఱపు మీ కృతి నొ గాత నీకు శుభము.

సీ॥ పొలదిండ్లు కామరూపులు దుష్టు లంతోద్ధ నంది మిన్నందుదు రధికశూరు
లెదిరి వంచింపఁగా నెంతయు నేర్తురు విశ్వసింపఁగ రాదు వీరి నెపుడుఁ
బ్రణిధి కావచ్చును రాక్షసేశున కీతం డనువిష్ణుఁ డై భేద మందఁ జేయుఁ
గాదేనిఁ దెలివిమైఁ గదిసి నమ్మించి నెట్టన ఛిద్రమరసి మడఁపఁజూచుఁ
బేర్చు మిత్రాటవీమూలభృత్యబలము, లెన్నియు గ్రహింప నగునుఁ దీరెంచి కడఁగి
కాని శత్రుబలం బెందుఁ గాదు చేర్పఁ, దతగుణోద్దామ నయసంధ్యధామ! రామ!

ఆ॥ శత్రువలను గడచి సన్నద్ధుఁ డై వచ్చె, భ్రాత ననుచు నీదు పక్ష మనుచు
నమ్మఁగూడు నెట్లు నాతండ్రి! యిమ్మెయి, ములుకువాని నలికిపలుకువాని. ౨౨

తే॥ రావణప్రేషితుఁ డై విరాజితుఁ డగుచు, వచ్చినాఁ డిట్టు లోకైకమవద్వరేణ్య!
కుటిలమతి వీనితోఁ గూర్మిగూడ దనియు, నిగ్రహం బొప్పుననియు నా నిర్ణయంబు.

ఉ॥ రాతిరి వేచి మేకొని యుగాతి యులూకము వాయసంబులన్
ఘోరత మొప్పఁగా మడఁచు పోలిన సట్టులె లాతి యంతరం
బోరటి నైనఁ దాఁ బడయు నెంచును స్వోదరపక్షమందు దో
షారత వృత్తి మైఁ దతియనొ నతని న్నిలకొల్పి రాఘవా. ౨౪

క॥ మాయావియు నిను నీతఁ డ, మాయికుఁగా నెంచి యొకట మలయించి ధృతిం
బాయక నమ్మించి తుది న, పాయం బొనరించుఁ దనయుపాయము మెఱయన్.

ఉ॥ కావునఁ దీవ్రదండమున ఘాతుకుఁ డౌ దనుజేంద్రు తమ్మునిం
గావ కడంచు టే వెరవు గల్గును మే లటులైనఁ గాని చోఁ
గావలుఁ డౌదు రాగతుఁడు కట్టడి యై తలపెట్టినంత లో
నే వివరించినాఁడ నభినేతవు నేస్తమువు నీవ యింకిటన్. ౨౬

ఆ॥ అనుచు రాముఁగూర్చి యాహరివాహినీ, పతి పదార్థవేత్త పలికి సభను
మడఁచికొనుచునుండె నాదట మౌనంబె, యూ నటంచుఁ దాని నవధరించి. ౨౭

తే॥ చాలి సుగ్రీవుఁ డటు నెఱి జాలుకొనఁగ
నోలి నొడువంగ విని కీర్తిశాలి యార
ఘూత్తముఁడు హరివర్యుల నాప్తబలుల
హనుమదాదులఁ గని యిట్లు లనియె నగజ! ౨౮

ఉ॥ రక్కసుతమ్ముఁగూర్చి కపిరాజు వచించిన దెల్ల వింటిరే
యక్కఱఁగూర్చు పల్కు యది యంతయు సత్యమొ హేతుయుక్తమే
నిక్కమె యైనఁ గర్జమున నిర్ణయముం బొనరించువట్లఁ గా
దొక్కనిపైని భార మిడి యొప్లోకఁ డాడక మిన్నకుంటయుక్. ౨౯

ఆ॥ అర్థకృచ్ఛ్రముల సమగ్గులు శ్రేయోగ్గు
లట్లు సుమతు లనఁగ నౌ సుహృదుల
కొప్పు యుక్త మిది యయుక్తమియ్యది యంచు
స్వస్వమతము లొంట జాల్కాలువుఱ. ౩౦

— రాముఁ డడుగ నంగదాదులు తమతమ మతములు చెప్పుట —

క॥ అని రాముఁ డడుగ నాఘును, లనుపద మిట్లని రతంద్రితాత్ము లగుచు న
మ్మనువంశమణి ప్రశంసం, బొనరించుచు హితముఁగోరు బుద్ధి వెలయఁగన్. ౩౧

శా॥ అజ్ఞాతం బొకఁ డున్నె యెందు జగదధ్యక్షుండ వౌ నీకు సం
విజ్ఞత్వం బసదృక్షమైనను సుహృద్విఖ్యాతి మా కీయ లో
కజ్ఞత్వం బిటు చెల్లఁజేసితివి నీకారుణ్య మిట్లొప్పఁగా
యాజ్ఞాబద్ధుల మైతి మిందఱము మిత్రాధ్యన్వయశ్రీకరా. ౩౨

తే॥ అధికశూరుఁడ వట్లు సత్యవ్రతుఁడవు, ధార్మికాగ్ర్యత విక్రమదృఢిమ నీక
చెల్లు నఖిలజ్ఞుఁడవె పరీక్షించి చేయు, దన సుహృత్పరతంత్రత యబ్బి మగు నె.

క॥ ఈనీయడిగినయర్థముఁ, బూని వచించుదురుగాత బుద్ధికుశలు లె
ద్దానను సమర్థులును నగు, వానరవరు లొక్కొకఁడుగ వారనియుక్తిన్. ౩౩

క॥ అని వారలెల్ల నొడువగ, ననంతరము రాముతోడ ననె నంగదుఁ డో
యనవద్య! యరివలనివాఁ, డనఘుఁడె యాగాక తొలుత నగు శంకింపన్. ౩౪

సీ॥ ఓల మాసించిన ట్టుందురు ప్రచ్ఛన్నులై శఠబుద్ధు లొంం డదనునందు
తఱివేచి ప్రహరింతు రారాక్షణగా నంతరంబు గన్గొని యచిరంబె కడఁగి
కాన సీతని నమ్మి కాదు వర్తింపంగ నొంట నియోగించి యుక్తి నెఱయ
గుణదోషముల నెంచి కొలఁలు న వ్వానిలో గొన మెక్కుడైననొఁ గూర్చుకొనఁగ

దోష మెక్కు డైనఁ దోఁత్రోనె తరలింపఁ
జనున కాని సాహసము పొసంగ
దనుచుఁ దలఁచువాఁడ నంతెయు నీ
మది నరయుమయ్య రఘుకులాగ్రగణ్య. ౩౬

క॥ అన శరభుం డిట్లనె నీ, తని దెస కొకదూత ననిచి తత్త్వం బరయం
జను నావలివలనున నగు, ననువునఁ బొనరింపఁ జెల్లు నంతయు నధిపా. ౩౭

ఆ॥ అనిన శాస్త్రవేత్త యగు జాంబవంతుండు, పలికెఁ బాపుఁ డసుర బద్ధవైరుఁ
డతని యనుజుఁ డీతఁ డరుదెంచె నసమయ, మనక కాన శంక్యుఁ డవనినాథ. ౩౮

చ॥ అనిన నయానయజ్ఞుఁడు పదార్థవిశేషవిదుండు మైందుఁ డి
ట్లనె జని యుల్ల నర్మమధుర మౌ నుడి రావణుఁ గూర్చి యీతనిం
దొసుకక పృచ్ఛసేసిన నదుష్టమొ దుష్టమొ భావ మేర్పడున్
గని వివరింప నౌ తెఱఁగు గైకొనఁగా నగునయ్య రాఘవా. ౩౯

—♦ హనుమంతు నభిప్రాయము. ♦—

తే॥ అనిన నాదట సచివోత్తమాగ్రగణ్యుఁ, డధికసంస్కారసంపన్నుఁ డైన హనుమ
మృదుమధురతార్థవత్త్వాసమృద్ధ మైన, పలుకుఁబడి నెల్ల నిట్లనె భాసురాంగి. ౪౦
తే॥ నిన్నతిశ్రేష్ఠ సుసమగ్ర నియమితాత్మఁ, బలుక నేర్చినవారిలోఁ బ్రథమగణ్యు
నతిశయింపఁజాలఁడు బృహస్పతియనంగఁ, దరమె యొకనికి రామచంద్ర! గుణసాంద్ర.
క॥ వాదమునను స్పర్ధానం, భేదమునను వాఙ్మయోపబృంహణమున ని
చ్ఛాదిపరివృత్తిపరతనుఁ, గాదేను వచించుపొంటెఁ గడఁగుట రామా. ౪౨
క॥ సిడగు గౌరవమునను ని, వేదింతు యథార్థ మర్థవివరణ మిదియున్
గా దన కారయు మిం దా, మోదం బిసుపట్టునం బ్రముఖ్యం బెదియో. ౪౩
క॥ పలు దెఱఁగుల నీసచివులు, పలికిరి నయ మందు నందుఁ బరికింపనగున్
దొలుత సమాగతుని, బరీ, క్షల కిడి చేర్చుకొను టున్నజను మహితాత్మా. ౪౪
ఆ॥ ఏనియోజ్యమందు నేని నియోగింప, కరయఁబోల దతని యంతరంగ
మదియుఁ గూడు నట్టు లాకస్మికం బౌట, నైన నవధి గలదె యట్టిక్రియకు. ౪౫
క॥ చారప్రణిధానాత్మక, కారణ ముపయుక్త మనుట గా దెన్నఁగ సం
చారణ మేల యెదుట వా, చారంభణముం బొనర్చు నాతని దెసకున్. ౪౬
ఉ॥ ఈతఁ డదేశకాల మన కీ దెస కిట్లరుదెంచె నంచు వీ
రీతఁడెఁ బల్కు రప్పలుకు నెంచి వచించెద దేశకాలముల్
ప్రీతిగ నిప్పుడే యనచుఁ బౌరుషమందలి దోషగణ్యతల్
నేతలపట్లఁ దా నరసి నెట్టన రానగు చొప్పు చొప్పడన్. ౪౭

తే॥ అచటిసారాత్మ్య మిచ్చటియతిశయితము, విక్రమము బుద్ధి నెంచి యుద్యోగమునను
వచ్చుటయె యుచితం బనవచ్చుఁగాద, నేర్చి మెలఁగెడివాఁ డెందు నెగడకున్న.

క॥ అజ్ఞాతరూపులుగఁ జని, ప్రాజ్ఞత్వమె నడుగఁ దేటపడును దదీయం
బౌ జ్ఞాతభావ మని రది, విజ్ఞత్వమె నెంచిచూడ వెలయ దధీశా. ౪౯

తే॥ అడుగువానికిఁ జెప్పెడునతఁడు చాలఁ,
డెంతధీమంతుఁడును నాగ నెనసి యరుమ
మంచివాఁ డైన హితుఁ డైన మాఱుపడునుఁ
దోఁచితోఁచనిగతివంక దూష్యుఁ డగుచు. ౫౦

తే॥ వక్రీభావంబు తనమది వఱలుచుండ, నేర్చి యడిగిన నదియును నిష్ఫల మగు
నతఁడు నమ్మెయి యర్థంబె యనువుపఱుప, నెవరితెల్పొ నేర్పడమియ కుదురుపడుట.

ఆ॥ వీఁడు పలుకుచున్న వాఁడు తెల్లముగ స్వ, స్వస్థ మెల్ల నెందు వెదకిచూడ
దుష్టభావ మింతఁ దోఁచఁడు వ, నన్నుముఖము నవ్వ మెన్నఁగడఁగ. ౫౨

తే॥ స్వస్థుఁడు నశంకితుఁడు గాఁగ శఠుఁడు మెలఁగఁ
జాలఁ డుక్తియు దుష్ట గా కేలనిలుచు
నాఁగిన నడంగునే తన దైన వికృతి
యాకృతియె నిజ మాంతరం బనువదింప. ౫౩

ఉ॥ కావున దేశకాలములఁ గాంచి ఘటించిన కర్జ మెట్టులుఁ
బోవక సిద్ధి మైకొను బ్రసిద్ధుఁడ వారయుమయ్య దుష్ట యా
రావణు వృత్తి నీకెతె వరాక్రమమున్ ఘను వాలిఁ దున్చి సు
గ్రీవుఁ బ్రభుం బొనర్చుటయు గీర్తిత! తావకకీర్తి నెంచుచున్. ౫౪

క॥ నినుఁ గొలువవచ్చె నీతం, డనయము నయవేత్త రాజ్య మన్యాపహార్యం
బని తలఁచి కాన వీనిం, గొననగు నని నే నచింతు గుణరత్ననిధీ! ౫౫

ఆ॥ ఇతని యార్జవమ్ము నింతవట్టుఁ దలంచి, పలికినాఁడ దెఱఁగు పరఁగు నిట్టు
లని స్వశక్తియుక్తి నాచట శేషార్థ, మెల్ల నీదు బుద్ధి యెఱుఁగు నధిప! ౫౬

క॥ అని వాయుజుఁ డెఱిఁగించిన, విని దుర్ధర్షుండు రామవిభుఁడు ప్రసాదం
బునఁ బొనరి యాత్మనిహితం, బనఁ జను శ్రుతి మొలయ నిట్టు లనె వేదశిఖా.

—• శ్రీరాముఁడు తన యభిప్రాయముం దెలుపుట •—

తే॥ ఏనును విభీషణుంగూర్చి యెదియొ కొంత, పలుక నెంచితి నదివుల్ల భావవిదులు
మీరు నాశ్రేయముం గోరి మెలఁగువార, లందఱునువిని యాత్సర్య మరయువారు.

సీ॥ శరణార్థి నని మైత్రి నలుప నేతెంచిన వాని నెప్పాట నే వదలఁజాల
నవ్వాని దెస దోస మతిభరం బనఁగ నై యుండిన నైన దఱ్గొండ నైనన

నిది గర్హితం బని మున్నరు సత్పురుషులు శ్రుతినిర్ణయం బొలసియుంటఁ
దను వసిత్యం బని తలఁచియు నభ్యాగతునిఁ ద్రోవఁ బున్నెంబు దొరయఁగలదె
యిదియు శోఁచుచున్న దీనాదు నెమ్మది, బరమధర్మ మనుచుఁ బాటిసేయు
పోంటు మెలఁగుచుంటఁ బో దొంట నిమ్మెయి, పలుకుపలుకు దానఁ బడసినాఁడ.

కం॥ అను పద మనుపదమే కాని, యనుమగ్న మొనర్చి యిట్టు లనె సుగ్రీవుం
డును నిదియు శుభతరం బా, నన నను వగు పలుకుఁబడి బయల్పడఁ బఁడతీ. ౬౦

తే॥ తొలుత దుష్టుఁడయేని నదుష్టుఁడేని, నెఱిగలదె యీతఁ డెటు రజనీచరుఁ డగు
నీదృశం బగు వ్యసనంబు నెనసియున్న, యన్న విడనాడునే యింత లరయవలదె.

కం॥ నెట్టన విడఁదగఁ డనఁ దగు, నట్టిఁడు విం దెవఁడు వీని కగపడు నింకన్
గట్టిడిగ్గై యెందఱ ని, ట్టట్టొనరింపం గలాఁడొ యనవద్య! యనన్. ౬౨

కం॥ ముష్టులు గులికెడు దీనికి, నద్ది గలదె యనఁగ నెగడి యొఱపొందెడు న
వ్వద్దిర యన నందఱఁ గని, తద్దయు లక్ష్మణునితోడఁ దా నిట్లనియెన్. ౬౩

కం॥ ఆసత్యపరాక్రమునకె, నాసత్య సదృశునకె ఘనశ్రీకునకే
భాసురశుభలక్షణునకె, యీసంభాషణము పొసఁగు నగరాజసుతా. ౬౪

తే॥ శాస్త్రములు నెల్లఁ జక్కఁగాఁ జదువకయును, వృద్ధులైనట్టి ఘనుల సేవింపకయును
నీహరీంద్రుఁడు పలికిన యిట్టిపలుకు, పలుక శక్యంబె యొంటె కెప్పాటనైన. ౬౫

కం॥ తమ్ముఁడ! యైనను సూక్ష్మత, రమ్మగు నర్థమ్ము సకలరాజులదస దృ
ష్టమ్ము లౌకికమును నై, యిమ్మగుచున్నయది యదియు నెఱుకపఱచెదన్. ౬౬

తే॥ తనకొలమువార లటు లనంతరనృపతులుఁ, బగతులే యని కీర్తింపఁబడుదు రెందు
నిగుతెగలవారు వ్యసనమ్ము లెంచి నొంచి, యర్థముం గొన నభికాంక్షు లగుటకతన.

కం॥ అనఘు లగు నృపులు జ్ఞాతుల, ననయము హితమెంచి యర్థి నభినందనముల్
పొనరించుచుండు రమ్మెయి, జన మనవద్యమన నైన శంకింపఁజనున్. ౬౮

కం॥ పాపాత్ముఁడు నష్టుఁ డతం, డేపున నెప్పాట నెదిరి నెదఁగ్గైకొనఁబోఁ
డావగదివెరన్నమెయి గా, నోపు నన న్వచ్చు నొంట యుక్తం బగుటన్. ౬౯

తే॥ వినుము సుగ్రీవ! నీనుడి విశ్రుతంబ, యరిబలాదాన మగు దుష్టమన్న నెఱిని
దెలుపువాఁడ నేనను నొంపు తెఱఁగున నది, శాస్త్రదృష్టంబ యైన మేలిజాడ నెగడ.

ఆ॥ కా మనంతగులము కాముతత్కులజుల, మిట్టి మనలఁ జేర నితఁడు రాజ్య
కాంక్షి యగుచు వచ్చెఁ గానఁ గైకొనఁదగు, నసురులందుఁ బ్రాజ్ఞు లరయఁగలరు.

శా॥ అవ్యగ్రత్వమునం దనర్చినఁ బ్రహృష్టాంతర్గ్యులై యున్న సం
భావ్యగ్లా రేటు నెందు జ్ఞాతు లెవు డావన్నత్వ మా నవ్వఁడే
నవ్యత్వం బెనయంగలారు గత మెన్నం బోరు సంగాతులా
భవ్యద్ధారె యమాతులాదు రను సంవాదంబు గన్పట్టుడీన్. ౭౨

క॥ కావున నీతఁడు వెఱపడి, యే వచ్చినవాఁడు తెలుప నెడపడి కుపితుం
డై వెడలనడవ నెడలిన, యావిధము న్నొడివె గ్రాహ్యుఁడగు నట్లనఘా. ౨౩

తే॥ భ్రాత లందఱుఁ దాత! మా భరతుఁ బోల, రట్లు తండ్రికి మద్విధు లైన పుత్రు
లెందుఁ గనుపట్ట రెదిమెట్టు లెన్నఁబడిన, నిన్నుఁబోల్పనో సుహృదు లేని యతి లేరు.

క॥ అని రాముఁడు వచియించిన, విని సుగ్రీవుఁడు బిట్టు వెఱచి సుమిత్రా
తనయుం గూని నిలబడి వం, దన మిడి యిట్లనె నభిజ్ఞత దనర్పంగన్. ౨౫

— సుగ్రీవుండు మరల విభీషణుఁ జేర్పవలదని రాముని బ్రార్థించుట —

సీ॥ ఇతఁడు విభీషణుం డిచటికి రావణుం డంపఁగాఁ జేరిన యతఁడె సుమ్ము
ఘాతుకుం డగు వాని కడగొట్టు తమ్ముండు రాక్షసుం డనిగా కరాతినసుఁడు
నమ్మినవారలు నాక మ్మట్టుట నీరిలోలమున నెన్నఁగఁ గూర్చినదియ
చొచ్చి యంతర మెట్లో చూచి విశ్వస్తుల మని నిన్ను నన్ను నియ్యానుఁగుఁదమ్ము
కుట్రనో నేఁట రేపటఁ గూల్చి యరుగు, వాఁడ కాని రిత్తకు రిత్త బోఁడు తనకుఁ
దోడు వచ్చినవారలు ధూర్తు లగుచుఁ, దోడుపాటూనగూర్చి నిర్ధూతపాప! ౨౬

క॥ అని మిన్నకున్న హరిపతిఁ, గని యన్నయకోవిదుండు ఘనశుభతరవా
క్యనిరతుఁ డిట్లనె రాముఁడు, మన మూదార్యాబ్ధిపూర మగ్నతఁ బొదలన్. ౨౭

— శ్రీరాముని నిశ్చయము —

ఆ॥ దుష్టుఁ డౌనుగాక దుష్టుఁ డౌఁగాక న్వా, రాక్షసత్వ మెగువ రావు నెఱవ
నెంచుఁగాక వీఁడు గొంచెమేనియుఁ గీడు, సేయలేఁడు నాకు సిద్ధ మిదియు. ౨౮

మ॥ జగతిన్ దానవయక్షరాక్షసపిశాచ బ్రహ్మరక్షోగణాది
ఖగతుల్ మొత్తము లై కడంగిన సురల్ సాయంబొనర్పంగ నే
వగ నేనిం దలకొన్న నొక్కఁడన యే వ్రాకుచ్చి యగ్రాంగుళిం
దెగఁజూతు న్నిజ మిట్లె ముజ్జగములుం దీర్తు న్సృజింతుం బొరిన్. ౨౯

క॥ పరఁగెడు ఖ్యాతి మై జగతిన్, శరణార్థిత్రాణపుణ్యసందర్భం బా
చరితం బొకఁడు మహితం, బరయుము విని దానఁ దనరు నర్థం బెల్లన్. ౩౦

సీ॥ ఒకయరణ్యంబునం దొక్కకిరాతుండు మృగయార్థ మరిగెను మిత్తివోలె
వలవైచి పక్షుల నలము నయ్యొక్కట్టునం దొక్క తె కపోతి యాక పడియెఁ
దనభర్త గానములు దలఁచి వాపోవుచు ఘూర్ణిల్లుచుండ నక్కూర్మి మెచ్చి
యాకపోతం బట్ల యడలెదునది యింక నేను ధన్యుఁడ నని నెఱయు నంత
గాలివాన వొడమి కడ లెడలింపఁగఁ, దొడరి వెల్లివిరిసెఁ దోనె యచటఁ
జిక్కి లుబ్ధకుండు సీతున నొదుఁగుచుఁ జేరె నప్పాలుంగుచెట్టు దరికి. ౩౧

క॥ చావున కెదురై యుండిన, పావురపుంబెంటి పతికిఁ బరమహితంబౌ
నావల నుపదేశించెను, దావల మగుపుణ్యలోకతాత్పర్యమునన్. ౮౨
సీ॥ ఈతఁడు మనయిక్కకే తెంచియున్నవాఁ డతిథి యై యట్లుగా కార్తుఁ డగుట
శరణార్థియైనాఁడు చావున కగ్గమై వీనిఁ గాపాడుట వెరవ కాదె
నిన్నుఁ బోటికి నన నెలఁత పల్కులఁ బక్షి నెఱిఁగాంచి యవ్వాని నెఱసి యన్న!
కాఱియపడెదె మే ల్గావింతు దలఁకకు మని బుజ్జగించి యవ్వనముపొంత
పల్లెకరిగి నిప్పు పాటిల్లు పుడకలు జేర్చి మంటసేసి సీతు వాపి
యాకటం గృశించి యలమటపడెడు నయ్యనద కిట్టు లనియె నావులుంగు. ౮౩
క॥ మే నగ్గి వైచి పక్వం, బే నొనరించెదఁ బ్రసక్తి నిష్టార్థం బౌ
దీని భుజియించి నీదగు, దీనత్వముఁ బాపికొనుము తెరలకు మింకన్. ౮౪
ఆ॥ అనుచుఁ బూజసేసి యగ్గిని వలగొని, యందు బడియెఁ బక్కి యక్కథాంశ
మరసి బోయ పత్రు లన్నింటి విడచిన, సహాగమంబు దాని సతి యొనర్చె. ౮౫
క॥ ఇరువురు దివ్యవిమానము, వెరయ నధిష్ఠించి తో దివికిఁ బోయిన నా
వెరవరి యనశనదీక్షం, బరఁగి సుగతి వడసె నపుడు ప్రాజ్ఞులు మెచ్చన్. ౮౬
క॥ భార్యాహర్తఁ గిరాతుఁ గ, దర్యముకా కట్లు ప్రోచె నండజ ముఖ్యం
డార్యులు వొగడఁగ నన నీ, యర్యముకులుఁ డింతమాత్ర కైనం దగఁడే. ౮౭
ఆ॥ వానరంబు గాచె వ్యాఘ్రభీతుని నొక్క, నరునిఁ దన్నుఁ ద్రోచి నయముఁ బాఁచి
నట్టివానిఁ జక్కనయ్యుఁ దాఁ దనదగు, పలుకు నెఱపఁ జెట్టుపైకిఁ జేరి. ౮౮
క॥ ప్రీతిగ నొకవానర మటు, నీతిమెయి న్మలఁగె ననఁ గనీ వల్వఁడవే
కాతర్య మేల మేటివ, సీతరమునవారలం దనిందితచరితా. ౮౯
ఆ॥ కణ్వసుతుఁడు ఘనుఁడు కలఁ డొక్కమునివర్యుఁ, డతనిచేత గీత మైన గాథ
వినుచువాఁడ దాని విను మది సమకూర్చు, సత్యధర్మమార్గసంశ్రయంబు. ౯౦
తే॥ దీనుఁ డై దోసిలొగ్గి యధీనుఁ డగుచు, శరణుచొచ్చితి ననువాని శత్రునేనిఁ
జంపఁ జూచెడు నతఁడె నృశంసుఁ డనఁగఁ, గాని యొండొక డెట్లును గాఁడు నిజము
తే॥ ఆర్తుఁ డై యేని దృప్తుఁ డే యయ్యునేని, శరణనినవాని నరిసేనిఁ జంపఁజనదు
తన యసుఁలు వోవనైన సద్ధర్మవేత్త, లట్టివాని సంరక్షింతు రభయ మొసఁగి.
ఆ॥ మోహముననొ కామముననొ భయమ్మున, నో సనత్త్వుఁ డయ్యు నొవ్వనాడి
మనుపఁ దలఁపఁడేని మానని దౌ పాప, మతని కదియె గర్హ్య మదియె జగతి.
క॥ రక్షింప ననినవానిస, మక్షంబున రక్ష్యుఁ డైన యాతఁడు సెడ నా
నాక్షణమునఁ దత్సుకృతం, బక్షీణం బాడిచికొంచు నరిగెడుఁ జాలుకన్. ౯౪
చ॥ పరఁగెడుఁ బాప మిన్నిటఁ బ్రపన్నుల రక్షణ సేయకున్న న
వ్వరుసనె వీర్యముం బలము వారని పున్నముఁ గీర్తియుం జెడున్

బరమము సూక్ష్మధర్మమిది పాయఁగఁజూతునె మానినగ్నిఁ దే
గురుఁ డని నమ్మి యవ్విధికిఁ గూర్చినవాఁ డకటా పేయు నేటికిన్. ౯౫

తే॥ ఇదియె ధర్మిష్ఠ మిదియె శ్రుతీరితార్థ, మిదె యశస్య మిదియె స్వర్గ్య మిష్టఫలము
గాన నిద్దాని విడనాడఁగంటినేని, నాదు పుట్టిన కొండొక్క నయము గలదె. ౯౬

క॥ రఘువులు శ్రితరక్షణమున, లఘువులు గారెప్పు డది యలంఘ్యము గురు ల
ట్లఘ మడఁచు నెటిన కాచే, మఘవార్చితు లనఁగఁ గనిరి మాన్యత్వ మిలన్. ౯౭

ఆ॥ ఒక్కపరిఁ బ్రపన్నుఁడై దరిఁ గనీవాఁడ నే, ననుచు వేఁడువాఁడు నైన వాని
కభయ మొసఁగువాఁడ నఖిలభూతములందు, నిదియ మద్వ్రతము నమిాహితమ్ము.

క॥ అభయం బిచ్చితి వీనికి, సభయుండైనను సొల దింక శరణార్థి దనన్
శుభ మాఁ దొక్క మిమ్మతఁడు, విభీషణుఁడో రావణుఁడో వివేచన మేలా. ౯౯

తే॥ అన్న హరివర్య ! తనదు మర్యాద వెలయ, నీవె సంబోధన మొసర్చి నియమిత సర
నర్థిఁ గొనిరమ్ము దాన నర్వార్థములు ఫలించు నమ్ముము లే లె మ్మనేక మునకి.

— ♦ శ్రీరాముని ధర్మబుద్ధిఁ గొనియాడి సుగ్రీవుఁడు విభీషణుఁ దోడి తెచ్చుట. ♦ —

క॥ అను రాముని యనుభావ, మ్మున మునిఁగి హరీశ్వరుండు మునకొని సింహా
ర్దని వేదితార్థుఁ డై యు, ట్లనె బరవశ మొసఁగ గిరివరాస్వయఘనా. ౧౦౧

ఉ॥ ఇం దొక చిత్రమున్నదియె యెల్ల యెఱుంగుదు లోకరక్షణం
బందియ వెట్టి కైకొనినయట్టిద మున్నె సుఖానపండు వీ
వందఱ కార్యసందితుఁడ వంచిన సత్త్వుఁడ వాక్యసత్ప్రథం
బంది తరాతి నాఁశపదు టాటయ నీ కన్న నింక రాఘవా. ౧౦౨

క॥ సంతోషించితి నఘపద, సంతమసం బెడలె నీదు సింహారరసా
భ్యంతరబోధోదయమున, నెంతకుఁ జాలవు మహాత్మ ! యినకులతిలకా. ౧౦౩

మ॥ అనుమానైకనిమగ్నమైన మన మిప్పత్యంతశుద్ధంబుగాఁ
దనరెన్ వీఁ డతినిర్మలుం డనుచుఁ దాత్పర్యార్థ మూహించెదన్
ఘనతేజుండవు నీదు పల్కుఁబడి వీఁకన్ శౌరితధోతత్వమున్
బొనరింపన్ ధృతి బెంప నై నెగడఁ జిద్భాతప్రసాదాంచితా. ౧౦౪

తే॥ తొడరిన దె త ప్పితండు మా తోడివాఁడ
సఖ్య మొనగూర్పుమయ్య మా సంఘమునకు
వీనితోడిద బ్రిదు కంచు వెలయువార
మింక నేవంకయును లే దభీష్టవరద ! ౧౦౫

క॥ అని కపినాథుఁడు వచియిం, చిన జగతీనాథుఁ డిచ్చఁ జెలగె విహగనా
థుని మైత్రిఁ గొని పురందరుఁ, డనుపమధృతి నందె నిట్లె యనఁ దగి మగువా.

ఆ॥ తరణిసుతుఁడు రామదత్తాభయప్రదా, నోక్తిపూర్వకముగ నోజ మెఱయఁ
బిలిచె వరసఖా విభీషణా ర మ్మంచు, సంచితాదరప్రసక్తి నెగడ. ౧౦౭

ఉ॥ సన్నుతగాత్రుఁ డై తొడగు సంభ్రమము మచ్చుపడంగఁ బ్రాజ్ఞుఁ డం
చన్నయుఁ డవ్విభీషణుఁడు సమ్మద మాస్య మలంకరింప నా
యన్న గ్రహించెనే సుకృతి నైతిని యే నని ప్రోడిభక్తులుం
దిన్నఁగ గూడిరా నిలకు దిగ్గన డిగ్గె ధరాధరాత్మజా. ౧౦౮

—◆ విభీషణ కృతరామ స్తవము ◆—

క॥ బడుగు లగువారి నడుగున, బడసిక భరించు రామభద్రుని సిరి యే
ర్పడఁ దొడుగు తోడవులం గనె, నడుగుందమ్ములనె శ్రోత్త్ర నతఁ డనుఁగులతోన్.

సీ॥ ధామనిధ్యాంతరతత్త్వం బనఁగఁ జెల్లు శ్యామలాకృతిసరసత్వ మొప్పఁ
జూడ్కి నైకొనినట్టి శుద్ధిసంప్రదాయమ్ము ముఖపద్మలక్ష్మి యిమ్ముగ వచింప
ధనుష్ బాణంబులుఁ గొను జాణ యూ వింత శాంతి యాశాంతసంక్రాంతికొలయఁ
దమ్మఁ గొల్పించు నందమ్ముచందమ్మునఁ దమ్ముఁగుఱ్ఱని యాశ్రియమ్ము నెగడ
గాణా బెద్దలు పేర్కొన్న రామనామ, సారపరమార్థ మెదుర సాక్షాత్కరింప
ననలఁగనె వాఁడు కనులకయ్యాదనునందుఁ, బున్నె మిడినట్టి కలిమినంభోరుహాక్షి.

క॥ అనలుగురవ్వా నిజశిర, మానఁగ నంఘ్రులకు మ్రొక్కె నదె సాష్టాంగం
బై నెగడె నవనిపై ముసు మే నరయక వ్రాలఁ జేయు మొలకువఁ గలికీ. ౧౧౧

క॥ నెంజలి దొఱఁగితి నని బ, ద్ధాంజలిపుటుఁ డగుచు నిలిచి యానమ్రిత యా
నంబునసకలేప్సిత ధ్యై, మంజిమ నెగడంగఁ బొగడె మహిళామణిరో. ౧౧౨

సీ॥ అర్పింతు నంజలు లఖిలాధినాథ శ్రీరామ! సీతామనోరామ! నీకు
సారింతుఁ బ్రణతులు చండకోదండప్రచారితసాధువాత్సల్య! నీకు
మొనయుంతుఁ గేల్మోడ్పు లనుపమామితధామసుగ్రీవమిత్రసంస్తుత్య! నీకుఁ
గావింతు శరణులు కల్యాణగుణనామరూప! భానుకులప్రదీప! నీకుఁ
గూర్తు జేజేలు జేజేలకొఱకు స్వీకృ, తాఢ్యవివిధావతారుఁడ వైన నీకు
నిడుదు వందనములు జగదిష్టిపుష్టి, కారణాకృతులను మించు ఘనుఁడ! నీకు.

క॥ నినుఁ గంటి లోకజనకుఁడ, యనాదిగృహమేధ! యిప్పుడె యను వారసి య
ప్పన మొనరించెదఁ గొను మి, మ్మన మింద్రియములును మేను మహాదాదిపరా.

ఆ॥ నీన జగతి నియతి నెఱయింతు వెలయింతు, వాహరింతు వళ్లు యధివసింతు
మొలఁగె దిచ్చమయిని మేలో కీడో నీదు, చరిత మబ్రి మందుఁ జర్చ గలదె.

ఉ॥ లో వెలి నిండి భూతములలో విహరింతు జగన్మయత్వ మీ
వావిఁ బొసంగె వ్యాప్య మటు వ్యాపక మం చనుభావ మొప్పఁగాఁ

కేవలతత్త్వమూర్తి వని కీర్తనముం బొనరింతు రాస్తికుల్
త్రోవ తెలుంగనేర వని త్రోవక పోవవె భవ్యభావనా. ౧౧౬

ఆ॥ నీదుమాయ గ్రమ్మ నెఱిమాలి యెఱుకలే, కపహతాత్మచిత్తు లగుచు నెప్డుఁ
బుణ్యపాపవశతఁ బుట్టుచు గిట్టుచు, నుందు రొకట భారము మందలేరు. ౧౧౭

ఆ॥ అంతవఱకుఁ దోఁచు నాశుక్తి రజతము, ట్లంతయును జగంబు ననంత మనుచు
నీదుసత్త్వ మెఱయ నెఱిఁగొను దృఢబుద్ధి, యెంతవఱకుఁ దెరయ కెడసియుండు.

క॥ నీతత్త్వ మెరయకే యవి, నీతత్త్వమునకు గృపగదిరిగాను లఘు సుఖ
ఖ్యాతము లఘుపరములు నగు, నాతంకము లందుచుందు రానవశతకే. ౧౧౯

క॥ నీవే యింద్రుఁడ వగ్నివి, నీవే యముఁడవు నిరృతి వనిలుఁడవు నీవే
నీవే త్ర్యంబకసఖుఁడవు, నీవే రుద్రుఁడవు నీవె నిఖిలము దేవా. ౧౨౦

సీ॥ నీవుసూక్ష్మముకన్న నెగడెదు సూక్ష్మ స్థూలంబుకన్నను స్థూలతరుఁడ
వఖిలలోకములకు నారయఁ దల్లివి దండ్రివి నీవె యాధార మీవె
యాదిమధ్యాంతంబు లని లేవు నీ కెప్డు మార నవ్యయుఁడ నీవె యచ్యుతుఁడవు
పరిపూర్ణుఁడ వపాదపాణివి జవనుఁడ వటు గృహీతవు శ్రోత వశ్రవణుఁడ
వన్న! ద్రష్ట వదృష్టి వీ వజుని కైన, జనకుఁడ వధీశ్వరుండవు చాలుఁజాలు
నెన్నఁగా నైన నెఱి కొలం దున్నవాఁడె, యున్నవాఁడేని నీవ్యక్తి కొండె గాదు!.

వ॥ దేవా! నీవు పంచకోశంబులకు వ్యతిరిక్తుండవై ప్రకృతికిం బరుండ వగుట నిర్గుణుఁడవు నిరుపాశ్రయుండవు నిర్వికల్పుండవు నిర్వికారుండవు నిరాధారుఁడవు నిరీశ్వరుండవు షడ్భావరహితుండవు ననాదిపురుషుండవు ననం బరఁగుచుండుదువు స్వమాయచే నిగుహ్యమానుండవై ననుఁబోంట్ల భాగధేయం బమేయంబుగాఁగ మనుష్యాకృతి నై నెట్టన నిట్టి నెఱిం జూపట్టితి వాయీనీదుపరతత్త్వరహస్యంబు దెలిసి కని కలిసికొనువారలే వైష్ణవాగ్రేసరు లనం దగి పరమపదం బనం జెల్లు ముక్తిస్థానంబలంకరించువారు నేనును భ్రాంతిచే నవనీతుండనై యుదారదారపుత్ర బంధుపరివారగృహవిత్తంబుల విడనాడి లంక నపవాదపంకంబున ముంచి భవత్పాదారవిందసేవాభిరతుండనై సర్వభూతశరణ్య నిన్ను శరణుఁ జొచ్చి వేఁడి సద్భక్తినిశ్రేణిక నండగొని జ్ఞానయోగావలంబనంబున నమ్మహాసౌధం బధిష్ఠింపఁదలంచుచున్నాఁడ నక్షీణవిభవా! రక్షింపుము దీనపోషణవిచక్షణా! ప్రాణమానంబులు భవదధీనంబులు సుమీ పరమేశ్వరా! నశ్వరునిం జేయకుము రాఘవేంద్రా! యమోఘఫలప్రదాతవు గమ్ము సీతాపతీ! నమస్కారము కారుణికోత్తమా! దోసి లొగ్గితి రావణారీ! విన్నపంబు సేసికొంటి శ్రీరామా! యమాయికుఁడను. దారకనామా! భవసాగరనిమగ్ను నుద్ధరింపుము. ౧౨౨

—♦ శ్రీరాముఁడు విభీషణున కిష్టవరము లొసంగుట. ♦—

క॥ అని కొనియాడెడువానిం, గని యాడెడుతలఁపు మలయఁ గువలయపతి రా
మన సుప్రసన్నుఁ డై యి, ట్లనియెం దనభక్తవత్సలాత్మత నెలయన్. ౧౨౩

ఉ॥ అన్న! విభీషణా! సుకృతి వైతివి లేర నయం బిదేర నీ
కన్నఁ గలారె చుట్టములు గంటివి మంటివి వసమ్ము గొంటి రా
మన్ననుఁ గన్నవారి కెది యారయరానిది కోరు మిచ్చ మై
నున్నవరమ్ము నమ్ము మిఁక నోడకు మెందును లే దపాయముల్. ౧౨౪

క॥ అని తన్నుఁ గనులఁ ద్రావెడు, ననఁ గాంచెడు రాముఁ గాంచి యతఁడు ప్రహర్షా
బ్ధినిఁ దేలుచుఁ దర్శించిక, లన వాక్కులనలు వొసంగ నాదటఁ బలికెన్. ౧౨౫

క॥ ధన్యుఁడ సన్మాన్యుఁడ మూ, ర్ధన్యుఁడ నేఁ గృత్యవిత్ప్రధానుల కెల్లన్
నాన్యమతి సకలకుశలవ, దాన్యము లీపదము లరసి దలఁచియుటకతనన్. ౧౨౬

ఆ॥ రామ! నీదురూపు రహిమీఱఁ గనుఁగొంటి, నింతకన్న ధన్యుఁ డెందు గలఁడు
సుకృతవంతుఁ డంచు శుద్ధాత్ముఁ డటంచు, నన్నుఁ జెప్పికొన గొనంబు గలదు.

ఆ॥ కర్మబంధనాశకరము త్వద్ధ్యానంబు, భక్తిలక్షణంబు పరమవస్తు
వైన ధ్యానమును మహాత్మ! నా కొనగూర్పు, మనియు చాలు వేయు నవల నేల.

క॥ యాచింప విషయసంభవ, మై చను సుఖ మెదియు నొసఁగు మని వేఁడెద నో
రాచిలుక! రామ! నియతిం, శ్రీచతురఁ ద్వదంఘ్రిభక్తి శ్రితజీవనికిన్. ౧౨౯

క॥ ఓమని యానెయి నోపెద, నేమంబున ననియు నని సునిష్ఠితుఁడు రఘు
గ్రామణి వెండియు నిట్లనె, సామంతు నొనర్ప నెఱప్రసాదము నెఱయన్. ౧౩౦

సీ॥ విను మోవిభీషణ! వెఱవు నీ కెఱిఁగింతు నది నిశ్చితము భద్ర మతిరహస్య
మాంతరంగికులు నా కౌదురు శాంతులు వీతరాగులు యోగవేత్తలెపుడు
వారిచిత్తమునందు వసియింతు సీతతోఁ జిత్కళ యూరంగ శ్రీ దలిర్ప
సంశయింపఁగ నేల చాలితి వన్నిట శమితకల్మషుఁడవు శాంతిపరుఁడ

విచ్చమెయి నిచ్చలును నన్ను యెదఁ దలంచి ధ్యానమొనరించి లక్ష్యనిధ్యానమెంచి
మించి సుఖవృత్తిమెయి నిస్తరించె దీవు, సత్వర మెఘోరసంసారసాగరంబు. ౧౩౧

క॥ ఈ స్తోత్రముఁ బఠియించిన, నిస్తులులు లిఖింప వినఁగ నెక్కొను ఘనులున్
ధ్వస్తాఘు లగుచు నగుదురు, వాస్తవ్యులు మన్నివాసవరమున నెపుడున్. ౧౩౨

క॥ ఆనందించితి నీ వటు, లానందోన్నతిఁ దనర్తు వధి సామ్రాజ్యం
చే నొసఁగినాఁడ మున్నగ, నీనిర్మలభావ మరసి నిభృతవికాసా. ౧౩౩

## —♦ విభీషణపట్టాభిషేకము. ♦—

ఆ॥ అనుచు భక్తభక్తుఁ డౌచిత్యసంధాత, ఘనుఁడు రాముఁ డనుజుఁ గాంచి మించి
సాగరమ్ము జలము సరగునఁ గొనిరమ్ము, లెమ్ము నిశ్చితమ్ము లెమ్ము కొనఁగ.

క॥ ననుఁ గన్నఫలము దోడనె, యనుభవ మందఁగఁ జేయ నగుఁ గావున నె
మ్మనమున లంకారాజ్యం, బున వీని న్నిలుపఁ దలఁపు పుట్టె న్వలనై. ౧౩౫

ఆ॥ ఎంతవఱకుఁ జంద్రుఁ డినుఁడు మేదినియును, రామకథయు నిలుచు రహిఁదలిర్ప
నంతవఱకు నితఁ డనంతరుఁ డై లంక, నేలఁగలఁడు మత్సమీహితమున. ౧౩౬

క॥ అనునంత సాగరోదక, మనఘుం డతఁడు గొనితేర నభిషేకవిధిం
బొనరింపఁబనిచె స్వామి, త్రిని నినజుఁడు దోడుగాఁగఁ దేకువ వెలయన్. ౧౩౭

క॥ ఎది యెట్టులేని నెట్టన, బొదలింపం గుదురుపఱుపఁ బోఁ దాన విభుఁ
డదనున నిది కాదది యన, ముదలనె యే ననుచు నసుర మొనఁగొనియుండెన్.

ఆ॥ వారలటు లొనర్ప వారని నెనగు దై, వార రాఘవాస్యవాయుగమ్ము
మొనసి యిట్టులనియె నేణాంకసంపద, నెల్లగొను స్మితాస్య మొప్పనిప్పు. ౧౩౯

క॥ లంకారాష్ట్రం బెల్ల నీ, వంకువశముగ నేలుమయ్య యమరులు మెచ్చన్
శంకాతంకము లెడలఁగ, లెంకలు నీ కగుదుఁ బ్రొస్తలింపులు పొగడన్. ౧౪౦

క॥ అని రాముఁడు దీవించిన, ననుపమసౌహార్దమున మహానందమునన్
దనరారె రాత్రిసేంద్రుఁడు, తనసచివులు నట్టి రగుచుఁ దాన్గొని నెగడన్.

ఆ॥ మేలు మేలు రాము మేలే పొగడనైన, నెల్లజగములందు నిట్టి జనగు
గలదె యనుచుఁ బొగడెఁ గపివాహినీతతి, పలయు నట్టి డగుచుఁ బరఁగుచుండ

క॥ అత్తఱి సుగ్రీవుఁడు నము, పాత్తనయుం డసురఁ గదిసి యనుభావ్యసమా
సత్తి నెఱపి తా నిట్లనె, దత్తాదృగ్వైభవలక్ష్యతాత్పర్యమునన్. ౧౪౩

చ॥ సునయ! విభీషణా! మనము చుట్టల మైతిమి విశ్వభర్త యీ
యినకులమౌళి కింకరుల మిందఱ మందఱిలోన మేటి వీ
వనయము భక్తి నెక్కొనఁగ నై విభు మన్నన లందఁగాంచ నెం
ననువునఁ గానఁ దోడ్పడఁగ నగ్గల మౌ వల నూనఁ గాఁ దగున్. ౧౪౪

క॥ అన విని యఖిలేశున కేఁ, బొనరించెడు సాయ మెంత పొడవైనది యో
యనిశముఁ దత్సేవారతిఁ, దనరారుటకన్న వలను దక్కొం డగునే. ౧౪౫

క॥ సేవింత మిందఱము సం, భావితము తద్విశేషపరమార్థ మ్మద్దా
గావింత మనయుకర్జము, లేవింతయుఁ జెరయనీని యెఱుకకతమునన్. ౧౪౬

ఉ॥ అయ్యెడ రాక్షసేంద్రుఁ గని యర్కకులీనుఁడు రాముఁ డాదరం
బొయ్యఁ దలిర్ప నిట్లనియె నోయి సఖా! వినిపింపుమయ్య యా
దయ్యము లుండుతీరు బలదర్పములుం బ్రభవుండు వారితో
నెయ్యమున న్మెలంగుటయు నెమ్మన మమ్మయి వీక నైకొనన్. ౧౪౮

—♦ శ్రీరాముఁ డడుగ విభీషణుఁడు రావణుని సామర్థ్యము వివరించుట ♦—

ఆ॥ అనుచు రామచంద్రుఁ డక్లిష్టకర్ముఁడు, ముచ్చటింప నదియు మొదలకింపఁ
బ్రీతి నిట్టులనె విభీషణుం డసురేంద్రు, తెలుఁగు వల్లభునకుఁ దెలుఁగుపడఁగ.

ఉ॥ ఆతని సర్వభూతములు నట్లు సురాసురులున్ వధింపలే
రాతనిశక్తి మేకొనె స్వయంభువుఁ డిచ్చిన యావరంబునన్
గాతరవృత్తి లే కదిరిఁ గైకొనఁ డేనె జగంబు లేల నా
నేత నటంచుఁ బొంగిపడు నిచ్చలు నచ్చటులుండు రాఘవా. ౧౪౯

తే॥ నాకు నల రావణునకును నడిమివాఁడు, కుంభకర్ణుండు బలదర్పగుంభితుండు
ప్రతిబలుఁడు శక్రునకు నవఁ బరఁగువాఁడు, వాని తేజం బతీత మై వలనుమీఱు.

క॥ సేనాధిపతి ప్రహస్తుఁడు, దా నసురేంద్రునకు లంక దటియున దె మొదల్
పూనిక నలకేశు గెలువఁ, బో నయ్యెడ మాణిభద్రుఁ బొలుపఱఁ బఱచెన్.

తే॥ వింటు రామేంద్ర! తా మేటి వీరులందు, బద్ధగోధాంగుళిత్రుఁ డవధ్యకవచుఁ
డధిపసుతుఁ డింద్రజిత్పద మందినాఁడు, పరులఁ బోరిగొను నెదుటఁ జూపట్టఁబోఁడు

క॥ ఆజి హుతాశనతర్పణ, మోజం బచరించి స్యందనోన్మేషము గా
నా జెట్టి జిహ్మవృత్తిన, యా జాడఁ జరించు మింట నంతర్హితుఁడై. ౧౫౩

సీ॥ అట్టియెడ నాతని జయించు టరిది రామ!
ప్రహస్తులు మహోదరుఁడు మహాపార్శ్వుఁ డటు ల
కంపనుండును దిక్పాలకల్పు లెదిరి
లెక్క సేయ రవ్వానికి లెంక లెపుడు. ౧౫౪

క॥ వారలు నాసిరగతులు, గా రణమున నెదిరి నిలువఁ గా రమరవరుల్
గారణము లిన్ని యునయుఁగ, గారంచె న్మజ్జగములు గర్వితుఁ డగుచున్. ౧౫౫

తే॥ మాంసశోణితభక్షులు మానవాదు, లెన్న దశకోటికోటుల కున్నవారు
కామరూపులు దారు లంకాపురమునఁ గాఁపురం బున్నవారు దిక్పాలవినుత!.

క॥ కన్నడసేయక యెదియో, పన్నాగముఁ బన్నుచుండుప్రభు వయ్యది దా
మున్నె కొను నెఱసె నిన్నెఱి, బున్నమునకుఁ గాని వైన పురుషార్థంబుల్. ౧౫౭

క॥ అన్నియు నిను దొరకొనిన జ, గన్నాయక సమయుఁ గానికావు వెలయఁగా
నిన్నాలీకభవాండముఁ, గన్నయ్యవు గావె నీవు కల్యాణనిధీ. ౧౫౮

ఆ॥ అనిన నతని మినుకు లాలించి మేలెంచి, యాదరించి యాత్మ నవధరించి
పలికె నిట్లు రామభద్రుఁడు నిర్ణిద్ర, విక్రమప్రభావవిలసితుండు. ౧౫౯

— శ్రీరాముని ప్రతిజ్ఞ —

ఉ॥ నీవివరించు పల్కుఁబడి నిక్కమమే యసురాఽధిపాఽపదా
నావళి యెల్ల నేనును శుభాత్మ! మదాత్మ గణించి యుంచితిన్
బో వెలయింప నా నెఱియుఁ బోల్పఁగఁ జాల్పఁడె నిట్టి దుష్టు సం
భావితబంధువర్గయుతుఁ బట్టి వధించెద నేఁట రేపటన్. ౧౬౦
క॥ పాతాళముఁ జొరఁబాఱిన, భూతలవివరమ్ము సొచ్చి పొడవడఱియున్నన్
బైతామహపద మెనసిన, నీతఱి నీతని నగల్ప కెడపడ ననఘా. ౧౬౧
తే॥ వీఁడు నాపాలఁబడినాఁడు వెఱచికాక, బ్రదికిపోలేఁడు సహపుత్రబంధు వీనిఁ
జూని తెగటార్తు నని తలపోయుమట్లు, గాక యోధ్యత్వఁ బోవనిక్కము మహాత్మ!
క॥ నను శరణుజొచ్చె నేనియు, విను మొండెడ కతని నసిచి విశ్వజనీనున్
నిను నిలిపెద సామ్రాజ్యం, బున నాపలు కొండు గాఁగఁ బొసఁగున మెప్పుడున్
క॥ నాతమ్ములపై నీవయి, నేతావత్కృతికిఁ బ్రీతిన యే నొనరింతున్
గాతర్య మెడలి సుఖపడు, మీతాలిమి గూర్పకున్న మెల్లశుభములున్. ౧౬౪
ఆ॥ అనెడు రామవిభున కక్లిష్టకర్మున, కసురవరుఁడు వినతు లాచరించి
ధర్మపరుఁడు వాఁడు తద్దయు నిట్లని, పలికెఁ బలుకు వెలయ భానురాంగి! ౧౬౫
క॥ పసగల హరివాహిని తల, నసమశరాకార! నిలిచి యసురులఁ గడపన్
గసిమసఁగి పురిఁ దెరల్పఁగ, నుసు రెసఁగెడునంత కేను నోపుదు నధిపా. ౧౬౬
ఆ॥ అనెడు నుడికి మెచ్చి యా విభీషణ! నీదు, సాయ మెంతకైనఁ జాలు ననుచు
నర్థి నతనిఁ గ్రుచ్చి యాలింగన మొనర్చె, రాముఁ డఖిలహృదభిరాముఁ డగుచు.
క॥ లాలితుఁడై హరిచే నటు, లాలింగితుఁడై భవాబ్ధి యద్దరి ధిషణా
శాలి విభీషణుఁ డెనయం, జాలియు మఱి దేలియాడె సమ్మదవార్ధిన్. ౧౬౭
శా॥ పారావారము లేమి లెక్క యను నాప్రస్తావమం దున్న సు
శ్రీరూఢాకృతి నాకృతిం గొనుచు సుగ్రీవుండు సామీరియుం
దీ రొప్పన్ జని యాచితిం బెరయు నుద్దేశంబు చెన్నారఁగా
ధీరోత్తంసులు పల్కి రిట్లనుచు నర్థిన్ రామకార్యార్థులై. ౧౬౮
మ॥ మనవారీ కపు లెట్టులేనిఁ గడవ న్మానించి తూఁగంగ నె
మ్మన మొప్పారఁగనీక తక్కులన కు న్మాతాకు హత్తించుచున్
గన నక్షోభ్యమ యయ్యె నియ్యుదధి యీ యామ్నానాథు కర్జంబుఁ దె
ప్పున సాధింపఁగ నేగువార మెటు లాపార్తి న్విచారింపవే. ౧౭౦

క॥ సుహితము దెల్పు ముపాయము, సుహృదుత్తమ యెట్టు లేము చూచిన మదికిన్
రహిఁ బాల్పడకున్నది నీ, మహితం బగు మత మెఱింగి మలసెద మింకన్. ౧౭౧
తే॥ ఈవలీముఖు లీసంద్ర మెపుడు గడతు, రాక్రమించెద రాక్షుణమందె లంక
నీమహారాజసులకుఁ గాని దిది యటన్న, నన్న! సిగ్గయ్యెడు నిఁకెట్లు లనఁగవలయు.
క॥ అని యడిగిన ధర్మజ్ఞుం, డనుపమగుణశాలి మహితుఁ డాశరవరుఁ డి
ట్లనె వారలం గనుంగొని, తన గాదాక్ష్యంబు కడలు దార్కొని వెలయన్.

—♦ సుగ్రీవ పృష్టుఁడై విభీషణుఁడు సాగరతరణోపాయముం జెప్పుట ♦—

ఆ॥ తాను సగరుచేతఁ దగ్గివ్వింపఁబడినాఁడు, సాగరుండు రామచంద్రుఁ డెన్న
దాశరథియ యగుచుఁ దనరినవాఁ డట్టుఁ, లౌట శరణుఁజొచ్చు టర్హ మిపుడు.
క॥ మతిశాలి సరిత్పతియును, గృతముం దరతమత మతముఁ గీర్తింపడె స
మ్మతిమెయి మార్గ మొసంగఁడె, వ్యతిలంఘన మేల చేయవలెఁ దొలుదొల్తన్.
మ॥ అని సూత్రింపఁగ మేలు మే లనచు వా రయ్యర్థమున్ రామదే
వున కర్థిన్ వినిపింపఁ దాఁ బ్రకృతిచేఁ బుణ్యాత్మకుం డౌట నా
నని మెచ్చెం దనతమ్మునిం గని యిటే యౌఁ గాదె నీనెమ్మదిన్
గని యిట్లే పొనరించు టొప్ప నన నేఁ గావింతు న ట్లాకృతిన్. ౧౭౬
క॥ అనుచు స్మిత మాననంబున, ననుపద మనుపొందుచుండ నని వెండియు ని
ట్లనె మీ రందఱుఁ గృతులన్, ఘనులగు భావజ్ఞులరు వికాసము నెఱయన్.
ఆ॥ నిర్ణయించి తెలుపుఁ డగ్నవం బీక్షించి, యుప్రమేయభావ మనుగణించి
పటికె నూహసేసి పండితుండు విభీషణుండు మేలెకాఁగ నుండ దెట్లు. ౧౭౮
క॥ ఆమాటకు సుగ్రీవుఁడు, సౌమిత్రియుఁ బలికె రేము సమయోచిత మా
నేమముఁ గా దనువారమె, నీమది కరయంగరాని నెఱి యొకఁ డున్నే. ౧౭౯
మ॥ సులభం బీ పథ ముచ్చరించె నతఁడున్ శుద్ధాత్ముఁడై యుంట నీ
వల నట్లుం దలపోయ నైసదియ యివ్వారాంనిధిన్ వాహినుల్
దలకొన్నం గడునంగఁ జాలునవియే తార్కాణగా సేతు వా
వలనేని ఘటియింప నౌ సనఁగ నిర్వ్యాపార మొప్పారునే. ౧౮౦
ఆ॥ ఇంతవట్టు దరలి యేతెంచి సేనల, నిచట విడిచి యెట్టు లేగువార
మెట్లు చొచ్చువార మిందాద్రిదిదుర్ధర్ష, మైన లంక మార్గ మరయకున్న. ౧౮౧
క॥ కావున విభీషణుని నుడి, గావింపుము తొల్త గార్యగతి మే లెనయుం
గావచ్చుఁగాక యావల, దేవుఁడ వీవెకద తగువిధిం బొనరింపన్. ౧౮౨
క॥ అటు వారు విన్నవించినఁ, దటుకున వార్ధిదరి మేలి దర్భాస్తర మా
ఘటకుఁ డొనర్చి తనర్చెను, బటుగతి దానిపయి వేదిపై వహ్నికిరియన్. ౧౮౩

సీ॥ ఓయి సుగ్రీవ ! నీ వుత్తమకులమునఁ బొడమినాఁడవు బలబుద్ధిధృతుల
సములు ఋక్షరజస్సూనుఁడవు హరివరులు నిన్గొల్తురు వార కెపుడు
నిను భ్రాతృసమునిఁగా నే నెంతు నధిరాజపద మందితివి మహాప్రీతిఁ గాంచి
తర్థం బనర్థంబు నని లే దొకండు నీ కొక్కని సేవించి యొదుఁగ నేల
తవిలి రాజపుత్త్రి దార నేదెచ్చిన, వెరవు లేదె యాతఁ డరయకున్న
యేమి వచ్చిపడియె నిందు నీతలనుఁ గి, ష్కింధ కేగు మెలయు కీర్తిఁ గనుము.
క॥ ఆలావరు లగు వేల్పులు, నీలంకం బెరయునే ర రిట నడుగిడ రాఁ
జాలదు మిత్త్రి నరులు హరు, లేలెక్క విపత్తి గొనకు మితరుని కృతికిన్. ౧౯౫
మ॥ అని రక్షోవిభుఁ డాడె నీకు హిత మూ నట్లంచు నీ వంచు నా
తనిపల్కుం గొని రమ్ము పొమ్మనిన సద్దైత్యుండు నా మోచితం
బన న్నై గూపగు పక్షిరూపుఁ గొని యొయ్యన్వార్ధిపైపై నభం
బున నేగ్కొల్లని యాదుగాత్మ్ర నుడిగాఁ బొల్పారఁగాఁ బల్కినన్. ౧౯౬
క॥ అనుడులు విన్నయంతనె, వానరవరులు దివి కెగసి వానిం గొని యా
లూనపత్త్రి నుపహాసుం, గా నొనరింపంగడఁగిరి కమలదలాక్షీ. ౧౯౭
ఉ॥ ఆతనిఁ బట్టి తెచ్చి యను నౌను గ యింతకుఁ జాలి తిట్టుతే
సీతర మీఁగువాఁడ వని నెమ్ములు వీడఁగఁ బిండివెట్టుచున్
భూతలమందు నైవ రఘుపుంగవుఁ జేరఁ్కొని వాఁడు దేవ ! న
న్నూత యథోక్తవాది నౌఁ దొఁరించి వధింపఁ దలంపఁ జెల్లునే. ౧౯౮
క॥ పతి మతము విడిచి తనదగు, మతమున భాషించుపొంటు మలయున యేన
మ్మాతకరిఁ బొరిగొను టే న, మ్మాత మటుగా కొండు దలఁవ మత మగునె నృపా.
ఆ॥ వానరుల నదల్పు వారు సీనా రని, వార్య లగుచుఁ బొడిచివైచుచున్న
వార లనుచు వాఁడు వాపోవఁగా రఘు, వీరుఁ డొప్ప దతని విడువుఁ డనిన.
క॥ బ్రతికితి లేగా యని న, న్నతను లాహరిప్రీరు లుదుటు మాని చను మనన్
గతిపత్త్రిలఘుఁడు నెట్టన, గతిగని గగనమున కెగసి క్రమ్మఱఁ బలికెన్. ౨౦౧
ఆ॥ ఓమహానుభావ ! యోగసారసత్త్వ ! సు, గ్రీవ ! విక్రమాంచితావధాన !
రావణుండు లోక వనుం డాతనిఁ జేరి మెట్టు లగదుఁ జెప్పుమయ్య. ౨౦౨

—♦ సుగ్రీవుఁడు శుకునకుఁ బ్రత్యుత్తర మిచ్చుట ♦—

క॥ నావుడు హరిపతి బలన, ద్భావాంచితుఁ డతనితోడఁ బలికెం దగ నో
దేవి ! రజనిచరాధిప, భావాంచితచారచరుని పద మూరయుచున్. ౨౦3
సీ॥ అరివి రాముని కోట నపకార విందలి కాప్తి లే దింతయు నరయు మనుము
నీయుపస్మృతి యెందు నెగడె న ట్లనుకింపు్యఁడవు కీడుపు ట్టంది తపసి ననుము

క॥ శరణ మగు నింక సాగర, తరణము యవతారజలవితరణము యను సం
స్మరణ మిడె మదికిఁ దన సం, సరణం బెదిరించు నతఁడు జగతిం గలఁడే. ౨౨౮

తే॥ మొనసి ప్రియతుండు నియతుండు మునియు నగుచు
దర్భశయనం బొనర్చె నద్ధార్మికుండు
గాదె యది యేనియును విధి కంజభవునిఁ
గన్నవాఁ డొనరింప నౌ కర్మతులకు. ౨౨౯

ఆ॥ మహితనియతి నప్రమత్తుఁ డై యవ్వార్ధి, కర్థి యై కుశాస్తృతావనీశ
యానుఁ డగుచు రాముఁ డటులుండ రాత్రిత్రి, యము గ్రిమించె వికసితాంబుజాక్షి.

ఆ॥ సాగరుం డటంచు సరితాంపతి యటంచు, ధర్మవత్సలుండు దాశరథి ద
యాశరథి యనంగ నై యాశరధి వేఁడె, మూడు రేలు నయము మొనయ నవల.

—♦ శ్రీరాముఁడు సముద్రుపైఁ గోపించి పరాక్రమించుట. ♦—

మ॥ ప్రియతుం డై రఘునాథుఁ డమ్మొయినిఁ దన్ప్రార్థింపఁ బూజింప స
న్నయ మొప్ప వ్రత మాచరింపఁ దలఁప న్మందుండు గాఁ జెట్లు ప్రి
త్యయ మీయం దలపోయఁ డాజలధి యారా యంతరైశ్వర్య సం
తయు నౌద్ధత్యముఁ గూర్పఁ దొంటి నిజదైన్యం బొందు పాటించునే. ౨౩౦

క॥ క్షణ మెన్నుచు రక్తాంతే, క్షణుఁ డై వెడనవ్వు దొనుకఁ గా రాముఁడు ల
క్ష్మణు శుభలక్షణు నుపగతు, గుణాఢ్యుఁ గని యిట్టు లనియెఁ గోవిదవంద్యా.

సీ॥ అవలేప మరసితే యబ్ధి దర్శన మీయఁ డీడె యింతటికైత తా నిరాలగుట
సాలమి వెట్టుఁబో సాంత్వక్షమార్జవశమలక్షణము లైన సద్గుణంబు
లాత్మప్రశంసి దుష్టాత్ము ధృష్టుఁ బ్రచండవర్తను విపరీధావకుని సుగుణు
రవి యివి గుణహీనులం దిట్లు విపరీతభావమ్ము వెలయింపఁ బరఁగుచుండు
ఖ్యాతి యైనఁ గీర్తి యైన జయం బైన, సాధువృత్తి నెందుఁ జక్కపడదు
రాపు సేయ నౌ పరాక్రమ మెనయింప, నిన్నియునుఁ గడంగి యెదురువచ్చు.

క॥ ఆలము సేసి యిపుడె యే, నాలమ్మున శరధి మేలి యలుఁగుల నింపగా
జాలిపడి నీట నిమ్మక, రాలయమకరములు దేలియాడెడుఁ జూమీ. ౨౩౪

ఆ॥ ఫణుల పడగ లెడలిపడ మీనములు మేను, లట్లు నైవఁ గరికరాళి నెరల
శంఖశుక్తిసమితి సమయ నౌ సమయాప్తి, నంబురాశిశోషణం బొనర్తు. ౨౩౫

శా॥ సౌమిత్రీ! క్షమ పోల దీదృశు నెడం జాలించితిం దాని నా
సామం బెంతలు సేసెనో కనుము పైసన్నాహ మూహింపు మా

రా మేనొప్పఁగ రాఁడు సాగరుఁడు ద నార్తిమేనుఁ దగ్ధింప నిం
కేమీ తప్పని మున్పనంబడక కానీఁ డొండు జాల్ముం డిలన్. ౨౩౬

తే॥ చాప మందిమ్ము లక్ష్మణ! శరవరమ్ము, లట్టు లాశీవిషమ్ములే యనఁగఁ జెల్లు
నవియుఁ గూర్పుము నయము నియ్యబ్ధి నింకఁ, గాళ్ల నడకలతోఁ గపు ల్గడచువారు.

మ॥ ఇతఁ డక్షోభ్యుఁడ యేని సాగరుఁడ కానేనిః సముగ్రాదుఁ డు
ల్లంఘితమర్యాదుఁడు నంచు లోకు లెదలోఁ జింతింప నౌనేనిఁ బ్రా
ఘతరోర్మిపరిగ్రహుండ యేని బలుగండ దైత్యు లుండంగ ను
న్నిహుఁడే నైన నగునేని మచ్చరముతో జీర్ణింపఁగాఁ జేయవే. ౨౩౮

క॥ క్షోభితుఁ డై తగు నితని, క్షోభిల్లఁగఁ జేయువాఁడ జూడు మితఁ డాకం
పే భోగ మందునఁ బై, త్యాభుగ్నత చాలుఁ గాచు సదె త న్ననుచున్.

తే॥ అని ధనుష్పాణి యై క్రోధ మగ్గలింప
నంతటనుఁ గన్ను లారుణ్య మవధరింప
రాముఁ డభిరాముఁ డప్పుడు కరాఘుఁ డమ్యో
నాయుగాంతాగ్నివలె జ్వలితాస్త్రుఁ డగుచు. ౨౪౦

తే॥ ధనువుఁ బీడింపఁ దొడఁగ నింధనము లయ్యె
శరము లెడలింప సడలె నా జగము లెల్ల
నుగ్రవిశిఖము ల్పిడుగుల నోజ నెఱయ
నేమి గతి గాంచఁగలవొకో యెఱుకపడదు. ౨౪౧

క॥ శిఖాగ్రేటు లట్లు జ్వాలల్, పితతములు శరములు వెడల వినుతులు సెలఁగన్
శిలశితవిశిఖుఁ డితఁ డా, శతక్రతుని [illegible]డు గాఁడె చాలఁడె యనుచున్ ౨౪౨

చ॥ వెలుఁగులు నిండఁగా సలిలవేగమనోగతు లొప్ప సాయకం
బులు [illegible] జొరఁబడి వెట్టవోవఁగా
సలిలములన్ [illegible] సందడి మతఁదగి మానె యా
విలత యిఁకేల చెల్లు రఘువీరునిఁ గొల్వక నిల్వవచ్చునే. ౨౪౩

ఆ॥ ఉదధి మున్ను ఝంఝ నూర్మిమాలికలతోఁ, బూర మెగుద నబ్ధి బూరటిల్ల
ధూమ మట్టు పైపైఁ దోఁచ నింతగ జంతు, పాక మచటఁ గానఁబడియె నపుడు.

మ॥ పడగల్ క్రుమ్ములు గన్నులు న్నెఱయఁగాఁ బాతాళ ఫుంజిల్వ లా
సడిఁ దత్తెత్తులు దానవు ల్వ్యధితు లై సాకంగ నిం దవ్వ రే
ర్పడువా రంచు యుగాంతసంభవమహాప్రస్థాన మూహింపఁ జొ
ప్పడఁ గామాస్త్రప్రరంపరాఖ్య మగు నౌర్వం బబ్ధి మాయించుచోన్. ౨౪౪

సీ॥ తాలముక్కలు గాఁగ రాలఁగాఁదొడఁగె నాశైలముల్ శైలాగ్రశిరము లదరఁ
గాకిచిప్పలు గానఁగా నయ్యె నొండొండ శోషణాస్త్రోరువిస్ఫూర్తి నిగుడ
ధూమకేతువు లల్లె ధూమకేతువు లొప్పె నాగ్నేయబాణాగ్ను లంటఁగదియ
నూర్మిమాలికలు సత్ర్యూర్మిమాలిక లాడె నాశుగాశుగవేగ మతిశయింపఁ
బదులు నూర్లు వేలు పదికోట్లకోటు లై, ప్రబలి రాముఁ డేయు ప్రదరవితతు
లమ్మహార్ణవమ్ము నట్టిట్టొనర్చె నా, ఘూర్ణమాన మగుచు గొడవపడఁగ.

క॥ పొడవడఁగ నైన నమ్మెయిఁ, దడబడుటే కాని మొనయఁదలఁపఁ డకట య
క్కడలి మును మందరాచల, మెడలింపఁగఁ దనుకఁ జిప్పడిది విస్మితమే. ౨౪౭

మ॥ ధను వాకృష్టమొనర్చుచుం గడఁకమై దాక్షిణ్యముల్లోఁతలూ
గ నితాంతప్రథమాన తేజుఁ డయి యాకంపించు భూతౌఘముం
గనకే యబ్ధిని కాంచుచుణ్ రఘుకులాకల్పంబు కల్పాంత మ
ట్టె నిరూపింపఁగ నొక్క దివ్యశరము న్డెందంబునం దుంచినణ్. ౨౪౮

తే॥ కరులు మకరములెడలఁగాఁ గచ్ఛపములు, దేలఁగాఁబన్నగౌఘము ల్వ్రాలఁ గాంచి
వ్రాలి కర మెత్తి పొనరించె వారణంబు, వలదువలదని సౌమిత్రివారణంబు. ౨౪౯

క॥ అతఁ డాఁగినఁ దలఁగం డ, య్యతిరథవరవర్ణనీయుఁ డౌ రాముఁడు న
న్నతికుపితుఁ గాక యాదః, పతి నాఁకపడంగ నేల పరువిడ వనుచుణ్. ౨౫౦

తే॥ అవల సాగరుఁగూర్చి రాఘవుఁడుపలికె, శోషిలఁగఁ జేయువాఁడ నీసొంబఁగుఁబాతి
నీకుఁ జేదోడు వాదోడు నెఱిఁ దనర్చు, తోడు పాతాళలోకంబు జోడు గాఁగ.

క॥ ధూళు లెగయించి యిప్పుడె, తోలెద నిర్దగ్ధనిఖిలతోయుని గా ని
న్గాలిపడి యెల్లసత్త్వము, లోలిం బెనుగాలిఁ బెరసి యుత్పాతగతిణ్. ౨౫౧

క॥ మత్కార్ముకసృష్టంబు వృ, షత్కానలవర్ష మిపుడె సాగర నిను సం
పత్కాలవిరతుఁ జేయు స, మిత్కాంత్రులు కాళ్లనడక మేకొండ్రు కపుల్.

క॥ దానవులకు నిలుకడ నీ, వేనేర్పునఁ గూర్తు మెంచి మెఱుఁగవు దానణ్
నానయవిక్రమముల నిం, కీనెఱి ని న్నారయు కష్ట మెంచెదొ లేదో. ౨౫౪

మ॥ అని బ్రహ్మాస్త్రము బ్రహ్మదండనిభ మా నస్త్రంబునం జేర్చి యొ
క్కనిమేషంబున మార్విఁ గూర్చి ధను వాకర్షంబు గావించి యా
మనువంశోత్తముఁ డట్టహాస మొనరింప న్వైపటాత్కారని
స్వన మై ఘూర్ణిలె రోదసీకుహర ముత్సన్నత్వసన్నద్ధ మై. ౨౫౫

క॥ గిరులు వడఁకె జీఁకటు లటు, గిరికొని దెస లాక్రమించెఁ గీల్కొని సరసీ
సరిదంతరములు సంక్షో, భరావ మెడలింపఁ దొడఁగె బాటవ మెడలణ్. ౨౫౬

సీ॥ జ్యోతిషులతోఁ జంద్రసూర్యు లడ్డంబుగాఁ దిరిగిరి పెనఁగొనెఁ దిమిరదీప్తు
లుప్పరంబునఁ దోఁచె నుల్కాసహస్రంబు నిర్ఘాతములు తోన నిర్గమించె
ఘనమారుతస్కంధగతులు లోఁబ్రె వెసఁ బ్రభంజనుఁడు భంజించె వృక్షముల గిరుల
వజ్రవైద్యుతవహ్ని వర్గంబు లటు మీఱె భూతభైరవరవంబులును బ్రబలెఁ
గనులు మూఁతపడఁగఁ గదలక యుద్వేగ, మందె నెందు ఖగమృగాదు లడలి
యయ్యమోఘబాణ మజునిఁ గన్నయ్యయ, య్యబ్ధిపైని వైవ నడరునపుడు.

క॥ భూతములతోడ వీచీ, వ్రాతంబులతోడ నాగవరరక్షస్సం
ఘాతములతోడ నంబుధి, యాతతవేగాతివేగుఁ డాతఁడేనయ్యెన్. ౨౫౮

క॥ ఆజనిత ప్లవమున, యోజనపరిమితికి లోని క్రొదిఁగి చనె నతం
డాజితు నాజితనూజుం, డోజమెయిం బొడువఁగా ననుత్సుకుఁ డయ్యెన్. ౨౫౯

క॥ అంతటఁ దనయంతంబున, కంతం బిటు లౌ నటంచు నారసి స్వకసూ
నంతర్ధి నెడలి సముద, క్రాంతుఁడుగాఁ గడరె నతఁడు కమలదలాక్షీ. ౨౬౦

—♦ సముద్రుఁడు ప్రత్యక్షమయి శ్రీరాముఁ గొనియాడుట ♦—

సీ॥ ఉదయించు రవిబింబమో యన నొకతేజ మధిగతోన్నతశైల మందఁగాంచె
దీప్తాస్యములు సముత్థితము లౌ బహుమహాపన్నగంబులతోడఁ బరఁగ నెగడె
స్నిగ్ధవైదూర్యభాసితమూర్తి యైకొని దేవతాస్ఫూర్తి వ్యక్తీకరించెఁ
బొల్చె జాంబూనదభూషాసముజ్జ్వలరక్తమాల్యాంబరాముక్త మగుచుఁ
దమ్మిరేకులఁబోలు నేత్రమ్ము లొప్ప, సౌరపుష్పస్రజము శిరస్త్రముగఁ దనర
మోము చందురుఁగన్నట్టి మురుపుఁ దెలుప, నవలనంబుధియనఁగనై యదెతలిర్చె.

క॥ ముత్యపుదండ నడుమం, జొత్తిల్లుచు నొక్కమేటి జోతి వెలయఁగా
హాత్తిల్లు మేను వెదస్సె, నత్తిన కౌస్తుభముతోడ యేమో నని మురియన్. ౨౬౧

తే॥ అక్షియని కాక రత్నాకరాఖ్య నెసఁగు, గలుగుటకు నర్థరత్నప్రకాశ మొప్ప
ఘనముగాగని యెసుపిదోఁచెను పైన, పలిములకు సాటివచ్చునా నలిలి తరలి.

క॥ తెసఁగోసి మేటి రసనము, లును బంగరు మేలినగలు లోలల్లక్షిత
పిసివేశము లసఁదగు క్రొ, న్ననలుం గానికలుఁ గొంచు ననిచినవేడ్కన్. ౨౬౨

ఆ॥ పొంటి గాలి మొగిలు దొరయునంగతి నైన, తెరల తెరలు బాటు దృష్టసత్వ
వేష్టనమునఁ దెలుపు వెనుబాటుతోడి సె, నడచు వడఁకు లోంటఁ గడలుకొనఁగ.

క॥ దోయిలి నెరయ ముగము గం, దోయియు వికసింపఁ బొంటిదొరవుక దోయీ
యోయితె నైతివె పన్నగ, శాయీ యని పిలిచి మేలినన్నుతు లెసఁగన్. ౨౬౩

క॥ శరపాణి యగున రాముని, కరమణి తే కప్పనంబు లర్పించి ఖలా
శరబాధ తలఁగె నను ధృతి, నరగున సాష్టాంగ మెఱగి సంభ్రమమొనఁగన్,

ఆ॥ నమ్రుఁ డగుచుఁ బలికె నాయన్న! యిల యాప, మట్లు జ్యోతి వాయు వాకసంబు
మలఁగ వాత్మవృత్తి వలను శాశ్వతపథ, మందియున్న తత్వ మొందుచుండు.
క॥ ఆధర్మమున నె యితని క, గాధత్వము వొసఁగుఁగాని గాధత్వము గా
దాధి యుపాధిగ నొదవెడు, బాధ యనం బరఁగు నది యపక్రమ మగుటన్.
ఆ॥ కామలోభ పరతఁ గాని భయంబునఁ, గాని సకలసత్త్వకాంక్షితముల
స్తంభనం బొనర్పఁ జాల జలంబులఁ, బలుకువాఁడ నిజము పార్థివేంద్ర! ౨౬౦
క॥ ఒడయఁడ వని నిన్నరయక, తడసిన తప్పున్న దొకటి తతిఁ గొలని దీ
జడమతి నైన దండనమెయి, బడలించితి వదియుచాలుఁ బద్మదళాక్షా. ౨౬౧
క॥ రక్షింపుము రక్షింపుము, పక్షీంద్రపతాక దేవ! పరమపురుష! నీ
శిక్షం బెఱిఁగితి మధిపుఁడు, దా క్షమియింప దొరకొనఁడె దాసుల తప్పుల్,
సీ॥ నీ తమోమయి మాయ నిర్గమింపఁగఁ జేయ భూతంబు లన్నియుఁ బొడమి నగుడు
నవి కారణస్వభావవృతంబు లై యుండుఁ గావున జడభావకలన పొసఁగు
నీవిరాడ్రూపంబు నెలకొన దాని సత్వంబున న్నరి దేవతలు ధాత్ర
ముఖ్యులు రాజసమున మన్యువున భూతపతియుఁ గా నన్నియుఁ బనిఁగ నవల
శుద్ధసత్త్వాకృతివి నిత్యశోభనుఁడవు, నిర్వికారుఁడ వజుఁడవు నిర్గుణుఁడవు
కేలిమెయి మాయ లీల లంగీకరింతు, వేనియును వానియనలేప మొనయ వెపుడు.
క॥ త్రైలోక్యరక్షణమునకు, లీలామనుజాకృతి న్వెలసుఁడ వగుచున్
హేలమెయిఁ బెరయ నరయం, జాలఁడు వీఁడనఁగ న్నెతి సౌమ్యత మెఱయన్.
తే॥ పసులు మొఱకులు గాఁవరి ప్రభుఁడు దండ
మెడనెడఁ బొనర్ప సన్మార్గ మెనయుచుండు
రట్టు లీశిక్ష నీతత్త్వ మందఁగంటి
నభయ మిచ్చి లంకామార్గ మరయుమయ్య, ౨౬౨
* క॥ ధీవరులు జలధి యితఁ డని, యేవలనున నేనిఁ గొందు రిష్టార్థములన్
దేవా! గాలికిఁ గదలెడు, నావిధమునవాని నొంపనా నీశరముల్. ౨౬౩
తే॥ శరణుజొచ్చితి భక్తవత్సల మహాత్మ!, సర్వలోకశరణ్య! రక్షానురీణ!
యలసినాఁడ మహాభయ మొలసినాఁడ, దొరవు నీయంఘ్రి దిక్కని దాఁగినాఁడ.
ఆ॥ ఎదియొ దారి సూప నెంతు సహింతుఁ ద, ద్భారమెల్ల గ్రాహతిమిగుణలవలని
బాధలం దొలంతుఁ బరఁగ నీసేన యా, దరిని జేరి నెఱయుదనుక రామ! ౨౬౪
మ॥ అనినన్ రాఘవుఁ డప్రమేయవిభవుం డాయంబుధిం గాంచి యి
ట్లనె సంయోజిత మిమ్మహాశర మమోఘాపాత మిద్దానిఁ బో
లిన లక్ష్యంబున వైవఁగావలయు జాలింబోక యాయిమ్ము నా
కొనరం దెల్పుము మిన్నకుంట తగ దాయోజ న్ప్రయోగించెదన్. ౨౬౫

క॥ ధీమంతుఁ డాతనిం గొని, శ్రీమంతుఁడ ! యానతిమ్ము సేతు వొనర్పన్
సామగ్రి నేను మోచెద, నామహితుఁడు వైవ యోధు లందీయంగన్. ౨౯౩

తే॥ చేయుఁగావుత సేతు నాసిద్ధిమంతుఁ, డదియు నాయం దొదవి లంక నందుఁగాత
కూళ దెగుఁగాత సీతఁ జేకొందుగాత, నీదు కీర్తి జగత్త్రయి నెగడుఁగాత. ౨౯౪

క॥ ఈకృతి పుణ్యఫలప్రద, యాకృతి గొన్నట్టి తేజ మఖిలజగములన్
గైకొని మనుపంజాలు న, నేకులఁ దరియింపఁజేయు నితకంకణ మై. ౨౯౫

క॥ ఏ నదిగివత్తు నింకిట, నీనెఱి నెఱయంగ మెఱయనేర్తువ కాదే
శ్రీనాయక యని యంబుధి, తా నంతర్ధాన మొనసెఁ దరుణీమణిరో. ౨౯౬

—♦ నలుఁడు సేతుబంధనమునకు శ్రీరామునను జ్ఞ గోరుట. ♦—

ఉ॥ అంతట వానరప్రవరుఁ డైన నలుండు వరప్రభావమ
త్యంతసమృద్ధి మైకొన సమర్థత మైఁ దనదారి జానకీ
కాంతునిఁ జేరి మ్రొక్కి యొసగంగదె యాజ్ఞఁ బొసంగ సేతు వే
నెంతయు వేడ్క మీఱ రచియింతుఁ దలంతుఁ గృతార్థత న్మదిన్. ౨౯౭

క॥ నాతండ్రి వర మొసంగిన, యాతత్త్వముఁ దెలిపె నీతఁ డది నిజ మన నై
నాతలఁపును బెసఁగొనె ని, ట్లీతఱి నే నెంత సేయనేనియుఁ దగుదున్. ౨౯౮

ఉ॥ మందరమందు మాజనని మానితఁ జేకొని విశ్వకర్మ ని
ష్పందసుఖాఢ్యుఁ డై తనరి బాలుఁడు నీ కుదయించువాఁడు నా
యందలి శిల్పవైభవము లందఁగలాఁడు తరించువాఁడు వా
ర్ధిం దనలావు మైనని మోఁదేఁకువ మై వచియించె నబ్ధియున్. ౨౯౯

క॥ ఒండు దెలుపకయ యే నొ, క్కండనె నేర్తు నని పలుకఁగా నే మగు నా
తండు స్మృతి కెక్కఁజేయఁగ, మెండుకొనె న్విదిత మది సమీహిత మగుచున్.

ఉ॥ ఓకపులార ! మీర లిఁక నోపిక మైఁ గొని తెండు సాలముల్
ప్రాకటశైలశృంగములు పాదములుం దగునట్లు లన్నియుం
జేకొని యే నమర్చెద విశేషవిధాన మచర్చితంబుగా
నా కృతి నామతిం బెరసె నాకృతిఁ గైకొని చొప్పు చొప్పడన్. ౩౦౦

క॥ దండమె వశ మొనయని యు, ద్దండులనేనియు మరల్పఁదగినది సు మ్మా
మొండిక్షమ శఠులఁ దీర్చునె, పండునె సాంత్వమ్ము దానపద్ధతి వలనే. ౩౦౧

తే॥ అమ్మహోదధి యిమ్మెయి నందువాఁడె, సేతు వొనరింపుఁడని యుక్తిఁ జెప్పువాఁడె
దండభయమునఁ గాకున్న దాశరథికిఁ, జుట్టమే నొదు నని యెంచి చూడఁదగఁడె.

క॥ కావున వైళమె సేతువు, గావలె యుదధిం దరింపఁగావలె దఱియుం
గావలె లంకం బొరిగొనఁ, గావలె రక్కసుని జయము గావలెఁ బతికిన్. ౩౦౪

క॥ అని నొడువ వారలా నన, ననుమతి నెఱిఁ బ్లవంగమాధిపుఁ గొని యా
య్యినకులతిలకుఁడు మే లన, ననుజుఁడును విభీషణుండు నను విదె యనుచున్.

ఉ॥ మాంగళికోద్యమం బటు లమానుషయోగకళానిధాన మై
పొంగ గుణోచ్ఛ్రితం బగుచు బోరన నాహరివాహినీప్రజా
భంగతరంగనిస్వనవిభావవిభావ్యరసప్రవాహ ము
ప్పొంగెను రామదేవుఁ గని పొంగిన వార్ధికి నీడు జోడుగాన్. ౩౦౭

క॥ అని విభుఁ జతేఁగించిన సతి, విని సర్వేశాన లోకవిభు చారిత్రం
బనుపమరస మావల నే, యనువునఁ జెల్లనొ వచింపు మని యడుగుటయున్.

శా॥ భావాభావవిభావభావవిభవప్రస్తావసంభావనా
ప్రావీణ్యప్రథమానభావుకజనప్రఖ్యాతభావోదయా
జీవంజీవితజీవలోకరసలక్ష్మీశ్రప్రపణానంతచి
ద్భావానూనకలానిధానసుఖనిత్యశ్రీవిశేషాంచితా. ౩౦౮

క॥ భక్తజనానుగ్రహసువి, భక్తరసోదయ! దయాప్రపంచితగుణసం
భక్తమహావిభవాభి, వ్యక్తావ్యక్తస్వభావవరసద్భావా. ౩౦౯

వనమయూరము॥ కారణగణోపచయకల్పితజగత్కా
పూరణగుణాతిశయపోషణసముత్కా
వారణమనోధికృతవాంఛితవలత్కా
తేరణవినాశితమహీజనవృషత్కా. ౩౧౦

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మమ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథామృతంబను మహాప్రబంధంబున
యుద్ధకాండంబు పూర్వభాగంబునం
దృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయగురవేనమః.

# శ్రీరామకథామృతము.

## యుద్ధకాండము.

———:o:———

### పూర్వభాగము - చతుర్థాశ్వాసము.

——:o.——



కామ్యజగదధీశ
త్వాకలితవిలాస చిన్మయాంతర్హ్రదగూ
ఢాకటభవాబ్ధిసేతు
శ్రీకరకరుణాకటాక్ష! శ్రితసంరక్షా! ౧

ఆ॥ అవధరింపుమయ్య! యనవరతామృత వాక్ప్రసంగ మొసఁగి వలనుసూపు
మయ్య! యభవుఁ డప్పు డగరాజకన్యకఁ, గాంచి స్మేరదృష్టి గలన మించి. ౨

తే॥ పలికె నిట్లని వింటివే కులుకులాఁడి, లోకనాయకు నాంతర లోనఁ జొచ్చి
యప్రమేయచిదానంద మందఁజేయ, నలుఁడు పరిపంథిజనదుర్నివారుఁ గదఁగి.

క॥ తనతోడియూథపులఁ దోడ్కొని బీరము మెచ్చికొన గొనకొని సాగఁ
ఘన మన మబ్బెడు తటి యని, మనోగతము సెసె సేతుమార్గక్రియముకై. ౪

తే॥ లోనియాలోచనమున నాలోచనమ్ము, సేసి సహజన్మకృపయోగ సిద్ధిఁ బలికి
వస్తుసామగ్రిఁ గూర్ప నా వల నిది యని, శ్రుతిపతిచె నల్లవానరశ్రేష్ఠమునకు. ౫

ఉ॥ ఆయెడ రామచంద్రుఁడు మహావిభవుం డఖిలార్థదర్శి సు
శ్రీయుత మా స్వకీయపదసిద్ధము లింగ మొకండు కీర్తనం
స్థాయము సేతువుం దొరయ నబ్ధిదరి న్నెటి సుప్రతిష్ఠితం
బై యనువొందఁగా నిలిపె నాతని దా తలఁ పెన్న శక్యమే. ౬

క॥ పూజ లొనరించి ధృతి నం, భోజదళాక్షుండు రామభూపతి మహితో
త్తేజనము నెఱసి తనయ, వ్యాజకరుణ వెలయ నిట్లు లనె శ్రీయుతుఁ డై. ౭

—♦ శ్రీరాముఁడు రామలింగప్రభావముఁ గపులకు బోధించుట ♦—

సీ॥ ఇచట మత్కృతి మించు నీసేతుబంధమ్ముఁ బ్రణమిల్లి సేవింపబంధ మెడలు
రామలింగేశుఁ బర్వతవర్ధనీదేవి భక్తిమై బూజింపఁ భవము దలఁగు
నెవఁడు వారాణసిఁ కేగి గాంగజలమ్ముఁ గొని తెచ్చి ప్రియుతుఁ డై కోర్కు లలరి
యనువొంద నిమ్మూర్తి కభిషేక మొనరించి భార మంబుధిలోనఁ బరఁగ వైచు
నతఁడు బ్రహ్మణ్యుఁ డై బ్రహ్మ మందఁగలఁడు
బ్రహ్మహత్యాదిపాతకప్రచయ మడఁగు
వాని కేఁ గూర్తు వత్సలత్వంబు దనర
వంశపావనుఁ డవ్వాఁడు వసుధలోన. ౮

క॥ మనుజుం డెవ్వాఁ డేనిన్, ఘనపాపౌఘము లొనర్చి కాని పథమునన్
జననేనియు రామేశునిఁ గని యన్నియు విడిచి కొలువఁ గాంచును ముక్తిన్. ౯

తే॥ రామలింగేశ్వరా! యంచు రక్తవొదల
నామ ముచ్చారణ మొనర్చు నామహితుఁడు
నేమమున నున్న నీమయు నిర్మలంబు
శ్రీమహోన్నతుఁ డలని సంసిద్ధి వెరయు. ౧౦

క॥ రామేశ్వరతీర్థంబున, కామడదూరంబులోని దగు జీవం బె
ప్పమయి మడియునయేనిన్, దామరసార్భకుని పుణ్యధామం బెనయున్. ౧౧

క॥ ఆచంద్రార్కం బిది పు, ణ్యోచిత మగు తీర్థ మనఁగ నొప్పఁ బ్రథిత మై
ప్రోచిచనక చేసిన తప, మాచొప్పున వేయుమడుఁగు లై వర్ధిల్లున్. ౧౨

చ॥ అని మనువంశరత్న మటు లానతి సేసి విధాన మొప్ప నె
మ్మనమున ధ్యానయోగము సమంత్రక మూ నెఱిఁ బాదుకొల్పినన్
ఘనపులకం బెలర్ప జన కామ్యుని రాముని గాంచి సత్కృతు
లొనరఁగ నేను ధీశరథ! దాశరథీ! యని యిట్లు పల్కితిన్. ౧౩

క॥ నీసంకల్ప మమోఘం, బో సావిత్రకులదీప! యుజ్జ్వలరూపా!
యేసరణి నిది పొసర్చితి, వాసకల మొసంగు నక్షయరమణ లేలా. ౧౪

ఉ॥ నీవఖిలాత్ముఁ డౌ హరివి నిర్మలమూర్తివి యెల్లలోకులం
బావనులం బొనర్ప నరభావము నొందితి నేను మున్ను గా
దేవత లెంచి యుంచినదె దేవ! వధింపుము లోకకంటకున్
రావణు నింక నిస్తరసి రాఁగలవారలె యుంద త్రికృతిన్. ౧౫

క॥ కల్యాణమూర్తి! త్రిజగ, త్కల్యాణ మొనర్చి నీదు కాంతం గొని సా
ఫల్య మొదవం బురికిం జని కల్యము వెలయింప నెపుడు గనఁగొనెదొకోదే. ౧౬
క॥ అని నెయ్యము తియ్యముగా, ననువొందఁగఁ బలికి తత్సహాస్యాస్య తనర
ఘనతత్త్వరహస్యంబుల ననుమతిమైఁ దేర్చి తనివు నందిన ధృతితోన్. ౧౭
తే॥ రామదేవప్రతిష్ఠిత రమ్యమూర్తు, లందు నర్థార్థనిజకళ లందఁ జేసి
వచ్చెదనటంచు నే నిట వచ్చినాఁడఁ, జిత్తమోతనిమూర్తిపైఁ జేర్చినాఁడ. ౧౮
క॥ ఆరామపరిభుఁ డాదట, నారూఢిమెయిం బ్లవంగ మాధికృతులఁ జె
న్నారఁ గని మీర లింకిట, నారంభింపఁదగు సేతు వని నొడువుటయున్. ౧౯

—◆ కపులు రామాజ్ఞ చొప్పున సముద్రమున సేతువుం గట్టుట. ◆—

శా॥ రామాధీశు ననుజ్ఞ మున్కొని మహారణ్యంబులోఁ జొచ్చి సం
మే మంచు న్మొయివెంచి యూథపులు సాహిత్యంబు చెన్నార ను
ద్దామప్రక్రియఁ బెల్లగించిరి గిరుల్ ధాత్రీజము ల్తెచ్చి ర
ట్లామంత్రించుచు వైచి రంబునిధి తోయౌఘుంబునం దద్రిజా. ౨౦
సీ॥ అశ్వకర్ణము లొంట నందిచ్చి నైళమేకుటజము ల్గానువి నొసగువారు
సాలార్జునంబులు చాలునా యివె యింక ధవనంశము లటంచుఁ దెలుపువారు
కర్ణికారము లివి కావు బిల్వము లంచు సప్తచ్ఛదము లిచ్చి జగుగువారు
తిలకంబులో యంచుఁ దిమిశంబు లెనయించి యవెయశోకములనియుఱచువారు.
ఇంద్రకేతువు లనుచుఁ బైకెత్తి నారి, కేలహింతాలతాలగ సాలస
మాలవకులాదు లొక్కట మలయఁ జేసి, గేలినొయి నాడుకొందురు ఁశవగులు.
తే॥ ఆటమైఁ దెచ్చి రశ్లైము న్నీట వైచి, రాకపులఁ గపులన నెట్టు నాకప్రలన
జంబుజంబీరనింబక దంబముఖ్య, సాలముల నింప నబ్ధిపై శాల్య ముబల. ౨౧
మ॥ ఖదిరాశ్వత్థకపిత్థచందనగజ గాత్రనాథ ముఖ్యంబులన్
ముదమొప్పం గొనివచ్చి రద్రిశిఖరమ్ము ల్తెచ్చి రాశాని ముం
గదియం జేర్చిరి పేర్చి రెమ్మొయి కడంక న్నేర్చరో నాఁగఁ గ
ల్లదు శాఖామృగముల్గదా యొకట లీలంభామిళుల్లాసినీ!. ౨౨

—◆ నలుఁడు సేతువుం గట్టుట ◆—

తే॥ అందఱును దెచ్చునవి యెల్ల నందుకొనుచు
నబ్ధి వైచుచు ఘట్టించి యలవఱచుచు
కొలత లిడి హెచ్చుతగ్గులు కూర్చుకొనుచుఁ
దొడరెఁ బొనరింప నలుఁడు సేతువు రసజ్ఞ! ౨౩
క॥ పదియామడలు వెడల్పుగఁ, బదివదు లామడలు పొడవు పరఁగఁగ సవ ర్తై
పదిలమయి యుండ మదిలో, నుదియంగొని కుదురుపఱిచి యుజ్జ్వలుఁ డగుచున్

సీ॥ ఘనమార్గముల లొండొంటఁ బేర్చి యడ్డలు సేర్చి యాలంబనంబుల ననువుపఱచి
కాష్ఠఘట్టనలచేఁ గదియించి కుదియింప నొనెడ లొండొండ నదిమి యదిమి
వలుఱాలు కొండలు పాదకూటమ్ములుఁ బరగింప నొచోట్లఁ బాదుకొలిపి
పై మేలిపలకలు పఱచి కీల్కొనఁజేసి నెఱచూడ్కి నిగుడించి నెరులువాపి
కట్టెఁ గట్టితనము గలికితనంబును, గానిపింప వాఁడు కలనఁ బెంప
వస్తుసమితిఁ దెచ్చి వానరేంద్రులు నింప, మొనసి కడలి భారమును వహింప. ౨౬

తే॥ అమ్మహాకాయులు ప్రసక్తి హస్తిమాత్ర
ము లగు పాషాణములు గిరు ల్పెకలిచి తెత్తు
రటు సముత్పాటన మొనర్చి యనువు నెఱయ
దారుయంత్రంబుల నొకొండ్లు దార్చుచుండ్రి. ౨౭

క॥ జలము పయికెగసి యభ్రముఁ, బొలసి పునఃపతిత మగుడు నురుధారాసం
కుల మయ్యె నబ్ధి వానరు, లలవోక గిరు ల్ద్రోరలు నాసమయమునన్. ౨౮

ఉ॥ కొండలు బండలుం దరులుఁ గొల్లలుగాఁ గొని తెచ్చి వైచుచున్
దండఁ బ్రమాణసూత్రపటదండములం బరఁగించుచు న్సము
ద్దండత నెందుఁ దారె యనఁ దార్కొనుచుం బరికించుచు న్ధరా
ఖండలు నాజ్ఞ నెక్కొని రఖండులు వా రటు సేతునిర్మితిన్. ౨౯

తే॥ చూడనేర్చినకనులకే చోద్యమయ్యె, నాడఁదొడరెడు నాల్కలే యడరవయ్యెఁ
గేలిమెయిఁ దృణకాష్ఠోరు గిరితరుప్ర, తతులు గొని వారు పఱతెంచు తఱిని గిరిజ!

తే॥ కట్టుచున్నాఁడు నలుఁ డబ్ధిఁ గంపితమ్ము, సేసి యమ్మహాసేతువు భాసురముగఁ
గూర్చుచున్నారు వానరు ల్ఘోరకర్మ, లంగనా! యింకను గొఱంత యనఁగఁగలదె.

తే॥ కోరితు లిరుగడలం గీలు కొలిపినట్లు, పుష్పితంబులు ఫలితము ల్భూరుహాములు
పెట్టినట్లుండ వచటునఁ బుట్టినట్లు, కానిపించె విపరివృత్త కాలగతిని. 3౨

ఆ॥ శైలములును శిలలు సరిదధీశు జలంబు
లొరయ దొరయు నులివు లొక్కఁ డగుచు
సాగి దెసలు మిన్ను సవరింప నలనాఁటి
మథనవార్త నతఁడు మఱచి మొరసె. 33

క॥ కృత్యారంభము నాఁడు ని, రత్యయముగ నడువఁ బదియు నటు నాలుగు నా
ప్రత్యయమున నామడలకుఁ, బ్రత్యేకుం బగుచు సేతు పద్ధతి తనరెన్. 3౪

క॥ మఱునాఁ డిరువదియామడ, లఱుమాఁగానయ్యెఁ దఱిమి యాభీమబలుల్
నెఱయించు నెఱిని విభు న, క్కఱఁ దలఁచెడు చిత్తవృత్తి గడలుకొనంగన్. 3౫

ఆ॥ అటు తృతీయదివస మం దేకవింశతి, యోజనములు గడచి రురుబలాఢ్యు
లవల నాలుగవది యగు నాఁటి కిరువది, రెండు యోజనములు రెమ్మకొనిరి. 3౬

క॥ పంచమవాసరమునను బ్రి, పంచితవిక్రములు రెండు పదు లోకమ్యూడనక్
సంచితము లైన యోజనమ, లంచితలీలం దరించి రాదగి దఱియన్. ౩౭

మ॥ అతివేలోద్యము లాహారించుద్రి లరశే యా వేల నా వేల సు
స్థితిఁ గన్నట్టి సువేల శైలవరముం జేరంగ సారంగ పుం
గతి మీఱ న్గమకించి యాకృతినెఱిం గావించి సేవించి రా
శ్రితరక్షాచణుఁ డైన రాముపదము ల్సిద్ధార్థు లై పార్వతీ! ౩౮

క॥ ఆవిశ్వకర్మతనయుం, డావిశ్వనిచితనయుం డహో యంబుధిలో
నావిర్భవింపఁ జేసిన, యావిశ్రుతకీర్తి రూప మట్లొండెఁ జెలీ! ౩౯

క॥ శ్రీమంతుఁ డాతఁ డదియును, శ్రీమంతం బనఁగఁ దనరె శ్రీమంతు కృపన్
సీమాంత మెనసి లంకా, సీమంతము దీర్పఁజాలు స్థితి కెక్కె సఖీ. ౪౦

క॥ ఆసాగరమున నలకృత, మా సేతువు వొల్చె నంబరాంతరమున శ్రీ
భాసిలు స్వాతీపథ మన, నాసాదితసకలసుగుణ! యౌచిత్యచణా!. ౪౧

క॥ ఆయద్భుతమును గనుఁగొన, నాయమరులు సిద్ధసర్వ లటు గంధర్వుల్
పాయని ధృతి బయలున నన, పాయస్థితిఁ దనరి రప్పుడు పర్వేందుముఖీ. ౪౨

—♦ దేవగంధర్వులు సేతుబంధనమునఁ గపుల నెన్నుట. ♦—

సీ॥ అనుపచింత్య మసోఢ మతిదుష్కరం బద్భు తాద్భుతం బధనోను సాగరంబు
నా నొప్పుచున్నది నలసేతు విది బళే యబ్ధికి సీమంత మనఁగఁ దనరి
సుకృతవైశాల్యంబు శుద్ధకాంతిసుభూమి సునమాహితంబును సుదృఢసారము
నై తీర్పుగన్నది యఖిలేశుఁ డీరాముఁ డగు నింక సందియ మింత వలదు
చాలు నూఱామడలును వెడ ల్పటు పది, యోజనములుగ నుండు నపార నాంబు రాశి
గడఁగి కావించువాఁ డున్నె కడచినారు, కపులు గడచి రక్కసుల్ జగములవారు.

ఆ॥ అనుచు వార లనఁగ నఖిలభూతంబులుఁ, బ్రమద మొంద సేతు బంధనమ్రి
కాళ మొప్పెఁ గుప్పి గంతులు వైచిర, య్యాగచరేంద్రు లెంత ఘనులొ కదలి!.

క॥ ఆకోటిసహస్రములు వ, నౌకసులు మహౌజసులు మహాంబుధి సేతు
శ్రీకరణమునఁ దరించిరి, శ్రీకరులు భవాబ్ధి దాఁటి సిరిఁ గాంచరె సీ. ౪౩

క॥ ఇదె పుణ్యం బిదె మాన్యం, బిదియె యసదృశము పవిత్రము మోహాంత మిదం
బిదెపో ముక్తిద్వారము, మదవతి! రామకృత సేతు మార్గం బన్నన్. ౪౪

తే॥ రామసేతుస్మృతి మనోభిరామములు త, దభిగమనదర్శనము లేని దాని సేయుటయును
రామలింగేశు సేవాభి రతియు నిఖిల, కలుషహారములు సంతోషకారణములు.

సీ॥ ఆసాస నట్టాడె దకట యే మని బ్రహ్మహత్య! యెచ్చోటనో యడఁగి మనుము
భ్రూణహత్యా! నీ కుబుద్ధిమానవు చని తలదాఁచుకొనరాదె తడయ కొకట

మత్తతవాయదో మద్యపానమ! నీవు పడెదు లే నీపాట్లు బ్రహ్మ మెఱుఁగు
పాడు స్తేయంబ! నీ పంబ రేగును లేచి పాఱిపోరాదటే బ్రిదుకుఁగోరి
యోపిశాచులార! యోబ్రహ్మరక్షస్సు, లార! మీకు వలను లావుఁ గలదె
యేల కదల రింక నీనాఁట మీవారు, సేతుదర్శనంబు సేయువారు. ౪౮

క॥ అని నొడువుచు నొండొంటిం, గని మీఁ దారయుచు బిట్టు గలఁగుచుఁ జనలే
క నితాంతచింత మునుఁగుచుఁ, గనుకని మేర గుమిగొంచుఁ గదలుచునుండున్.

తే॥ దాశరథిచేఁ బ్రతిష్ఠాపితంబు గాఁగఁ, జెలఁగు పాషాణనవకంబు సేరఁ బాఱి
నంతనే మస్తుఁ బాసి దిశాంతములకు, నిన్నియుం జనుఁ దత్సత్త్వ మెన్నఁదరమె.

తె॥ దర్భశయనంబుఁ గాంచఁ జింతలు తలంగు
నానవగ్రహాపలదృష్టి యఘము లడఁచు
స్నాన మొసఁగు రామేశు దర్శనము తోన
రామసేతువుఁ గన ముక్తి రామ వలచు. ౫౧

మ॥ పడఁతీ! పాపము లెట్లు పైకొనినఁ జేడ్పాటు ల్విజృంభించినన్
జడభాస్వకనిమగ్నుఁ డైన బహుదుశ్చర్యోచితుం డైన నె
వ్వడ యేని న్విభు సేతువార్త విని యాహ్లాది న్మలంగంగ నె
వ్వఁడు చిత్తం బిడు జన్మవార్ధి దరి నవ్వాఁ డొందఁగాంచుం జుమీ. ౫౨

తే॥ అచట నెలకొనె గంగాదులౌ సరిత్తు, లెల్లజేజేలు జడదాళ్లు నిమిడి రట్టు
లంచుపో యందె దొడిగిన దఘము లడఁప, బంధముక్తిఁ బొనర్ప నాధారమనుచు.

క॥ రామకృతసేతువృత్తాం, తేమానవుఁ డైనఁ జదువ నెఱిఁగింప విన్
రామాద్వరసాక్షయము, న్నేమంబున నెఱపు నెగడు నిర్మలుఁ డగుచున్. ౫౪

క॥ అంతట విభీషణుఁడు తా, నంతయుఁ గుతుకమునఁ బేర్చి హితులఁ గొని సము
ద్రాంత మొనసి గదతోఁ బ్ర, శ్యాంతర్దృష్టిఁ బగుల నరిగొన నిలిచెన్. ౫౫

మ॥ పటి సుగ్రీవుఁడు గాంచి మాంగళిక మా ప్రస్థానముం దెల్పి స
ఖ్యాతి సమ్మారుతిసూతి మాఁ టెనయు మన్మైత్ర లక్ష్మణుం డంగదాం
సతిలాలంకిరణం బొనర్చు నెర నా సందర్భంబు దాఁటింతుర్రి వి
రతిలోకప్రతిభాసమానసుహిమామాన్య! రామ! శ్రీమానితా. ౫౬

ఆ॥ మేలి చిగురు లట్టు మృదుపులౌ నిమ్మయి, యడుగు లిట్టి కఠిన మైన నేల
జోఁకి నగలఁ దార్కొఁ జూచి సహింతునే, మకరనిలయ మలఁతి మలసిచను నె.

క॥ అను వాని హితోక్తులు మె, చ్చి నవోన్మేషంబుతోడి సిరి చెలువారం
దనరారి వారి మూఁపుల, నినవంశ్యు లలంకరించి రేడ్తెఱ మెఱయన్. ౫౮

క॥ ధను వెక్కిడి ధర్మాత్ముం, డనుగతసుగ్రీవుఁ డగుచు ననుజుం డటు తో
డనె రా సేనాముఖమున, ననుపొందఁగఁ దనరి కడచె నవ్వార్థి వెసన్. ౫౯

సీ॥ బలుసోఁకి లెగయించి బ్రహ్మాండగోళంబు సవరింతు మని చెప్పి సలుపువారు
సేతువు నడుచక్కఁ జెఱుగంతు లిడుచుఁ గా లానఁ దత్పారా స్థి కదుగు వారు
పార్శ్వభాగంబులఁ బఱతెంచి యొండొర్ల నొరయుచుఁ దటుకున నుఱుకువారు
దారి చాల దటంచు వారిమధ్యంబున నీఁదువా రటు దివి కెగయువారు
నేము వైహాయసపథంబె యెనసివత్తు, మనుచు సౌవర్ణకాఖ్యాన మందిపుచ్చు
కొనెడువారును నై యబ్ధి కూల మెనయఁ గనిరి హరివీరు లుత్ఫుల్లకమలనయన!
తే॥ అట్లు హరివాహిని తరించునపుడు తొడరు
భీమనిర్ఘోష మర్ణవపృథులఘోష
మాఁగి లంకాపురం బెల్ల నాక్రమించెఁ
దొలుతలాఁకు డదియ కాఁగఁ గెలుపశమని! ౬౧
ఆ॥ కడచి యపుడె బహుల కందమూలఫలోద, కంబు నాఁగ నెగడు నంబునిధితొ
టంబునందు విడిసె నంబరంబు గ్రసింప, నదియ చాలు ననఁగ నమరవినుత!
ఉ॥ అబ్బలు వెంచి తచ్చరిత మంతయు మున్కు వమే యనుటంచుఁ బె
ల్లబ్బుర మావహిల్ల నవ్వురా యని వేలుపులు స్మహాస్తలు
న్నిబ్బర మైన దృష్టి నవనీరదవర్ణుని నాముఁ గాంచి పె
న్నుబ్బలి దాఁటినార మని యుబ్బున నైమఱ పుల్లసిల్లఁగన్. ౬౩
ఆ॥ ఇంచురసము లలరు లెలమి మైకొనఁ గురి, యించి సమభిషిక్తుఁ జేసిఁ జెంచు
నెంచు మదిఁ దనర్చి యేణాంకముఖ! యిట్లు, లనిరి వారు లబ్ధలక్ష్యు లగుచు.
మ॥ అరివర్గంబుల గెల్వుమయ్య జగదాహ్లాదంబు చెన్నొందను
ర్వర సద్వీప ససాగరన్ సుమహితైశ్వర్యంబు నేకూరఁ ద
త్సరము ల్శాశ్వతము ల్భరించి మన నిచ్చుం గూర్చుమయ్యా! యిఁక
న్నరదేవర్షిసమర్చ్య! రాఘవ! పరానందస్వరూపా! హరీ! ౬౪
ఆ॥ అనుచు వాచికార్చ లందించి యంతర్ధి, నేయ ననుజు నెడఁదఁ జెప్ప నెప్ప
యానిమిత్తవేత్త యగు నిమిత్తంబులఁ, గాంచి యనలికర్త వుంచి పలికె. ౬౫
క॥ లలితఫలమూలములు శీ, తలజలములు నైన వనుల తలపు లగపడు
వ్వాలనుల నెలకొని యస్మ, ద్బలౌఘముల మోహరింపఁ బరఁగుదు మిఁకన్. ౬౬
క॥ ఆకాలికలోకక్షయ, మీకారణమునఁ బొసంగె నిరుతెగలందున్.
జీకాకుపడుట పాల్పడు, నేకరణిఁ దరింతుమొక్కొ యీయుగ్రవమున్. ౬౭
తే॥ వాతములు వీచుచున్నవి వలనుదలఁగి, యీవసుంధర కంపించు నిటుకపటియు
నగము లగములు వేపమానంబు లగుట, గానవచ్చెడు నిచ్చోటికాననముల. ౬౮
క॥ ఘనములు క్రవ్యాదాకృతు, లను బరుసఁదనంబునం గలకపా టిడ నో
ప్వనముల శోణితజలవృ, ష్టిని మొనయించెడు జనముల చేటు నొడువునన్.

తే॥ రక్తచందనద్యోతసం భక్తఘనతఁ, బరమదారుణ యై సంధ్య పరఁగుచుండ
మాడుచుండెను నాదిత్య మండలమున, నుండి యుల్కైదు నొకవహ్ని పిండ మనఘ.

క॥ దీనములును గ్రూరములును, దీనస్వరములును నగుచు దివికై మోరల్
గా నగుచుఁ గనుచు మెకములు,నా నెత్తిఁ బక్షులును నొకటఁ బలిచెడుఁ బెలుచన్

సీ॥ తనప్రకాశము వీడి తపియింపఁజేయుచు నున్నాఁడు రజనియం దుడుపతేఁడు
కట్టల్ట్ నై కడ కప్పు కెంపులముప్పు నెఱిసూపె రాత్రి మా కుఱుచపరిధి
నీలలక్ష్మ మొకండు నెలకొనె లక్ష్మణా! యమలభాస్వన్మండ లాంతరమున
బందాళి గ్రమ్మినఁ జేరెత్తరాని చుక్క లెత తెల్పునవి త్రయ కాలగతిని
గాకములు శ్యేనములు గృధ్రగములు దక్క,వానిరాయిడి వడగొని వ్రాలఁజొచ్చె
నశివములు భీషణములు నై నట్టి రొదల,వదరుచున్నవి యెపాశ్రిస్త వంచకములు.

ఉ॥ కాఘ్రన శైలశూలములఁ గైకొని వానరగాత్రసౌఘముల్
లాఘ్రనఁ బోర నెక్కొన నిలాతల ముద్ధతమాంసకర్దమం
బావిల మావృతంబు సన నయ్యెడు నిట్టని నంక లెన్నఁగా
నా వల నున్న కాఁగలది యై చన నావలఁ గానఁగానగున్. ౨౪

తే॥ తడయ కొక్కటఁ దొడరి దుర్గధన్య లంక, రాక్షసబలాభిరక్షిత రాజధాని
ముట్టడింతము నాలుగు తట్టు లొరసి, యఖిలమును వానరమయంబ యై తనర్ప.

ఆ॥ నేఁటి కచటి కరిగి నేఁటుకొనందగు, తావు లరసికొని విధంబు లెఱిఁగి
సలుపవలయుఁ గార్య సంస్థనం బని పల్క,నరనాథ విభుఁడు యుద్ధ పరత నెఱయ.

క॥ లంకాభిముఖునై సి,శ్యంకుఁడు రాముండు ధర్మ సంశ్రయుఁ డౌటఁడున్
వంకయిడ రాసి కడిమి న, సాంకాశ్యము ధనువు గొని సు సంగతుఁ డయ్యెన్.

ఉ॥ తోడనె తమ్ముఁడు న్నడిచె దోర్బలసారులు వానరర్షభుల్
తోడయు రక్తదేశపతి తోడ విభీషణుఁ డోర యిట్లఁ జో
జూడ యనంగ మున్నొనఁగ సంభ్రమ మొప్పఁగ శత్రుమర్దనం
బాడఁగ నన మోటయని యాడుచు నర్దనము ల్సెలంగఁగన్. ౨౫

క॥ అరీకుఁ దగువారలు, తాఁగే యనఁగాఁ దనర్చు తారేయాద్యా
ధారుల హరివీరుల నెఱి, యూహాపోహయు నరసి రాముఁ డలరారె ధృతిన్. ౨౬

తే॥ హీనసమితి వ్యవస్థానస్థ రఘుపతి, హీరుచే నది భాసిల్లె వెరన్ను గాంచి
శోభనాంచితానక్షత్ర శుద్ధమూర్తి, మహిత శారది యగు పౌర్ణమాసివోలె. ౩౦

ఆ॥ పుడమి నడఁకఁ బొడరె బోరన నతిపీడ్య,మాన యగుచుఁ ద్రిస్యమాన యగుచు
సాగరమ్ము రమ్ము జూడ వానరబలౌ, ఘమ్ము తలము నెల్లఁ గ్రమ్ముచుండ. ౩౧

శా॥ భేరీమర్దలకాహలాదిరవసంభిన్నంబు రోమాంచదం
బై రక్షఃపురిఁ దోఁచె సంతసముల మా నాకోర్విశ మద్దాని బ
ల్వీరు ల్వానరయూథపు ల్వినిరి తోఁ బెల్లార్పి రత్యంతహా
ర్షారూఢిం దదమర్షణంబు తెఱఁ గిట్లా నాఁగ నొక్కుమ్మడిన్. ౮౨

తే॥ ఆప్లవంగాధిపుల గర్జ లంబరమున, దృప్తమేఘములవి గాఁగఁ దెఱఁగుపడుచు
గర్భనిర్భేద మొనరింపఁ గడలుకొనుట, రాక్షసులు విని రటు మహారాక్షపింటు.

చ॥ దశరథరాజనందనుఁడు తాఁ గనె సప్పురిఁ జిత్తవృత్తికిన్
విశదము గాఁగఁ బండువు నివేదితముం బొనరించుచోప్వనన్
దిశ లోలయించు మంగళవిధిప్రహితాఖిలవాద్యనాదముల్
భృశమణిసౌధరాజసునివిష్టకలాపరిచయంబు లొప్పఁగాన్. ౮౪

తే॥ ఆధ్వజపతాకికావళు లాత్తసార, తోరణద్వారగోపురాపూరణంబు
లావిమానాగ్ర్యలక్ష్మ్యవిద్యాప్రసక్తు, లరసి జానకిఁ బెరసె హృదంతరమున. ౮౫

ఉ॥ ఉమ్మలికమ్ము నెమ్మనము నూర్జితముం బెడదారి కీడ్వఁ దో
నమ్మిహిరాన్వవాయమణి యక్కట చిక్కనకాదె యొంటినై
నమ్మృగశాబకాక్షి ముదితాత్మిక సీత సతీవతంస మీ
యిమ్మున నిమ్ముపిడి యిటు లేఁబడుచుండఁగ నింతకాలమున్. ౮౬

తే॥ రోహితాంగగ్రహార్దిత రోహిణి యన, వితతవగ్రహాతిక్లాంత క్షితి యనంగ
రావణోపరోధంబున రాణసెడఁగ, నెట్లులున్నదియో సాధ్వి యెఱుకపడదు. ౮౭

క॥ అని దీర్ఘము నుష్ణము నగు, వినిశ్వసన మెడల రామవిభుఁడు సుమిత్రా
తనయుం గని తత్కాలో, చనతౌచితి తనర నిట్లుపలికె విధిజ్ఞా! ౮౮

సీ॥ చూడు మో లక్ష్మణా! చుక్కలతెరువెల్లఁ బొడుచుచున్నది లంక పొడవు పెరిగి
తలఁచినంత లొనర్చి దాఁకొల్పెఁ గొండపై నావిశ్వకర్మయుం దైన మయుఁడు
వెలిమబ్బు లొగి గ్రమ్మ విష్ణుపదం బట్లు బహువిమానాళిగ్ర పసఁగె నిదియు
మేలి సంస్థానము ల్మెఱుఁగులీనఁగ లీల నందె నైరమ్మదీ యూధిలక్ష్మి
తమకు నందనచైత్రరథములు చాల, వనెడు వనములు మత్తవిహంగలీన
మధుపఫలపుష్పతరులతామధురవాహి, సీశివానిలకలనల నిఁగుతిఁ దసగ. ౮౯

క॥ పలికెడుఁ జిలుకలు కలరవ, మొలికెడుఁ గలకంఠతతులు మధురలితములం
గులికెడుఁ గేళులు రసములఁ, జిలికెడు నిం దలిరులములు శ్రీ గిరులన్. ౯౦

ఆ॥ ముప్పొలముల సిరుల మొనసినదే వాని, గెలిచినదె విశేష కీర్తికలనఁ
గాని కాంతుఁ డంత కావరుం డనునదే, యొచ్చె మల్లభాగ్య మొంటి కగునె.

క॥ అని పలుకుచుఁ దఱియంజని, జనితోత్సాహమున బలము శాస్త్రవిధి విధిం
చెను నిలువ మోహరింపఁగ, ననుపమవీర్యుండు రాముఁ డధికృతి వెలయన్. ౯౨

—♦ శ్రీరాముఁడు గరుడవ్యూహమున సైన్యము మోహరించి శుకు విడిపించుట. ♦—

సీ॥ నీలుఁ డంగదునితో నెత్తి దుర్జయుం డయి యురమున నెలకొని యుండువాఁడు
ఋషభుండు వానర వృషభుండు బలముతో దక్షిణపక్షాప్తిఁ దనరువాఁడు
గంధహస్తితరస్వి గంధమాదనుఁడు దుర్ధర్షుఁ డా సవ్యపార్శ్వంబువాఁడు
ననుఁ బురస్కృతుఁ గాఁగ ననిచి నాతమ్ముండు తల నిల్చి దండడి సలుపువాఁడు
వేగదర్శిసుషేణులఁ బెరసి జాంబవంతుఁ డటు కుక్షి రక్షించు వాఁడు రాజు
జగముపశ్చార్ధ మప్పతి జాడఁ దేజ, మెసఁగ జఘనస్థలావన మొనయువాఁడు. ౯౩

క॥ ఈహారువున గారుడ మగు, వ్యూహము సమకట్టి ననిచి యొక్కట లంకా
గాహన కొనుసరింపంజను, నాహిత మిది మీఱ దెంచి నడువుం డనినన్. ౯౪

క॥ రాముని యానతి గైకొని యామెయి మొగ్గరము వన్ని యనలసులై వా
రాముకొని లంక కరిగిరి, సామంతులు మెచ్చి పొగడ జలజాతాక్షీ!. ౯౫

ఆ॥ మేఘమాల దఱిసి మెఱుఁగు లొప్పారంగ, నాకసంబు గ్రమ్ము నట్లుగాఁగ
రాము సేన హరివరప్రతిపాలిత, పుడమి నాక్రమించి పొల్చె నపుడు. ౯౬

మ॥ గిరిశృంగంబులుఁ బెద్దభూరుహములుం గేల్గొం దలిర్పంగ వా
నరవర్యుల్ పులకించుచుం దనుజు లన్నన్మారకుం బాఱెఁ బై
పెరుగంజొచ్చిరి లంక యింకఁ గలదే బీభత్సము ల్గారె యా
యరు లేముష్టులె తాలె చాలు నన నా నారూఢభావంబులన్. ౯౭

క॥ అంతట రాముఁడు నలినీ, కాంతునిఁ దేజమునఁ దొడరు కలనఁ దగి రుమా
కాంతునిఁ గనుఁగొని యిట్లనె, నంతనము దయాసముద్ర మయ్యై తెసరన్.

క॥ సువిభక్తము గ్రసవి యవు, డవికలముగ సైన్యములు మహాబ్ధిఁ గడచి లం
కవలను గన్నారము శుకు, నవశ్యము వ్విడిచిపుచ్చుఁ డతఁ డిలు సేరన్. ౯౯

ఉ॥ నాఁడుడు రాజశాసనము నం గపినాథుఁడు శుకు న్విముక్తునిం
గా వరవెంచి చేయు మనఁ గావలు నీతని వీడనయ్యెఁబో
దైవము మేలు గూర్పఁ దగ దా మన కం చలయించి వంచి రా
ధీవరు లొంటుఁడుం జనియెఁ ద్రికొని రక్కసితేని పాలికిన్. ౧౦౦

మ॥ వెడన వ్యాప్పఁగ రావణుండు శుకుని న్వీక్షించి యోరోరి! యీ
పెడరూపంబు ఘటిల్లెఁ గట్టుపడితే భీతిల్లితే తెక్కలి
ట్లుడలం గాఁగనె సిమి చంచలమునం బ్లోలాంగతు ల్నీవు లోఁ
బడ హాస్యాస్పదుఁ జేసి పుచ్చిరె కపు ల్పాటిల్లఁగాఁ దెల్పుమీ. ౧౦౧

క॥ అని భయసంవిగ్నుని దై, త్యుఁ సి తేఁ డడుగంగ వాఁడు తడయక తగిన
ట్లనయించ నుత్తమోత్తర, మనుపమగుణసదన! చంద్రహాసిసువదనా! ౧౦౨

—♦ శుకుఁడు రావణునితోఁ దనపాటు చెప్పుట. ♦—

సీ॥ నాథ! నీచనుమన్న నయ మెంచి పున్నీటి యుత్తరపుందీర మొలయఁగంటి
నీచెప్పిన ట్లంటి నియతిమై నక్లిష్టమృదురీతిఁ గపినాథుఁ డెదిరి వినఁగఁ
జూచినంతనె మేలి చూ ప్పెన్నకయె మింటి పైఁబ్రాఁకి కపులు న న్బట్టుకొనిరి
పొడిచిరి పిడికిళ్లఁ బొనుపేది పొనుపడ ద్రొక్కులు విఱిచిరి ముక్కులుగను.
బలుకు తెలుఁగు లేదు ప్రశ్నోత్తరంబులు, పొడమ వచటఁ దోడబుట్టి నదియ
యలుక వారి త్రైక్ష్ణ్య మందరానిది యన, నేమిగలదు వాద మింకమీఁద.
ఆ॥ రామ రామ రక్ష రక్ష యటంచు నే, మొఱ్ఱపెట్ట నతఁడు ముదల యిడఁగ
నెట్లొ విడిచి రెగసి యే మందు ననునంతఁ, గడఁగి కట్టి యిడిరి కదలనీక. ౧౦౪
క॥ వికట మగు పలుకు పలికెను, బ్రికటబలుఁడు ప్లవగపతియుఁ బార్థివుఁ డింకన్
సుకరముగ నొడువువాఁడే, యకలంకత యెట్లు పొసఁగు నరిపక్షమునన్. ౧౦౫
ఆ॥ ఆవిరాధహంత యాకబంధవిరోధి, యాఖరాంతకుండు హరిబలములు
పతియుఁ దోడుగాఁగఁ బ్రిబలినాఁ డిప్పుడు, చెలువ యున్నచోటు సేరఁగాంచి,
క॥ ఆటాడినట్టులే ము, న్నీట న్సేతువు రచించి నీరధి తీరం
బోటమి లే కారసి తృణ, దాటతృణీకరణ మెంత యనె వి ల్గొనుచున్. ౧౦౬
ఉ॥ కొండలఁ బోలి మేఘతతి కొత్తల కేమనఁ జాలి దండ ను
ద్దండతఁ గ్రాలి నేలకనితా నిడనోపు ననంగ నల్గడల్
నిండఁగ నోలి వాలిసుత నీలముఖాద్యులు ఋక్షవానరుల్
గండరగండ రాముకొనఁ గాలము సేకురె నింక లంకకున్. ౧౦౭
తే॥ సంధి పొసఁగదు రాక్షస సంఘమునకు, వానరేంద్రచమూపతీ వాహమునకు
దేవదానవతతుల కా తీర్పు నెఱప, వచ్చుచున్నారు కన్నారు వలనిగములు.
ఆ॥ ఆక్రమింప నవల నయ్యెడు మే లున్నె, మనకు నొండు కీడుమాట పుట్ట
కున్నయంతలోనె యువిద నిత్తువొ లేక, యెదిరి చక్కనిలువ నెంతొ యధిప.
తే॥ రాజు పలుకు పలుకె కపిరాజు పలుకుఁ, దమ్ముఁ డనినట్టులే నీదు తమ్ముఁడు ననుఁ
జాలుదురు వారె సకలంబు సంహరింప, నంద ఱేల రాముఁడె యోపు ననధరింప.
ఆ॥ ఎట్టి రూపు గంటి నేమేమి వినఁగంటి, గంటిలేని యెఱుకఁగడలుకొంటి
రాముఁ దఱిసినంత రావణా! యది నాదు, మదికె ముదల యొండుమాట లేల.
క॥ లంకారిప్రభృతులు త, త్కింకరులఁటె వారి గెలువ దేవుం డొకఁ డే
వంకఁ గలవాఁడు సందియ, మింకం జనదేని నిలిచి యింతయుఁ గనుమీ. ౧౧౩
తే॥ పెద్దపెద్దలు పేరును బెంపుఁ గన్న, వారి నెట్టెట్టొ వివరింప వచ్చునేమొ
కాని కడతేర్ప వచ్చు నీ కడలిపొంగు, ఖంగు రని పల్కరా దెడఁ గదియరాదు.

తే॥ తొమ్మిదయి దేడు వేలతోఁ దొడరు లెక్కఁ
గోట్లు శంఖసహస్రము లొక్కసరు బృంద
శతములును గాఁగ నున్నారు సచివు లినజుఁ
గలిసి మనువారు పెరవారి గణన మెట్లొ. ౧౧౫

—♦ శుకుఁడు రావణునకు రామతత్త్వ మెఱింగించుట. ♦—

క॥ ఇంద ఱఁ గొని యందమ్ముపై, నందముతో రాముఁ డిచటి కరుదెంచె నెవం
దుందుఁ జన నైన మనసీ, డందిచ్చెద నున్నమాట కరమఱ లేలా. ౧౧౬
ఉ॥ కాయజుఁ గన్న తండ్రి యగుఁ గాని మనుష్యుఁడు గాఁడు దేవ నా
రాయణమూర్తి రాముఁడు ధరాత్మజ లక్ష్మి జగద్ధితస్థితిం
బాయనిరీతి న్మెలఁగుఁ బా యొనరింతురు తల్లిదండ్రులే
కా యటుగాన వారిదెసఁ గల్మషవర్తనము ల్పొసంగునే. ౧౧౭
తే॥ ఆజగద్ధాత్రిఁ జిచ్ఛక్తి నఖిలలోక, మాత సీతను నేత కన్మలఁచి యొడిచి
తెచ్చితి నటంచుఁ దలఁచుట తెలివి లేమి, గాని తద్వాదులకు భిద గానఁబడదు.
సీ॥ క్షణనాశకలిత మీసంసార మన మేను క్షణభంగురము గాక సంతతంబె
పాంచభౌతిక మది పంచవింశతితత్త్వ కలన బుద్బుద మట్లు గాని పించు
మడఁగుచుండును రక్తమాంసాస్థివికృతంబు దుర్గంధమలమూత్ర దూషితంబు
నై జడం బలదాని కై బ్రహ్మహత్యాది పాతకంబు లొనర్చుఁ బ్రాకృతుండు.
తన కహంకృతిబంధంబు తప్పలుసూపఁ, జేయరాని కృత్యము లెల్లఁ జేసి తనువుఁ
బాసి యఘసుఖకారణ పాపపుణ్య, భోగలబ్ధికి వెండియుఁ బుట్టుచుండు. ౧౧౯
క॥ మే నే నను నజ్ఞానం, బేనాఁటికి వీడకుండు నెడలదు బంధం
బానాఁటివఱకు నట్టులు, గాన వికారప్రపంచ కలనలు గలుగున్. ౧౨౦
క॥ ఆత్మ విశుద్ధుఁడు ప్రాజ్ఞుఁ, డాత్ముం డద్వయుఁ డచలుఁడు నను తత్త్వధృతిన్
స్వాత్మపరుఁ డగుచు నెప్పుడు, నాత్మవశతఁ బోఁడొ ముక్తుఁ డౌ నవు డనఘా.
మ॥ నిరయస్వర్గముల న్స్వసూకరతనూ నిష్ఠత్వమందు న్నరా
మరపిండంబులయందు భోగములు సామాన్యంబు లై యుంట మే
లెఱయంజాలఁడు దేహి దేహకలితాహంభావ మట్లుండఁగా
విరతిం గాంచి సుఖించు సత్తముఁడు దా విశ్వాధికుం డౌ స్థితిన్. ౧౨౨
ఉ॥ కావున నీవు శుద్ధమతిఁ గైకొని మోహరతిం ద్యజించి స
ద్భావము కల్మి నౌ విరతి దారసుతాదులపట్లఁ గొంచు సం
భావన సేయు మాత్మహిత పద్ధతి నప్పరమార్థతత్త్వమున్
బోవుదు ముక్తి కాపె నిన్నుఁ బూరుషు డంచు వరించి మించఁగన్. ౧౨౩

ఆ॥ కలితభారతాఖ్య కర్మభూమి జనించి, యందు నేని ద్విజత నధిగమించి
యాత్మతత్త్వ మిట్టి దని యెంచి విదితుఁ డౌ, వాఁడు దేహభోగ వశ్యుఁ డగునె.
ఆ॥ బుద్ధిశాలి వైతి పొడవుపడితి వెల్ల, శాస్త్రములును జదివి చదురుగొంటి
శక్తిఁ బొందవె మేలి జపతపోయోగాప్తి, నిట్టి బంధ మేల నొదల దధిప. ౧౨౬
తే॥ బ్రహ్మకులమునఁ బొడమిన బ్రాహ్మణుఁడ, వాపులస్త్యుని మనుమండ వరసియుగల
నైన భోగేచ్ఛ లుడిగి పరాత్మ గాము, భక్తి సేవించి గాంచుము పరమపదము.
తే॥ మాతృవత్పూజ్య సీత గా మవనిభునకు, నప్పన మొనర్చి తచ్చరణానుచరుఁడ
వగు మఖిలకల్మషవిముక్తి నందఁగాంతు, వతఁడు చేపట్టి ప్రోచు నిన్ననవరతము.
చ॥ మకరతకాంతికాంతు రఘుమండను బొంత ధరిత్రిపుత్రి సుం
దరవుఁ గడానిబొమ్మ ధృతిఁ దాగ్నము నేర్పున లక్ష్మి యంచు శ్రీ
హరి యనుచు న్భజింపు మనుజార్కతనూజవిభీషణార్చితుం
డరమఱ లేక గాంచు నిను నాదట ధన్యుఁడ వౌదు రావణా. ౧౨౭
ఆ॥ విభుని శరణుఁజొచ్చి విష్ణులోకమునకుఁ, బోవువాఁడ వట్టి పొలుపు దక్క
లేని నేగువాఁడ వెట్లు సద్గోగతి, కింత నిజము నాదు మాట మఱయుము. ౧౨౮
క॥ అని యిట్లు ప్రబోధించెను, వనజాక్షీ ! వాఁడు దనుజ వల్లభునకు శ్రీఁ
దనరె శుకగీత నా నది, జననాది క్లేశశమని సన్నుతి యగుచున్. ౧౨౯
క॥ ఆశాసనంబు వాని క, నాశాస్యము గాఁగఁ దోన యదరిపడుచు న
య్యాశరు దహించునో యన, నై శాంతి దొరంగి యిట్టు లనె శైలసుతా. ౧౩౦

—♦ రావణుఁడు కోపించుట. ♦—

శా॥ ఓరీ దుర్మతి ! ముజ్జగంబులకు నే నొక్కండ శాసింపఁగా
నై రాజిల్లుచునుండఁ గింకరుఁడ వీ వయ్యు న్వలం కింత లే
కీరీతి న్వచియింపవచ్చితివి సి గ్గేమాయెరా శిష్యుఁడే
లేరా యేఁడు గురుండ వైతి వికనో లిం గాంతు విస్తారముల్. ౧౩౨
క॥ శిక్షించితి మంచిగ నిను, శిక్షించెద ననినఁ బూర్వసేవాకృత మా
దాక్షిణ్య మెడలకున్నది, పక్షీ ! యెటఁ బోయి నైన బ్రదుకుము సరగన్. ౧౩౩
సీ॥ ఇత్తునే సీత నే నీరేడుజగముల వా రొక్కటై యెత్తివచ్చి రనిన
రాముఁ డెన్నఁడు గ్రిమ్ము నో మచ్ఛలీముఖతతి యామని బ్రిఫుల్లతరు తతిగతిఁ
దోలు టెట్టో వానిఁ దూణీశయాత్మీయశరముల నుల్కలఁ గరని బోనా
నుదయించుచునె రవి యుడుల దీప్తుల నెట్లు బలము గైకొని వారి ప్రభ లడంతు
నెఱుఁగఁ డీవేగ మీగతి యీబలమ్ము, నెట్లు సాగరమారుతాహీనవిదిత
ము లని సవిషోరగమ్ము లీ ములుకులనియుఁ, గాన వచ్చుచునున్నాఁడు కదనమునకు.

తే॥ నాధనశ్రేణి శరకోణ నాదిత యుగి, ఘోర జ్యారవతుముల యార్తోరుఘోష
హేతునాగాచవినద వాయింతు నిపుడె, యహితసేనామహారంగ మధిగమించి.

తే॥ వేయుఁగన్నులు గల యింద్రుఁడో యనలుఁడో
వరుణుఁడో యముఁడో వైశ్రవణుఁడో నన్నుఁ
జెనకి ధర్షింప రణభూమి సీమఁ జేరఁ
బాఱెనంత నె భీతుఁడై పరువు లిడఁడె. ౧౩౬

తే॥ ఇట్టి కారు లఱచినఁ బైపైఁ హింససేఁత, నాయ సుగు జాలిపడినది నామనంబు
చూచి మొగ్గవోక పరిశేఁడుచూడ్కి కెదుట, నిలువకుమనంగ వాఁడు వినీతుఁడగుచు.

—◆ శుకుని పూర్వజన్మకథనము. ◆—

ఆ॥ దండ మిడి ప్రసాద ముందుగాత మటంచుఁ, బాసె నచటు శుకుఁడు బ్రాహ్మణుండు
బ్రహ్మవిత్తముండు బ్రహ్మనిష్ఠుఁడు మున్ను, వాని కిట్టి విగతి వచ్చిపడియె. ౧౩౭

శా॥ వానప్రస్థవిధానముం గొని మహావన్యస్థలిన్ నిల్చి క
ర్మానూనస్థితిఁ బొల్చి జన్నములు నిత్యంబాచరింపంగ న
ద్దానం దానవనాశ మేర్పడఁ బ్రమోదంబు బెబ్బ దేవాళి క
ల్యాణం బాటున కోర్వ కయ్యసురు లొయ్యన్ వైర మేపారఁగన్. ౧౩౮

అ॥ కాచియుండి రప్డు కడు నగ్గలిక వజ్రదంష్ట్రుఁ డనఁగ నెగడు దైత్యుఁ డొకఁడు
ధారసల్లి తవిలి తెఱచి యుపకార, మొనరఁగూర్పఁ దలఁచు చుండునంత. ౧౪౦

క॥ పిసుగ్రీసుఁ దగ స్వామినివరుఁ, డాశ్రమపదమున కొకప్పు డరుదెంచినచో
బ్రశ్రితుఁ డగుచు సమర్చల, నక్రముఁ గావించి యాతఁ డాఘనుతోడన్ ౧౪౧

ఆ॥ చెలుకితాంబువిధపి మహాత్మ! నాయింట, భోజనంబు సేసి పుణ్యాతముని
స న్నెనగ్న్ని మనుచు నాతండ్రి! ప్రార్థింతు, నవిన వల్లె యనుచు నాతఁ డలరి.

ఉ॥ స్నానము సేయఁగాఁ జనిన నందు గ్రహించి తపస్విరూపునన్
దానవుఁ డేగు దెంచి ద్విజుఁ దద్దయుఁ గన్గొని పెద్దకాల ము
న్లె నెఱి భాగమాంస మొసఁగే కిఱవా యెను దానితోడి సా
బానము వెట్టుమన్న నది పొందుగఁ గూర్పఁగఁబంచె నాతఁడున్. ౧౪౩

ఆ॥ భార్య భర్తయాజ్ఞఁ బడసి యత్నంబు సరంప, మాని భోజనేచ్ఛ మలసియుండ
నాతి యేగి మొఱఁగి యాకారూపునఁదోఁచి, యసురు మనుజమాంస మొసఁగచనియె.

చ॥ అది గని మౌని యీ మిషమహా సమకూర్తి యమేధ్య మింత దు
ర్మద మెటు గట్టె నీకిదియు మానిత మయ్యెనయేని నట్టులే
పొదలెదుగాక రాశి వయి పొమ్మని సంయమి తిట్ట దానికిం
గదలెను గాలిచేఁ గదలికాండముఁ బోలి ద్విజుండు భీతుఁడై. ౧౪౪

సీ॥ అధినేత పనిచిన యాకృత్య మంతయు నింతకే తీర్పంగ నేని నెయిమనఁ
డం దించుకంతయు సంశయపడ నేని నల్లెడ లారసి యెఱుఁగఁ గాంచు
డది యసాధ్యము కాఁగ మదికిఁ దోఁచినఁ దోడు సూచి విభీషణుఁ డనుమానముల సిరంపు
చిక్కితి మింకెట్లు జీవింతు మే మంచుఁ దలఁకు గ్రక్కొనకుఁ డీ దండ సేఁడ
పట్టుబడినవారిఁ బాఱిపోయెడువారి. శరణుడించువారిఁ జంప మొప్పదు
నెగిచిపడెడువారి నేయుదు మిల్లాట, మీర లారసి యిచ్చమెయి మెలఁగుఁడు.
ఆ॥ అడుగుచున్నవార లన్న విభీషణా!, వీరి విడువుమయ్య! విధియు నదియ
శత్రుపక్షకృతివిచారులు చారులు, తెరువువట్టి యెపుడుఁ దిరుగుచుండ్రు. ౧౬౬
ఉ॥ ఓచరులార! మీరు భయ మొయ్యన వీడి పురంబు సేరి దో
షాచరనాథుని న్గనసి చక్క వచింపుఁడు నాదు పల్కుగా
నేచతురత్వ మెబలము నెక్కటి నమ్మి మదీయ సీత స
ట్లాచికొనంగఁ దెచ్చి తది యయ్యదియుం బ్రకటింపు మిప్డటన్. ౧౬౭
క॥ ఎక్కటి రాఁబోకుము నీ, చక్కటి సైన్యములఁ గాంచు సహజులు సుతులుం
బ్రక్కలఁ గాచుకొనంగఁ బెం, పెక్కిన ధృతి సమరభూమిఁ బరియుము కడఁకన్.
ఆ॥ ఎల్లి దెల్లవాఱు టే మెద ల్నిలంక, నాశరౌఘ మగును నాశ మగుదు
గోపురాట్టవప్రికూటకోటులతోడ, నాశ లుండ వింక నాశగాంచ. ౧౬౮
క॥ భీమ క్రుధ యిర్వ్యొడంగడు, నేమమునఁ గ నున్నయది యనీకయుతుని సి
న్నే మరులుకొన్నయది కొన, నామఘఘ్నుని యశని దానవౌఘముఁ బెలెన్.
క॥ అని తెలిపిన సందేశం, బనుపదము గ్రహించి విజయ మందుము దేవా!
యని పలికి చనిరి వారఁ, య్యనుపమగుణు ధర్మవత్సలాంఘ్రుఁ బొగడుచున్. ౧౭౦

—♦ శుకసారణులు రావణునకు రామబల మెఱిఁగించుట ♦—

ఉ॥ అంకము సేరి రావణు నిరంకుశుఁ గన్గొని వార లొక్కటన్
శంకలుదక్కి వాకొనఁగ సాగిరి దేవ! విభీషణుండు నా
శంకరుఁ డౌచుఁ బట్టుకొని సన్నిధి సేర్చిన నమ్మహాస్వ సై
మంకరుఁ డాత్తధర్ముఁడు ప్రమాణము రాముఁడె మమ్ము వీడఁగాన్. ౧౭౨
మ॥ ఒకచోఁ జేరిరి వారు నల్వురు మహోద్యోగంబు చెన్నొంద భా
సకుఁ డారాముఁడు లక్ష్మణుండు రిపుసంజాతుండు సీతమ్ముఁడున్
బ్రకటశ్రీకుఁడు భానుపుత్రుఁడును నేపట్టేసి గుట్టేనియున్
వికలత్వంబును గాంచఁగాని మన వోవిఖ్యాతశౌర్యోదయా! ౧౭౩
ఆ॥ పెల్లగించి లంకఁ బెరచోటఁ బెట్టంగఁ, జాలువారు వారి జాడ లేల
యొకఁడె యంతపనికి నోపు నం చెఱిఁగించు, రాము రూపరేఖ కామతములు.

ఆ॥ వారిచేత గుప్త వానరవాహిని, ముంచు నెల్లలోకములుఁ గడంగి
అది సురాసురులకు నయ్యింద్రునకును దు, ర్ధర్షతరయు కాని తరముపడదు. ౧౭౫
క॥ అంబుధిఁ గడచినపుడె ది, వ్యాంబోఘు మమోఘు మనఁగ నై యదియు నిరా
లంబ యనరాని తీర్పున, నంబరము గ్రసించుచుండె నభిరామముగాన్. ౧౭౬
తే॥ అతిదృఢమనస్కు లోజస్వు లాజిలోల, సులు వనౌకసు లవ్వారి వలని ధ్వజిని
హర్షగాప యనఁగఁ బోలు నలుకఁ జాలు, రామునమ్మెలుబంతిఁ గూర్వ నగుమేలు.
తే॥ పథ్య మక్లీబమును నయి పరఁగుచున్న, తదభిభాషితమును విని దశముఖుండు
తన్నిషేధతత్పరుఁడు నై తనరెఁ గాని, రూఢపద మెన్నఁబోఁడు మూర్ఖుండు వాఁడు.

—♦ రావణుని యాత్మస్తుతి. వానరబలవిచారణ. ♦—

క॥ నన్నెదిరి దేవదానవు, లన్నెతి గంధర్వనరులు నణుమఁదలఁచిరే
నిన్నేలక న్నిత్తునె, యన్నఅజాణతన మెల్ల నరయం జనదే. ౧౭౯
ఉ॥ శంకిత వీవు సారణ! విచారణసేయక చేల వోట ని
శ్శంకితవృత్తి మీఁ దరయఁజాలక జాలక యెన్న కూరకే
గొంకక కూడిరానయిన కోతులనీతులు గెల్పు గూర్తు రం
చుంకువఁగోరు రాముఁ గసి యోటమి గాటముగా వచించుటల్. ౧౮౦
చ॥ సమరమునందు నన్నెలువఁజాలఁ డొకండు నిజమ్ము లెంచ డటం
చమరవిరోధ యాచరుల నాదటఁ దోడ్కొని చంద్రపాండరం
బమితసముచ్ఛ్రయంబధికలంబితమై తగు నొక్క దివ్యహ
ర్మ్యముననఁ దనర్చెఁ గృద్ధుఁ డయి యంతయుఁ గన్గొను మంతనంబునన్. ౧౮౧
ఉ॥ ఏమొడఁ గాంచినం ప్లవగులే యనసైగిరి వార్ధి వన్యలం
దాముల దోటలం దవనియం దొకయించుక యేని రిత్తవో
టై యిది గానఁగనంబడక యీయితనై తగు తద్బలౌఘముల్
బాయసికిన్నఁ గన్గొనియెఁ బాలసుఁ డయ్యసురుండు చిన్మయో! ౧౮౨
తే॥ అప్లవార మసంఖ్యయమై తనర్చు,
రాము సైన్యంబు వీక్షించి రాక్షసేంద్రుఁ
డనిగు సారణుఁ గసి తొంటి యాపదంబె
యరయఁ డాపదంబుధిఁ దీర్చు నాపదంబు. ౧౮౩
ఉ॥ ఎవ్వరు ముఖ్యు లందు సుగుణోడితు లెవ్వరు శూరు లెవ్వరిం
కెవ్వరు సద్బలాఢ్యులు మఱెవ్వరు ప్రోద్యతశక్తి లంకఁ జొచ్చెఁ
జివ్వకుఁ గాలుద్రువ్వెదరు చేర్చెఁ జెవి న్విభుఁ డట్టి వారివ
లక్షవివరం బొగి న్విశదమై తగ నాడఁగదంగు మిత్తఱిన్. ౧౮౪

తే॥ యూథపులకైన యూథపు లొప్పువారి, పై నియుక్తు లమాత్యు లేపగిదివారొ
యప్రధానప్రధానాప్తు లనువుపడఁగ, దెలుపు మోయిసారణ! నీదు ధీప్రసక్తి.

క॥ అనిన వినిపింతుఁ జెల్లము, గనె నీయడిగిన తెఱంగు గలయ నరసి వ
చ్చినవాఁడ నగుట నంతయుఁ, గనుకలి నిశ్చిత మొనర్పఁగాఁ జను నధిపా! ౧౮౭

—♦ సారణుఁడు రావణునకు రామసైన్య ప్రభావ మెఱిఁగించుట ♦—

ఉ॥ అంకిలి దేఱి లంకఁ గని యార్చెడు నార్పులు నింగిముట్ట సా
శంకతమై వడం కెడు ప్రసంగము దీనికిఁ గూర్చినాఁడు ని
శ్శంకులు నూఱువేల కగు సైన్యపతు ల్దనుఁ గొల్వ నీలనా
మాంకుఁ డధీశు వాహినుల కాతఁడె చేఁ డర లేక గాంచితే. ౧౮౮

సీ॥ ఎగుభుజమ్ములు సాచి యెగయించు నింగి న ట్లడుగుల భూతలం బవియఁద్రొక్కి
బీరమ్ము గ్రోధమ్ముఁ బిరికొన లంకకై యావలించుచుఁ జూడ్కు లగ్గిఁ జేయు
దెసలు గ్రక్కదలంగఁ దివిరి లాంగూల సమాస్ఫోటనక్ష్వేళ లావహించుఁ
గొండకొమ్మనఁ దమ్మికొనపూలరంగున తీర్పొందు తనదు మేనేర్పరించు
వాలి తఱువాఁతి వాలి రాచూలి మెచ్చుఁ బ్రొద్దుచూలి యలర్చిన ముద్దు దన్నుఁ
జిన్నయొడయనిఁ జేయంగఁ బేరు పెంపు, గన్నవాఁ డంగదుఁడు సిరి గొన్నవాఁడు.

ఉ॥ నిన్నదె యాజికిం గడఁగి నెట్టనఁ బిల్చుచునున్నవాఁడు సం
పన్ను నొనర్తు రాము నని బాసలు సేసెడు చిన్నతండ్రికిం
దిన్నని బంటు స్వర్పతికిఁ దీరుగ నప్పతివోలె విక్రమం
బన్నువ గాదు బుద్ధిబల మంతకుమీఁదు గణింపఁజొచ్చినన్. ౧౮౯

తే॥ ఎంత లొనరించె హనుమంతుఁ డిచటు ద్రొక్కి
యంతయును వీనియలవార్పె యనఁగఁ జెల్లు
నిరువురును రామహిత మెద నెంచువారు
జోడుకోడెల కా నెందుఁ జొచ్చువారు. ౧౯౦

క॥ బహువానరేంద్రయూథపు, లహామహామికఁ దన్నుఁగొలిచి యరుదేరఁ గడుం
బహుమాన మొనయు తలఁపున, విహరించెడు నీదుమొనల వెస దుర్గయుఁ దై.

ఆ॥ అతని ననుసరించి యార్భటులెసలఁగంగఁ, బెద్దసేనఁ గొంచు బెట్టిదంబు
సూప నెంచువాఁడ చూ నలాఖ్యుఁడు సేతు, హేతుభూతుఁ డటు ప్రభూతబలుఁడు.

ఉ॥ మేనులు వెంచుచుం బుడమి మెట్టుచు గర్జ లొనర్చుచుం బొరిం
బూనిన యాగ్రహమ్ము నెఱి బుట్టిన దిట్టలు జృంభణ ల్మహా
గోనినదంబులం దెగడ ఘోరులు చండులు చండవిక్రము
ల్గా నగు సైనికు ల్మొనయఁగాఁ గడు నొప్పెడు వాఁడు గంటివే. ౧౯౩

ఆ॥ అరయ నష్టశతసహస్రము లర్కకోటి, శతము లనఁగఁ దనరు చందనాద్రి
వాసిసైన్య మతనివలనిది పతి మెచ్చ, వడసె లంకఁ గెడపఁ దొడరినాఁడు ౧౯౪

ఉ॥ శ్వేతుఁ డనంగ వాఁడె రణసిద్ధికిఁ దూఁగెడు వెండికొండ వి
ఖ్యాతుఁడు ముజ్జగంబుల రయంబున బుద్ధిని విక్రమంబునన్
జేతముఁ జిక్కఁబట్టి విభు చెంతకుఁ బోవుచువచ్చుచున్నవాఁ
డేతతి నొప్పఁ దోఁపెడుటయే బలమంతయు సంతసింపఁగన్. ౧౯౫

క॥ అమితోద్ధతం బనీకం, బమర్షమయ మంతరంగ మనుపమ తేజః
క్రమ మధిభాస్కరలక్ష్యం, బమరనిభుం డతని పేర నిరంతరము లగున్. ౧౯౬

తే॥ గోమతీతీరమందు సంకోచనాఖ్య, నమరు నానాద్రుమాంచిత మైన శిఖరి
నుండి శాసించువాఁడు మున్నోజమెయిని, వాఁడె కుముదుండు యూథపవర్యుఁ డధిప.

క॥ బలము లమేయము లీతని, బలసి కొలిచి కన్నునన్నఁ బర తేరఁ గడున్
జలమున లంకె చెసకుఁ జూ, డ్కల నలవాల్చెదుఁ బ్రినక్తి గొనకొనుచుండన్.

ఉ॥ వాలము లెట్టు గ్రాలునవి వాలమువాలము లెన్ని బాఱలో
వాలుగ నాఁగ బాఱులిడి వర్ధిలి పీతసితారుణంబు లై
పోలఁగ రోషణుండు పరిపుష్టుఁ డదీనుఁడు యుద్ధకాంక్షి యా
భీలుఁడు వాఁడె చండుఁ డని పేర్కొన నైన ఘనుం డధీశ్వరా!. ౧౯౯

ఆ॥ వీఁడు గూడ లంక విదలింతు నని నేన, యని సహస్రశతసహస్రసంఖ్య
లైన కపులతోడ నడరుచున్నవాఁ, డధిపుఁ డాజ్ఞ యిచ్చె నవధి గాఁగ.

శా॥ సింహప్రక్రము దీర్ఘనేత్రు నిభృతశ్రీఁ బింగళాంగు న్మహా
రంహంబుం గాంచితే రంభుఁ డాతఁడు శతారంభుండుఁ దా లంకపైఁ
సంహారాదృష్టి నిగుడువాఁ డలుకమై నేఁ గాల్పఁగా సంచరిన్
సంహారోద్యతరుద్రుఁ బూర్జటియె యాచందం బెటింగించెడిన్. ౨౦౧

తే॥ వింధ్యకృష్ణసహ్యపార్వయ నిగస్రోతసులు, నటు సుదర్శనసంజ్ఞంబు లైన గిరుల
నుండుఁ జండక్రమముగొల్చుచుండుబలము, శతశతసహస్రసంఖ్యోపసంఖ్యమగుచు.

ఉ॥ కర్ణవివృత్త్యమున్నపరి కంపనభృంగభిణాసిరగ్రగాస్తని
ర్వర్ణనము ల్పొనర్చు నపవాదము మిత్తికిఁ గూర్చు జంకెఁ డా
యర్ణవ మన్న యుద్ధ మన నైన స్వవాలముఁ జేర్చు నార్చు సం
పూర్ణబలోల్లసత్ప్రియుఁడు పోటరి యాశరభాఖ్యుఁ డొప్పెడిన్. ౨౦౩

తే॥ రమ్యసాల్వేయపర్వతరాజ మెసఁగు, మనికిపట్టు దనకు బసలమానయుతులు
నలువదుల నూర్ల వేల కోట్ల నాయకులుమహాబలులుగొల్చుచుండుదురనవరతము.

తే॥ శరభ సాళువ మయ్యె నీశ్వరుఁ డొకప్పు, డరికరము నరసింహంబు నాక్రమింప
నిపుడు కేవలశరభాఖ్య నెగడెం చె, వానరుం డయి వాఁడు సర్వంబు గెలువ.

వ॥ అదె యవ్వాని కనంతరుండై. ౨౦౬

మ॥ ధరణిం గప్పుచు నొప్పు నాకసము నట్టం బట్టు లెవ్వాడు వా
నరవీరోత్తములందు వేలుపులలో నన్యాసన్నుం డెట్టు లా
స్ఫురణం బొల్చెడుఁ జూడు మెవ్వని భుజాస్ఫోటధ్వను ల్సైన్యసా
గరనాదంబులతోఁ గడల్కొనియె ధక్కాలక్షలక్ష్యార్భటిన్. ౨౦౭

తే॥ ఉత్తముఁడు పారియాత్రి మను త్తమంబు, పర్వతంబు నధిష్ఠించి పరఁగువాఁడు
పనసుఁ డీతండు యుద్ధదుష్ప్రసహుఁ డితనిఁ, గొల్చు శతశతసాహస్రి కోటిబలము.

ఉ॥ రెండవసాగరం బనఁ గరేణుఘటాసముదీర్ణ మౌ బలం
బొండు దలంగనీనిధృతి నో జమెయిం దనుఁ గొల్వఁ గొండ్వోఁ
గొండ యనం దనర్చు బలుగొండలదండ నెలర్చు వాఁడె పో
గండరగండఁ డెమ్మెయినిఁ గాంచెనొకో వినతాభిధానమున్. ౨౦౯

తే॥ ఇతఁడు పర్ణాస యనునది నెనఁగు రసముఁ, గ్రోలి పరిపుష్టుఁ డైనాఁడుకోటగోపఁ
కట్టనిది పెట్టనిది యయి కానిపించు, భుజబలంబె బలంబుల ప్రోలిసిరికి. ౨౧౦

మ॥ అడుగో షష్టిసహస్రికాశతకనం ఖ్యాకంబు సైన్యంబు చొ
ప్పడఁ దన్గొల్వఁగఁ గ్రోధనాఖ్యుఁడతిదర్పప్రోద్ధతి న్నిన్నుఁ బి
ల్చెడువాఁ డాయతవిక్రముండు రణసంసిద్ధుండు సిద్ధాగుఁ డొ
క్కడెపో చాలు ద్విషద్బలౌఘముఁ గడంకం గంప మొందింపఁగన్. ౨౧౧

ఉ॥ గైరికవర్ణ మైన నిజగాత్రము సొంపెసయింప లావునన్
నేరిని లెక్కసేయఁడు మహేచ్ఛుఁ డరాతిభయంకరుండు దు
ర్వారుఁడు నిన్నెదుర్కొనఁగ వచ్చెడు తెంపు దలంపనయ్యెడిన్
బేరునఁగాక పోటుననుఁ బొపునఁ దా గవయుండు నాఁ జనున్. ౨౧౨

తే॥ రమణ డెబ్బది శతసహస్రములు గొలువ
బలువయిన యగ్గలిక మెయిఁ బరఁగువాఁడు
లంక నాలంకిగుడియాటవంక మీటఁ
దలఁపుగొన్నాఁడు నీమది దార్చి చూడు. ౨౧౩

క॥ ఇందఱునుఁ గామరూపులె, యిందఱు బలవంతులే మహేచ్ఛులె పేరిం
గ్రిందుకొని దుష్ప్రసహులై, యుందురు గొంద అధిపతివె యనుఱులటంచున్.

శా॥ కంటే యూథపయూథపేంద్రులు పరాక్రాంతిక్రమోల్లాసు లే
వెంటం బో వెనుదీయ రంబునిధిసంవేగంబు మోకాటనే
గెంటంజూతురు పోతరం బెగువ నిస్తీర్ణింపకే యుల్లసం
బంటంబల్కుదు రట్టివారి నెద నొయ్యన్ దాల్పు మేఁ దెల్పఁగన్. ౨౧౪

సీ॥ తామ్రపీతాదికోద్యద్ద్యోతమయము లై వాలవాలము లతివేలములుగ
సూర్యరశ్ములఁ బోలి చొఱఁ బాఱుచున్నవి కాంచువారల కన్నుఁగవలు నిండ
సాచుచు ముడుచుచు సమకూర్చు నట్లనఁ బుడమి యాకాశ మెడ లూన్పవేరు
గా వాఁడె హరుఁడు దాఁ గాఁడె ట్లరిప్రాణ హరుఁడు సూర్లకు వేల కగుచుపీని
దఱిసి ముఱిసి చెట్లు దాల్చి కొండలు పూని, యడరుచున్నవార లంతకాభు
లైన యూథనాథు లలుక లగ్గల కెక్కు, లంక దక్కనీని లావునుదుల. ౨౧౬
శా॥ నీలంపుంగిరులో మొగిళ్లొ తమపున్నిట్రాడులో కాటుక
ల్లోవలం బోసిన పోవ్రులో యనఁగ నై పొల్పారు భల్లాలు భ
ల్లా లల్లే తెగఁజూడ నా నెఱికి నా లావ ర్లనిర్దేశ్యులు
ద్వేలారంభు లసంఖ్యు లాత్తరయు లర్థిం గొల్వ సంరబ్ధుఁడై. ౨౧౭
ఆ॥ విషమపర్వతముల విపినస్థలంబుల, నదుల నిర్ఝరముల ననుచువారి
గొనుచు నిన్నిదిక్కు కొక్క నెక్కనఁ బేర్చు, వాఁడె ధూమ్రుఁ డనెడువాఁ డధీశ!
ఆ॥ ఋక్షవంత మను గిరీంద్రముపై నుండు నర్మదాపగోర్మి నిర్మలాప
రస్వధర్మ మెఱుఁగు గాణించుఁ బర్జన్యుఁ, డగుచు ఋక్షవర్యు లబ్ధములుగ.
శా॥ భీమాక్షుం డతిభీమదర్శనుఁడు నిర్భీకుండు తా నన్నచో
నే మా నీతని మించఁగాంచు ప్రబలుండే తమ్ముఁ డున్నాఁడు ని
ర్ధామం బౌ నిజధాము మెల్లకడలం దోడ్తోడఁ గన్పట్టఁ బ
స్థామస్కంబునఁ గొండనాఁ దగి విపక్షాక్రాంతి వీక్షింపుచున్. ౨౨౦
ఆ॥ అతఁ డీతఁడే మహాయూథయూథప, యూథపుఁడు పరాక్రమోన్నతుండు
జాంబవంతుఁడనఁ బ్రశంస కెక్కె నరాత్య, మర్షణుండు స్వజనహర్షణుండు.
క॥ గురువర్గములెఁడు దైవా, సురసంగ్రామమున నముచి సూదనునకుఁ దా
న రచించె సాయ మద్దా, న రహింగొనె నాతఁ డిడ ఘనము లగు వరముల్.
మ॥ పరువిడి కొండబండ లెగఁబ్రాఁకి మహాభ్రవిశాల లాశిలల్
పరువడి నెత్తినె చెదరు పాదపము ల్వ్యాకలించి తెచ్చి యు
ర్వరుసన మోదనెంతురు వివల్గనము ల్పచరింతు రిమ్మిత్త్రికిన్
వెర వొకఁ డున్న మాదెసకు వ్రేలిడనోపునె యంచు యూథపుల్. ౨౨౩
తే॥ భూతనిభు లాసురాభులు భూరిబలులు, వహ్నితేజు లసంఖ్యు లవార్యు లాత్త
యశులు రోమశు లీతని యచ్ఛభల్ల, భటులు చటులాజిశీలనముద్భటులు పటులు.
తే॥ నిలిచి చూచెడు గూలి యనీక మెనని, మహితసంరంభపోష్ఫాయమానకలన
శుంభదరమర్దనక్రమాదంభుఁ డతఁడె, దంభుఁ డను వానరుఁడు తతారంభవిదిత.
క॥ ఇమ్మేటి సహస్రాక్షుని, నెమ్మి మయి గొలుచుచుండు నేమముగలవాఁ
డిమ్ముల బహుబలయుతుఁడై, యమ్మేలున మేలుబంతి యై వర్తిల్లున్. ౨౨౬

సీ॥ కొండ చక్కటి మెట్టుచుండఁ దా నద్దాని కొంచుఁ రూపొ నాఁగ నొప్పినాఁడు
యోజనాయుతకాయుఁ డొకమెకంబును వీని నెత్తిఁ గోల దను వార్త నెగడినాఁడు
ఎల్లవానరకోటి కితఁ డాదిభూతుఁ డై యటు పితామహసంజ్ఞ నందినాఁడు
ము న్నింద్రు నెదుర నై మొనసి సంగరమున నోడక జయలక్ష్మి నొలసినాఁడు
గాన నక్రమంబు గాదు శక్రపగాక్ర, మక్రముండు కీశమల్లుఁ డనఁగఁ
గలిగె వహ్నివలన గంధర్వకన్యయం, దసురహ్మాతికి సురస హార్థభృతికి. ౨౨౭

క॥ సన్నాదనుఁ డనువాఁ డా, సన్నాహముఁ జూడు మశని సన్నాదములన్
దన్నెలుఁగక మి న్నరయక, పన్నుచునున్నాఁడు మేలి బలములు గొలువన్.

క॥ ఎవ్వని జంబూవనమున, నివ్వటిలు విహారసుఖము నీయన్నకు నీ
వవ్వానరేంద్రుఁ గాంచితె, చివ్వకుఁ గడకొన్నవాఁడు సిరు లొప్పారన్. ౨౨౯

ఉ॥ కిన్నరసేవితంబులు సుకీర్త్యము లౌ గిరు లెన్ని గుత్తకుం
గొన్నమహాబలుండు రణ కోవిదుఁ డీప్లవగాధనాధుఁ డే
మన్నను జంకఁ డాత్మనుతి కగ్గము గాఁడు సహస్ర కోటిసం
ఖ్య న్నెగడొందు వీరు లనయంబు నయంబున గొల్తురితనిన్. ౨౩౦

క॥ క్రథనుఁ డనువాఁడు మనతోఁ, బ్రథనం బొనరింప నెంచి పటురెంచనుని
ర్మథనము లంకకు గూర్చుట, కథనము లేకయ వికాసగతిఁ గనుపట్టున్. ౨౩౧

ఆ॥ హస్తియూధపతుల నదలించుచును గంగ, ననుసరించి వైరమును స్మరించి
తిరుగుచుండు నెపుడు గిరిగుహాశయములఁ, గరులు గిరులుఁ దరులు గదియఁబడఁగ.

ఆ॥ వేయునూఱువేలు వీరులు తనఁ గొల్వ, నాయుశీరబీజ మనెడు కొండ
నుండు దివిని శక్రుఁ డుండున ట్లమ్మెయి, హైమవతి రసమ్ము లాని కడిమి. ౨౩౩

క॥ అమితబలధైర్య మగు బల, మమరబలం బట్టు లెనయ నరదుర్గరుఁ డై
తమకని దర్పంబునఁ దగుఁ, బ్రమాథి యనువాఁడు వాఁడె పరదర్పహరా. ౨౩౪

ఉ॥ గాలి కదల్ప నెల్లెడలఁ గ్రమ్మెడు పెన్మొగి లంచు ధూళిది
క్పాలక! పల్కె దేప్లవగుఁ గన్గొని వాఁడె గవాక్షుఁ డమ్మొగిన్
గ్రాలెడు వాని సైన్యము వికస్వర మై యరుణాభ మై పగున్
ధూళియుఁ జొప్పడెన్ దరలె ధూర్తుఁడు లంకఁ గడంకఁ దీర్పఁగన్. ౨౩౫

శా॥ గోలాంగూలులు కోట్లలెక్కకు మహాఘోరు ల్సితాస్యు ల్బల
ప్రాలంబు ల్గొలువ న్నలు న్బరసి తా భాసిల్లుచున్నాఁడు వా
చాలుం డాడినయంత సేయఁగలుగున్ సన్నద్ధతం గొన్న వాఁ
డోలీలావిజితేంద్ర! నీదు మది సంయోజించు మిటింతయున్. ౨౩౬

సీ॥ కొందమున్మొదల కోర్కులు పండ నేకొండ యఖిలకాలఫలద్రుమాఢ్య మయ్యె
దనవర్ణదీప్తులఁ దనరారు ననియేమొ సూర్యుఁ డేమెట్టునే చుట్టివచ్చు
మృగపక్షు లేగిరి మొగసినయంతనే తద్గుణాలంకృతి దర్శిమ నెఱపు
నెద్దాని ప్రస్థంబు నెడసిపోనెంచఁబో రధిహర్షులు మహర్షు లాత్తయశులు
సర్వకామదంబు సఫలంబు సరసంబు, నైన స్వర్ణశిఖరి నధివసించు
కేసరియ యతండు కేసరిసంజ్ఞుండు, వానరప్రశస్తి వఱలువాఁడు. ౨౩౭

శా॥ సింగారంబున కాటపట్టులు మహాశ్రీ లక్ష్మిసాహస్రముల్
బంగారంపు గిరు ల్తదస్తశిఖరి ప్రాంతస్థము ల్వానితో
నంగాంగిత్వము నొంది నీ వసురులం దధ్యక్షతం గాంచురీ
తిం గైకొ ల్లను కాంచనాద్రి యొకఁడు దీప్తప్రభం బుం డెడున్. ౨౩౮

వ॥ అయ్యుత్తమశిలోచ్చయంబున నుండునారు వారె కపిలులు శ్వేతులు తామ్రాస్యులు మధుపింగళులు తీక్ష్ణదశనులు నఖాయుధులు సింగంబులట్లు చతుర్దంష్ట్రులు వ్యాఘ్రంబులవలె దురాసదులు వైశ్వానరసములు జ్వలితాశీవిషోపములు సుదీర్ఘాంచితలాంగూలులు నుత్తమమాతంగసన్నిభులు మహాపర్వతోన్నతులు మహాజీమూతనిస్వనులు వృత్తపింగళరక్తాక్షులు భీమభీమగతిస్వరులు నైన వానరులు లంకాభిఘాతోత్పాతం బభినయించుచున్నవా రవ్వారి నడుమక్కొం గనుపట్టుచున్నవాఁ డిందఱకు తేఁడు నీదు సూడు దీర్ప్వతలంపున నొండొకదెసం గనఁబోఁడు జయార్థి యై యాదిత్యు నుపాసించుచున్నాఁడు బుద్ధివిద్యాశౌర్యసారస్థైర్యపౌరుషంబులచే శతవలినామధేయంబుచే జగత్త్రితయంబునం బ్రఖ్యాతిం గన్నవాఁడు రాముని చేఁబన్నై ప్రాణంబులకై జాలి మాలి నిన్నె నీబలమ్ము నోలిఁదాన వాలి మడఁగెను నని పన్నిదంబులు వన్నుచున్నవాఁడు వీనికిం దోడులై గజగవయగవాక్షనలనీలు లొక్కొక్కఁడొకఁడు పదికోట్లులు కపివీరులతోఁ బన్నియున్నా రిందఱు సారిష్టు లలఘువిక్రములు వింధ్యపర్వతవాసులు బహుత్వంబుకతనం జక్కఁగా లెక్కింపనేరము నేర మెన్నకు మోమహారాజా యిమ్మహాప్రభావు లీకులగిరినిభకాయు లీధాగుణి నొక్కవ్రేల్మిడి విదారింపం జాలుదు రని యెంచుచున్నారము ని సారణుండు విన్నవించిన. ౨౩౯

క॥ ఆరావణు గాంచుసవిభు, సారబలుం గాంచి పటుల సారిస్థత్వం
బారసి శేషవిశేషము, లారూఢిం బలుకఁదొడరె నాశుకుఁ డంతన్. ౨౪౦

సీ॥ ఆముఁ శేసఁగులో స్తారాపగావటములో హిమశైలసారమహీరుహములో
యని కాంచుచున్నాఁడ నవ్వాగు దుస్సహ బలకామరూపప్రభావయుతులు

కిష్కింధఁబురి నుండ్రు కీశాధినాథుని సచివులు దివ్యప్రసక్తిభవులు
తనుకరు దానవ దైత్యరాక్షసు లన్న నాజి దేవపరాక్రమాభిమాను
లధిప! నవపంచసప్తసహస్రకోటి, శంఖసాస్రములు బృంద శతములు నగు
లెక్క నున్నారు వీరి వా లీల లెన్న, వశముపడ వలవేనోళ్ల వలఁతి కైన. ౨౮౧
చ॥ వివిదిప వాంగ నేప్లవగ వీరకుమారులఁ గాంతు మైందుఁడున్
ద్వివిదుఁడు నాఁబ్రసిద్ధు లతి ధీరులు వారలు దివ్యమూర్తు లా
పృవరులఁ బోలఁగాఁ బరఁగు పట్టుల నొక్కఁడయేని లేఁడు తా
త వనుప మె లెఱింగి సుధఁ దాృవిరి వాపిరి బొల్చి యుద్ధతిన్. ౨౮౨
క॥ వీరును లంకామర్దన, మారూఢి మదిం దలంచి యా లె న్మనుచున్
శ్రీరామభక్తి వెనిచెడు, ధీరత నున్నారు తాగు దితిజాధీశా. ౨౮౩
సీ॥ చూచితే వాతూలసుతు మదకరివోలె నిల్చియున్నాఁ డదె నిర్భయమున
నితని కోపంబున కేఁటిబోఁటిమగండు గండడంగి విలీన గతిఁ దనర్చె
సీతఁ గన్గొనవచ్చి చీకాకుగావించె లంక నాలంకాటలాను నెఱయ
నిన్ను నీతనయుని నెన్నక యెదిరించెఁ బునగాగతుం డయ్యెఁ బూచిగొంచు
కేసరికిశోర మీతండు కేవలుండు, గాఁడు వాయుప్రసాదంబుకతనఁ బుట్ట
రుద్రవీర్యోద్భవుం డన రూఢికెక్కె, నవలహనుమంతుఁ డనఁగఁ బ్రఖ్యాతిఁగాంచె.
తే॥ గోష్పదీకృతసింధుండు కువలయైక, బంధుఁ డటు రామకార్యధురంధరుండు
సతతగతి యట్టు లనివార్యగతిబలుండు, కామరూపుఁ డసాధ్యుఁ డీకపివరుండు.
సీ॥ ఉదయించు భాస్కరు నొడియఁగా నూహించెఁ బుట్టినప్పడె ప్రథ పొడవుపడఁగఁ
ద్రిసహస్రయోజనోన్నతదేశంబు గ్రమియించె నద్దేవు ద్రుంగఁ బోనా దొగఁడుఁ
దవిలి యనాధృవ్యతము తేజు మైనాక నాదయునగిరిమీఁద నొరఁగ బోవ
హనుశిలాతలముల కన్యోన్యసంఘర్షజనితక్షతవ్యాప్తి సంభవించె
నవల సురలెల్ల నితండు హనుమఁ డనుచుఁ, బేరుపెట్టిరి పిలిచిరి ప్రేమఁ బొగడి
రిచ్చమెయి దీవన లొసంగి రెలుకగంటి, నింతపట్టు సదాగమాహీనయుక్త.
క॥ భావము రూపము బలము పృ, భావము నదసీయ మెటుక పథుప సత్కృత్యం
డేవెరవున నేనియు నొకఁ, డీవెరవరి లంకవంక కెగయుచు నుండున్, ౨౮౬
క॥ లంకారిశబ్ద మీని, శ్శంకు పదసహస్రిక స్సంగత మయ్యెన్
బంకజభవవర్ణిత మది, యింక న్నాబోఁటి కగు నె యిట్లని తెలుపన్. ౨౮౭
సీ॥ శ్యామసుందరమూర్తి శౌర్యైకసంశ్రియం బరవిందనిభనయనాంచితుండు
సోము మోము హసించుఁ జొక్కాట మింతింత లనరా దశరథుఁ డత్యతిరథుండు
దా నెల్లయెత్త్వాకతతి కెక్కటి వలంతి యీరేడుజగముల నేలఁగలఁడు
విదితశుృతుఁడు లోకవిశ్రుతపౌరుషుం డచలధర్ముఁడు ధర్మ వరసి కాని

యనఁ గిడఁడు బ్రాహ్మ మట్లఖిలాస్త్రములును
వేదవేదాంగములును దద్వరములును
దాల్చు నొక్కండె యను కీర్తిఁ దనరినాఁడు
రాముఁ డవ్వాఁడె కంటె యిందఱిపతిం దఱి ! ౨౪౯

చ॥ హనుమకుఁ దా ననంతరుఁడ వై తనరారె భుజాధిరూఢతం
గనకమహీధరంబుపయిఁ గ్రాలు వినీలసలీల మబ్దముల్
మొనకొని డాలు జాలుకొన ముంగిట నై తనభార్య సీతఁ దె
చ్చిన పగ నీఁగ నిన్నిటుమఁ జెచ్చెర వచ్చెడువాఁడు రావణా ! ౨౫౦

క॥ దారించు నాకసంబు వి, దారించు ధరాధరప్రతతి సందఱము ని
స్సారించు ధనుర్గుణముల్, సారించుచు విభుఁడు వనుచుశరవిసరమ్ముల్. ౨౫౧

ఉ॥ కీర్తిని మించుఁ గ్రోధమున మేటి పరాక్రమసీమ శక్రునిన్
బా ర్తికొనంగ నోపుఁ దగ వాపురుషోత్తముఁడే యెఱుంగు నే
యెత్తున కోపహాటింపఁడు గుణోన్నతుఁ డుజ్జ్వలరూపుఁ డిప్పుడీ
యెత్తున రిత్తవోఁ దరసి యీవ దలంతువుగాక కర్జముల్. ౨౫౨

మ॥ అయయుద్ధాగమవేత్త రాము బహిరీ ద్వ్యప్రాణ మా భ్రాత దు
ర్జయుఁ డైకాంతికభక్తుఁ డూర్జితుఁడు ప్రజ్ఞావంతుఁ డెందు న్నిరా
మయుఁ డంచద్బలవిక్రముండు మహితామర్షుండు సంరక్షి జే
త యతండే సుమి లక్ష్మణుం డసురదుర్ధర్షుండు దైత్యర్షభా. ౨౫౩

తే॥ అదుగొ దక్షిణపార్శ్వమం దమరియున్న, వాఁడు దక్షిణభుజము భూవల్లభునకు
నీలకుంచితకచుఁడు వి శాలవక్షుఁ, డమలగనకాభుఁ డుచితగా భ్రమాత్ముఁ డధిప.

క॥ జీవితరక్షణముసకును, జేవిడఁడు రామకార్య సిద్ధిక్రమముల్
దేవాఁకపిరహానసము, నావలని దె యనుచు నయ మనయముం దలఁచున్. ౨౫౫

ఆ॥ సన్నపక్షమునను జానొందె రాముని, యాశ్రయమున నాపదత్యయమున
నీవిభీషణుండు నేతఁ తా నయి నయ, కోవిదుండు హితులు గొలుచుచుండ. ౨౫౬

క॥ శ్రీయుతుఁడు రాజరాజు స, మాయుక్తిం దన్నులంక కభిషేకింపన్
గాయము పొంగఁగ నీతో, నాయోధనముంబొనర్ప నడరెడుఁ బెలుచన్. ౨౫౭

సీ॥ సర్వశాఖామృగశైలాధిపతిఁ గంటె చలిగట్టుదొర నవ్వఁజాలినాఁడు
కొండలనడిమి కన్గొండ యీతం డన వావిరి స్థైర్యంబు వడసినాఁడు
స్వాభిజనము జ్ఞానమనము తేజోబుద్ధు లపరాజితునిఁ జేయ నమరినాఁడు
కృతకృత్యుఁ డై దుర్గ కిష్కింధ దుర్గస్థఁ బ్రణిధులతో నేలఁ బరఁగినాఁడు

వాలి చన హైమపుష్కర మాల దేవ
కాంత లక్ష్మీప్రతిష్ఠ స్వకంఠలగ్న
యగుచుఁ దారతోడిద యాయి యఖిలసుఖము
లిఁడగ జేజేలఁ జేని తీరెనసినాఁడు. ౨౩౮

తే॥ ఇంతయును రాముని ప్రసాదమే యటంచు
సంతసము జాల్కొనంగఁ బ్రసక్తి నెఱయ
నఖిలవాహినులం గూర్చి యాసఁ బేర్చి
వచ్చినాఁ డిదె నీయిల్లు సొచ్చినాఁడు. ౨౩౯

వ॥ శతశతసహస్రంబులు కోటి యనియును శతకోటిసహస్రంబులు శంఖం బనియును శతశంఖసహస్రంబులు మహాశంఖం బనియు శతమహాశంఖసహస్రంబులు బృందం బనియును శతబృందసహస్రంబులు మహాబృందం బనియును శతమహాబృందసహస్రంబులు పద్మం బనియును శతపద్మసహస్రంబులు మహాపద్మం బనియును మహాపద్మసహస్రంబులు ఖర్వం బనియును శతఖర్వసహస్రంబులు మహాఖర్వం బనియును శతమహాఖర్వసహస్రంబులు సముద్రం బనియును శతసముద్రసహస్రంబులు ఓఘం బనియును శతౌఘసహస్రంబులు మహౌఘం బనియును మనీషులు వచింతురు మహాబలపరాక్రముండు వానరేంద్రుండు నగు సుగ్రీవుండు నిన్నెదిరి యుద్ధం బొనరింపఁ గోటిసహస్రంబును శంఖశతంబును మహాశంఖసహస్రంబును బృందశతంబును మహాబృందసహస్రంబును పద్మశతంబునుమహాపద్మసహస్రంబును ఖర్వశతంబును సముద్రశతంబు నోఘశతంబును మహౌఘకోటియు ననందనరాదు బలార్ణవంబుతోఁ బరివృతుం డై యరుదెంచినవాఁడు. ౨౪౦

తే॥ ఓమహారాజ! క్రూరగ్రహోపమ యయి
యిటు లుపస్థిత యైన వాహినిఁ గుఱించి
తగిన జతనం బొనర్పుము తమజయ మని
కాక పరపరాజయ మెట్లు గాఁ బొసఁగునో. ౨౪౧

ఆ॥ అనుచు శుకుఁడు దెల్ప హరియూథపోత్సాహ
మెంచి రాముఁ జేరి యేసకమెసఁగుఁ
దమ్ముఁ గాంచి విభు భుజమ్ము లక్ష్మణుఁ బరి
కించి కీశనాథు కృతిఁ దలంచి. ౨౪౨

క॥ ఆవిగ్నహృదయుఁ డై యటు, లావిద్ధక్రోధుఁడును మహావేగుఁడు నై
దేవారి వారిఁ గనుఁగొని, యావలఁ బరుషోక్తుఁ లాడె నదిరెనమాజా. ౨౪౩

ఆ॥ ఉన్నయంత లనుచు నొదిఁగి నతాస్యు లై, యున్నవారిఁ గొలిచి మన్నవారి
నెదిరి కారు లఱచె నె ట్లనవలవదు, మొఱకు విధికిఁ గన్ను మూఁత గలదు.

—♦ రావణుఁడు శుకసారణులఁ దూలనాడుట. —♦

సీ॥ చన వుపజీవు లౌ సచివుల కేనాఁడుఁ బతిమ్రోల విప్రియభాషణములు
నిగ్రహానుగ్రహ నిరతుండు విభుఁ డంచు నెఱుక లేదో యిప్పు డెడసినారొ
ప్రతికూలు రగు రిపు లైన రాఁగ నేటికి యప్రస్తవ స్తవ వ్యాహరణము
లాచార్యవృద్ధుల నటు లుపాసించితి రదనున నది యసమర్థ మయ్యె
మలసి కారో కడఁగి మఱచినారో కాని, సిద్ధసార మాను జీవ్య మిట్లు
తెఱఁగువాసెఁ దెలివి దెల్లవాఱిన శాస్త్ర, భారవాహకులకుఁ బ్రతిభ గలదె.

తే॥ ఇట్టిమూర్ఖుల సచివుల నేర్చి కూర్చి, యకట నేఁ దాల్చుచుంటి నీ యాధిపత్య
మడరుపరుసమ్ములకునోడ రాఁడఁదొడరి,మిత్రిమీస్మృతినొకనాఁడు మెలఁగవొల్లో.

క॥ శాసించు నాదు జిహ్వా వి, భాసించు శుభాశుభముల పట్టున విభు వై
యాసించువారిఁ గాంచు ను, పాసించుచునుండ్రు దాని నహితులు హితులున్.

తే॥ దవదహనమూర్ఛితములు పాదపము లెట్లొ,నిలుచుననవచ్చుఁగానియే నెఱిన యేని
రాజకోపవిమృష్టాప రాధు లెందు, నిలువఁజాలర చూ యిది నిశ్చితంబు. ౨౧౮

క॥ ఈపాపులఁ దెగటార్పఁ బ్ర, తీపుల పక్షంబు వొగడు తెఱఁ గెంచినఁ బూ
ర్వోపకృతిస్మృతి నా దగు, కోపము మృదుత న్వహింపఁ గొనకొనదేనిన్. ౨౧౯

శా॥ ఈనాసన్నిధిఁ బాసి పొం డిపుడు మిమ్మేఁ జంప యత్నింప ము
న్నానందింపఁగఁ గూర్చినట్టి కృతు లొయ్యం జేరి వారించుటన్
నోనాడ స్థాను త్రైతి రీరలు కృతఘ్నుల్ స్నేహశూన్యుల్ సువ్వకా
స్థానభ్రష్టత దానదండ మనుచుం దర్జించి భర్జించినన్. ౨౨౦

తే॥ సిగ్గువడి వార లిరువురు చేటు మూఁడఁ, బెల్ల దిచ్చుట నునికి యెా చెల్ల యనుచు
సనుచు జయఘోషణాల నభినందనమ్ముఁ, గూర్చి తలఁగిరి కిసలయకోమలాంగి!

ఉ॥ ఆదట నాదశాననుఁ డహంకరణోచితుఁ డంతికస్థలిన్
సాదరుఁ డై మహోదరునిఁ జయ్యనఁ జేరి సురారికార్యసం
పాదనదక్షులన్ ధృతవిపక్షులఁ జారుల సద్విచారులన్
నీదగునేర్మిఁ గూర్చుము మనీషితము ల్సమకూర్పు మిత్రతన్. ౨౨౨

ఆ॥ అనిన నంతలోనె యన్నరహంత దా, నంతరించెఁ దగినచరుల వారు
విభుని శాసనమున వే వచ్చి విజయా, శంస లట్లు నసులు జరిపి రగజ! ౨౨౩

క॥ ఆయతశౌర్యుల నిజసే, వాయత్తుల విగతభయుల నాత్తనయులఁ బ్ర
త్యాయితులఁ బ్రణిధులం గని, యాయసురాధిపతి యిట్టు లనె నలినాక్షీ!

—♦ రామసైన్యముల రంధ్రము లెఱుంగ వచ్చిన దూతల నడుచుట ♦—

సీ॥ పెరవారి సైన్యంబు బెరయుచు వింతవేసము లూని మీర లీక్షించితిరి
రాముని వ్యవసాయ మేమాడ్కి దో కూడివచ్చినవార లేవలనివారొ
యాభ్యంతరులు మంత్రు లం డెవ్వ రెవ్వరో పిరికొని యెడయూని పేర్లు దలయు
వార లెవ్వారలో వారిలోపల నెంత కెంతెఱుం జాలు సమీపింపములు
గలవా నిదురవోవు గతి మేలుకొలుపన, నొండుపనులవంక నొడయుడు పెట్టు
నెగడువాడో యెల్ల నిపుణంబుగ గ్రహించి, రండు నాకుం దెల్ప రహి వలిన్న.
క॥ పండితు లగు దొరలు సమ, గ్రుండగు చారుకతన న్విరోధి నరసి యు
ద్దండు లయి వానిం గెడపుదు, రొండొకం డాచూడ్కి కన్న నుత్తమ మున్నే.
ఆ॥ అనిన వార లట్టు లాగావుత మటంచు, నరుగ నెసంగ రాక్షసాధనాథు
నరవిం జుట్టి మొ్రక్కి శార్దూలు మున్నిడు, కొని చలించి గవ్వడు కుపలుచూక్కి!
ఉ॥ మేలి సువేలశైలము సమీపమున న్సవాలకటక్నములను ని
ర్వేలవిభుండు భానుజవిభీషణభాషణతత్పరుండును ని
ద్యాలసితుండు లోకవిభుం డా రఘురాముని జూచి రల్లవా
రోలము గూర్చు వేసముల నొప్పి ధరాధరకన్యకామణీ! ౧౭౦
ఆ॥ మొనసి కాంచి రాచమూనముద్రము నల్లె, యుబ్బికాంచి కాంచె నారి ఉసి
నని చలించి రడరు మొనకొన పెల్లబు, లైరి తెఱవు గాన నగరి గౌరి! ౧౭౧
ఆ॥ కరుగు గట్టి ధర్మకలన తేర్పడం బెట్టి, నలువ పోలివోయం జెలువు డాయు
నైన పుణ్యమూర్తి వ్యాఖ్యాతసత్కీర్తి, యగు విభీషణుండు ప్రహసనములును. ౧౭౨
క॥ ఆపగిది వారి నరసి ని, రూపణ మొనరించి గదిసి రూపము గంటే
బాపుం డనుచు శార్దూలునిం, బాపుం డనుచుం బ్లవగయూథపతులకుం దెలిపెన్.
క॥ నిర్దయు లై వా రాతని, మర్దించిరి పట్టి కట్టి మలంగక వాం డ
య్యర్దన మెంచుచుం గూయిడె, న్వర్దయి తాగ్రవ్యండు రామచంద్రుండు వినంగాన్
ఆ॥ వీడుం డనుచు రామవిభుం డానృశంస్యంబు, వెలయ నానసేయ విశ్వసించి
వానితోడం దోడివారం దో డయ్యంగ, మోది విడిచిపుచ్చి మునయుటయును.
ఉ॥ ఊర్పులు పుచ్చుచుం దరలి యోపని యోపిక లంక సేరి ని
ర్దర్పులు నష్టచిత్తులు విదారితగాత్రులు నై వడంకుచున్
స్వర్పతివైరి కొల్వున దెసం బడి నిత్యచరుల్ నిశాచరుల్
మార్పడియుండం దద్దశయె మానుగ మార్తుజ వార్తం దెల్పంగన్. ౧౭౬
ఆ॥ కడంగి వారు ఘనుండు క్రాంతసువేలాద్రి, ననుం డటంచు భూమివరుని ధాటి
పాటిసేసి పలుకం బలుమొగమ్ములవాండు, దలం కొకింత యెడందం దారసిలంగ.

—◆ చారులు రావణుఁ జేరి తమచేటుపాటులు తెలుపుట ◆—

శా॥ శార్దూలుం గని పల్కె మాఱుపడె నీచందంబుతో నంద మా
దోర్దర్పం బెటఁ బోయె రుష్టు లగు నాదుష్టు ల్విజృంభించిరే
నిర్దాక్షిణ్యులు వారిచేతఁ బడితే నేమంబు లూపాడ న
ట్లుద్దంపందొరకొన్న వారి మన మియ్యర్థంబు మన్నించెనే. ౨౮౬

క॥ అని యొడయఁడు డడుగ మందం, బనఁదగు కంఠస్వరమున ననదయ కా ని
ట్లనె భయవిహ్వలుఁ డగుచుఁ, దనరఁగ నగు దారిమెయి విదారితదుఃఖా.

తే॥ లేఁడు శార్దూలుఁ డిప్పుడు రాఁడు నీకుఁ, గాఁడు రాక్షసశార్దూల కంటగించి
చూడకుము విను మచ్చటి చొప్పు వినుచు, వాఁడ నీవాఁడ నైన యావలను వెలయ.

సీ॥ కారయ్య! లోకైక వీర! కీశులు చారచారణశక్యులు సమధిబలులు
విక్రాంతు లైనారు విభు నాచికో లట్లు వేయిమడుంగులు వెరవు సూప
భాషింపఁగా రాదు పలికినపలుకునఁ గోటియర్థంబులు గుప్పిమ్మరింతు
ప్రశ్నోత్తరంబులు పాటిల్ల వచ్చట దాడి డొంక యొకొండు దారసిలదు
చొచ్చినంతటనే శోధఁ జొచ్చినారు, చాగులో యంచు నాడు లెడఁ జల్లినారు
త్రిప్పలం బెట్టుచును చుట్టుఁ ద్రిప్పినారు, కొట్టినా రిట్టు వెడలంగఁ గొట్టినారు.

తే॥ గ్రక్కి చూడక మున్నె యీతోడుసులెల్లు, పడిరో యనుకొంటినవ్వార్తపడయరాని
దన్యొనిచ్చోట మొనయంగ నైనపిదపఁ, గంటి మాగంటు లిప్పను గన్నయవియ.

మ॥ సమయం బెంచి వచించె వారలకు నీ సైదోడు వీణోడు లు దో
న మహాత్మ్యాకృతు లూని పొంచి యటుపై సాగించి రాజానుము
ష్టిమిలత్పాణిశిలాభిఘాతముల ని ష్పీడించి రుద్ధాంతదం
తముఖుల్ గ్రుచ్చిరి గోళ్ల నెత్తురులు నిండ లట్టి నో త్తొట్టిపోన్. ౨౯౧

తే॥ అయ్యమస్వామి తా హాగు లందుఁ గలుగు, వీధివీధులఁ ద్రిప్పుచు వేఁచునపుడు
సక్కఁ గన్నవా రెల్ల ననుచు వేఁట, కాండ్రై రన్న యర్థంబు గానవయ్యొ

తే॥ వివశుఁ జలితేంద్రియు విశాగ విస్ఫురక్త, సిక్తసకలాంగు నను రాముఁ జేర్చినంత
నంతకాలంబునం దెట్లొ యావహిల్లె, రామ రక్షేతిపదము నా మోమునందు.

క॥ అట యాచ్యమానబంధుల్, ఘటితాంజలిబంధు నన్నుఁ గాంచి కృపాలం
పటుఁడు రఘూద్వహుఁ డితనిఁ, దటుకున విడనాడుఁ డనుచుఁ దద్దయుఁబలికెన్.

ఆ॥ జీవదాత కెఱఁగి చెదరిన యసువులఁ, జేర్చుకొనుచు బ్రిదుకు జీవుఁడయాని
యొంటఁ జనినవార లొండొరుడఁ గవియంగ, వచ్చినాఁడఁ గొలువు సొచ్చినాఁడ.

క॥ శైలములు శిలలు దరువులు, జేలాప్లున వైచి కపులు సేతువు గట్టం
గా లావరి యైయున్నాఁ, డా లక్ష్మణుభ్రాత యాయు ధాంచితుఁ డగుచున్. ౨౯౬

మ॥ గరుడవ్యూహము పన్ని పన్నిదములుద్ఘాటించుచు న్సర్వశో
హారిముఖ్యాధ్య మనీక మొప్ప జనమాన్యుం డైన తేజంబునన్
బుర మంతఃపుర మంబరంబు నొకటం బూరింపనున్నాఁడు దు
ర్ధరుఁ డా రాముఁడు రిత్తవోఁడు తగునర్థం బర్థి నూహింపుమా. ౨౯౮

క॥ అరికట్టు నేఁడొ రేపో, యరి కట్టు లసాధ్యుఁ డనఁగ నగుఁ గదిసిన నీ
వెరవుమెయిం బొనరింపుము, తరుణీమణి నొసఁగుటో ప్రధనమున గగుటో.

క॥ అని నొడివెడు శార్దూలునిఁ, గని రక్షోవిభుఁడు భావిగతి నెంచి నయం
బొనరఁగ నిట్లని పలికెను, దనధార్ష్ట్యం బెడలనీక దళితాసికా! ౨౯౯

తే॥ దేవగంధర్వదానవు లిట్టు లగుచు, నన్ను నలికింపవచ్చిన నయముఁ బాసి
యేను శర ణందునే సీత నిచ్చి మనఁద, లంతునే యాటులేని నాలాను సెడదె.

తే॥ సర్వలోకభయం బొంటఁ దారసిల్లుఁ, గాక యుష్మగశాబకాలోక నిచ్చు
మాట కల్ల త్రియామాట! మఱసి యువ్వ, నాటనాల నొల్లఁ గాంచితి వట్టులగుట.

క॥ అం దెట్టివార లుందురొ, ముం దలిగెడువార లెవరొ ముఖ్యు లెవరొ బల్
క్రిందున కలుక కడరువా, రెందఱొ దుస్సాధు లెవరొ పొలిఁగింపు మొగిన్.

తే॥ ఎవని కెవ్వారు పుత్రులో యెవని కెవరు
పౌత్రులో మిత్రులో బంధు భావయుతులో
తత్త్వ మరసిన యంతలుఁ దద్దయు వివ
రింపు మద్దాన నసమాన రీతిఁ గాంతు. ౩౦౩

క॥ విజిగీషుఁ డైన యొడయఁడు, నిజబల నొదిరిబల మెంచి నిర్ణయము నొదవన్
గజిబిజిపడక జయశ్రీ, గజగమనం గొని సుఖించుఁ గలనున బలిమిన్. ౩౦౪

—♦ రావణునకు శార్దూలుఁడు కపిసైన్యము జననాథు లెఱిఁగించుట. ♦—

క॥ అని యతఁ డాడిన విని వాఁ, డినకులకేసరికి శిరం బిడలించెడు మా
తని మోడి యని బలార్ణవ, మనుపమ మొఱిఁగింపఁ దొడఁగె నాస్థానమునన్. ౩౦౫

సీ॥ సంగరంబున సుదుర్జయుఁ డెకదా రాజు ఋక్షరజస్సూతి యినభవుండు
వానిఁ బోలినవాఁడె వనజోద్భవోద్భవుం డా జాంబవంతుఁ డత్యలఘుబలుఁడు
గద్దదు సతి వీనిఁ గనియె సీతని యన్న ధూమ్రుఁ డన్వాడు: పిధూంతరిపుఁడు
లంకారిఁ గన్నాడు లావరి కేసరి పే రెట్టు లట్టులే పేర్చి పెనఁగు
శ్రీనుతుఁడు ధర్మసుతుఁడు సుషేణుఁ డనఁగఁ
బరఁగు దధిముఖుం డాత్తపాకరతనుజుఁడు
సుముఖదుర్ముఖ వేగదర్శిముఖులైన
వారిఁ గన్నది మిత్తి యవ్వారి జనని. ౩౦౬

తే॥ అగ్నిచూలియ చూ నీలుఁ డతనిఁ జెప్ప, నేల సేనాధిపత్యాప్తిఁ గాంచినాఁడు
హనుమ నెఱుఁగుదుగా దె వాఁ డనిలజనితుఁ, డెల్లఁ గాల్పంగఁజాలుదు రిరువు రెనసి.

తే॥ అంగదుఁడు పిన్నవాఁడు బలాధికుఁడు సు, రేంద్రు మనుమఁడు దుర్ధర్షుఁ డెఱిఁగినాఁడ
వతనితండ్రిని వాలి నయ్యశ్వినుతులు, మైందుఁడును ద్వివిదుండును మానధనులు.

వ॥ గజగవయగవాక్షగంధమాదనశరభు లెవ్వరును గాలునివలనం బొడమినవా రవ్వా
రలు కాలాంతకోపములు కోప మూనిరేని ముజ్జగంబులు మడియింప నోపుదురు
యుద్ధకాంక్షులు శూరులు శ్రీమంతులు దేవపుత్రులైన వానరోత్తములు
లెక్కకుం బదికోటులు దక్కినవారి నిక్కువం బిక్కాలంబునం జక్క వివరింపనేర
నేర నెన్నంబోకుము. ౩౦౯

సీ॥ తనుమరల్పని చూడ్కి గముచు సింగాగంబు దనమేనిదే యనఁ దనరినాఁడు
శేఁద్రొబాయ మియ్యది లెంక లే యొకనాఁడు దరలునే యను నుతిఁ దవిలినాఁడు
భూనాథు వేలిమి పున్నెం బొసంగిన పాయసం బన మనఁ బరఁగినాఁడు
విల్లమ్ము దాల్చుటే వెరవుగా జయలక్ష్మి తనపాలిదై కొల్వ మొనసినాఁడు
చొచ్చె నటవి విరాధుని వ్రచ్చెఁ గడఁగి మనఖరుఁ ద్రిశిరు దూషణు మడఁచె నాక
బంధు బంధురతను నాకబంధుఁ జేసె, రామనిభుఁ డున్నవాఁడె ధరాతలమున.

ఆ॥ కాకపక్షధరుఁడుగాఁ గాదె గాధిజు, జన్నమున సుబాహు మన్నెనర్చెఁ
దబిసి తెఱఁగనంగఁ దాటక నేర్చె మా, గీను మార్చె నేమిరీతిఁ గనెనొ. ౩౧౧

క॥ సీకతన వాఁడు మడిసె న, నేకక్షత్రులన్ని యట్టు లెగిచి జనస్థా
నాకరనిరాకరణ మది, నీకై వచ్చినది గాదె నిరృతిగణేశా! ౩౧౨

ఆ॥ వాలిఁగూల్చి వాని వరుసవాని మరల్చి, కొని ప్లవంగవీరకోటు లెల్లఁ
గొలువ లంక ముట్టి కొల్లలు సేయంగ, వచ్చినాఁడు కృతకిఁ జొచ్చినాఁడు. ౩౧౩

మ॥ అనుఁగుందో డఁట యంతకాంతకుఁడు వాఁ డాయన్నకుం జోడు ధ
ర్మనిగూఢుండు మదేభ ముట్టులఱను స్మరించు నెవ్వాఁడు బా
ణనివేశమ్మున నిల్చి యుగ్రుఁడును బాణమ్ములన్ మారిం దాల్చు కా
మనకుం జాలున పోలునే యనఁ యశా న్నాగ్గ్రసించి మాటాడుటల్. ౩౧౪

క॥ రవిసుతులఁట జ్యోతిర్ముఖుఁ, డపిగళతేజుండు శ్వేతుఁ డను నతఁడును న
య్యపివిదితుని సోమకూటుసిఁ, బ్రవరుని వరుణాత్మజునిఁగఁ బలికిరి దేవా! ౩౧౫

ఆ॥ నలుఁడు విశ్వకర్మనందనుఁ డాప్లవ, గోత్తముండు సేతు వొనరఁ గూర్చె
నతనికడిమిఁ గడవ రన్యులు వసుపుత్రుఁ, డలసుదుర్ధరాఖ్యుఁ డలఘుబలుఁడు.

క॥ రక్కసులలో వరిష్ఠుం, డుక్కుటమున నీ మతమ్ముఁ డొప్పవశమునం
జిక్కెను సిర తక్కెను దన, కక్కటిమున ననుచు నీనయవ్యపగతిచేఁ. ౩౧౬

తే॥ మంత్రబలం గూర్చుకొని శత్రు మలసినాఁడు
ని న్నెదిర్చి పెనంగఁగా నేర్చినాఁడు
ప్రాణమానము లనునవి రాముని వని
పలుకుచున్నాఁడు విధి గొన్న బాట యెదియొ. ౩౧౮

క॥ ఉన్నయది తెలిపినాఁడ స, మున్నత మగు నీదు సత్త్వ మొలయించెదు నా
తెన్నునఁ గూర్పుము కర్జం, బిన్నిటికే మమ్ము బోంట్ల యేలుక లధీశా! ౩౧౯

ఉ॥ అమ్మెయి వాఁడు దెల్పఁ జరు లందఱు నట్ల యనంగ రావణుం
డి మ్మొడఁబాసి చిత్తగతి యేర్తెఱ నూవఁ జలించి లోని గా
నమ్మలికంబు నాచికొన నూర్పులు వుచ్చుక వెళ్ళనోవు నా
యెమ్మె నమాత్యులం బిలిచి యిట్టు లనెం గనుకట్టు చొప్పడన్. ౩౨౦

ఆ॥ మంత్రికాల మిది సుమాళమ్ముమై నిల్వ, గాదు పాదుకొనె నరాతిసేన
గాన మీరు తగినకలనల మెలఁగంగ, వలయుఁ దెలుపవలయు వలను లరసి.

క॥ అని సమనంతరకృత్యము, లను వారలతోడఁ దగిన లాగునఁ జింతిం
చి నెఱయఁగఁజేయుఁ డనుచున్, దనయంతర్గృహము సేరి తని నెసు మదితోన్.

క॥ విద్యుజ్జిహ్వాం బ్రిబలు స, ముద్ద్యోతితు మాయలాని నొంటిఁ బిలిచి మా
యద్యోతనుఁ డిది విను మని, సద్యస్సంపన్నయుక్తి సరణిం బలికెన్. ౩౨౪

ఉ॥ సీతను మోసపుచ్చవలె శీఘ్రగతిం జని రమ్ము మాయికం
బై తగు రాము శీర్షము శరాసన మస్త్రము మున్ను గన్న తీ
రే తనరార నయ్యువతి యెన్నియు నొం డని యెన్నకుండఁగా
సీతర మంచుఁ దెల్పితి వినీతతమైఁ గొని తెమ్ము నావుడున్. ౩౨౮

క॥ అది యెంత లనుచు నాతం,డదరిపడుచుఁ బలుక నొడయఁ డతిరమణీయం
బదె యనఁగఁ దనరు మణిమయ, ముదంచితము హార మప్పు డుపహార మిడెన్.

ఆ॥ అతఁడు జతనమెయిన యరిగిన దనుజేంద్రుఁ, డాయశోకవనిక కట్లు చనియె
సీతఁ గాంచు వేడ్క శిర మెక్కి నటియింప, దుష్టభావ మొంటఁ నోసువడఁగ.

సీ॥ తల వంచుకొని శోక దార్ఢ్యంబున నశోక వనికి దూఱుఘటించు వలను దాని
రామరామాయంచు రహిఁ బెంచు తలఁపుల జీవనాడికిఁ జేవఁ జేర్చు దానిఁ
బెఱగాము మొగిలుచాల్పిఱుదీక గిఱికొనఁ గను మాయు శశిరేఖఁ గవియు దాని
బలుగాలి యొండెడఁ బడవైవఁ దల్లి మే దిని హత్తుకొను తీఁగె తెఱవు దానిఁ
దా నిదానించియును దుష్ట మానసుండు, గడుసు రాకాసిఱేఁడు పి కాస మొప్ప,
మంచి యెఱిఁగించు చందాన మలసి యిట్లు, పలికె రఘునాథు కలికి తోఁ బాపమాత్రి.

—♦ రావణుఁడు సీతకడ మాయను బన్నుట. ♦—

శా॥ చాయం బల్కుచు భద్రమూర్తి వని నీ సఖ్యంబు పాటించినన్
జేయూ కమ్మెయిఁ దూలనాడితివి నన్ సీరాముఁడే భర్త నా
కేయోగంబును బోల దంచుఁ జల మెంతేఁ బూని నిర్భాగ్యవై
యాయాట ల్వనె నాఖరారి యిపు డా యాగ్యం గూలె జన్యంబునన్. 329

తే॥ ఉట్టి చేర్లన్నియుం జెగె నుదిలపడుచుఁ, దొంటిదర్పంపుటుయ్యెలఁ దోఁగఁగలవా
వ్యసనపర వయి నీకు నీవ యుఁక నాకు, భాగ్య వగుమయా ప్రార్థించు పనియులేదు.

ఆ॥ మూఁడుగాల నిన్ను మొనసిన యామతి, నడచి యిప్పు డైన నంతిపురికి
నీవె యీశ్వరివిగ నెగడుము కడమ వా, రెల్ల నీదుకొలువు నెనసి మనఁగ. 330

తే॥ పున్నె మించుక సేసితి పోయె నదియు, మొదలి జడభావమే యిప్డు ముదలకొనియె
నింకఁ బండితమానిత్వ మేల యేలఁ, జాలుదు జగమ్ము లనుకొన్నఁ జక్కవడునె.

క॥ ఘోరము వృత్రవధం బటు, సీరమణుని వధవిధంబు నెఱయ విను మకూ
పారము పాగము సేరెను, నేరని యాగ్రోఁగిపిండు నెలకొని తలుమన్. 332

తే॥ నన్నుఁ బొలియింప నోచినాఁడన్నుమిన్న, దాశరథి దాశరథిదాంటఁదడవుకొనుచు
నేము పుట్టనిబిడ్డల కిట్టు లనుచుఁ, బేస్లపెట్టుడువార మన్నిగు వరయుఁడు. 333

ఆ॥ దండువిడిసినా రుదధి యుత్తర పుఁదీర, మందు మందు లగుచు ముందు వెనుక
చూడ కటమటించి చొక్కి యన్నెలఫున, నిద్రసేసినారు నీరజాక్షి!. 334

క॥ తెఱి గని యతిముఱిఁ జరు ల, క్కఱఁ జెల్వఁ బ్రహస్తుఁ డరసి కని బలములతో
నంకమి యరిబలముఁ దనదగు, నెఱిఁ దగటార్చె న్మదాజ్ఞ నెలకొని నెగడన్.

వ॥ రామలక్ష్మణసుగ్రీవవిభీషణు లున్న యన్నెలనెల్లఁ బల్లటిల్ల నెట్టనం గదిసి దిట్ట లగు పౌలదిండివీరులు సూరెలం బొదివి పట్టసంబులు పరిఘంబులు చక్రంబులు మహాచక్రంబులు చంద్రహాసంబులు మహాయసదండంబులు శూలంబులు బాణజాలంబులు భాస్వరంబు లగు కూటముద్గరంబులు యష్టులు తోమరంబులు శక్తులు ముసలంబులు నొక్కమొత్తున నమ్మహాత్ముల పై నెత్తి మొత్తి వైచియు విసరియు మొత్తంబులు గ్రుచ్చియుపుచ్చియు విదలించియుఁ గదలించియు సైన్యంబు సైన్యం బొనరించి రది యట్లుండె 336

తే॥ అందు సుఖసుప్తుఁ డగు రాము నందఁగాంచి
యాప్రమాథి ప్రహస్తుఁ డా య్యనఁ దలంచి
మించిన మహాసిఁ బూన్చి ఛేదించె శిరము
తనదు శిక్షాప్రసక్తి తద్గ్రయుఁ బొసంగ. 337

చ॥ నెఱసిన యవ్విభీషణుని నెట్టనఁ గట్టిరి దిగ్భ్రమోచితుం
దఱిమిరి లక్ష్మణుం గపికదంబము తోడుగ దిక్కులంట ను

క్కాఱఁ బ్లవగాధిపుం బ్రథితు లైన సుయోధులఁ దీర్చి యుద్ధతిన్
నెఱకు లెడల్చి చీల్చి యలినీలకచా! వికలత్వ మేర్పడన్. ౩౩౮

సీ॥ సుగ్రీవుఁ డందు భగ్నగ్రీవుఁ డయ్యె నిర్ఘాతుఁ డై నడలె నల్ల హనుమఁ డపరి
పట్టసంబులఁ దెగి పడె జాంబవంతుండు నలుకఁ గూలెను బ్రమాని నయము గోప
నడిమికి రెండుగా నలువు రై రిరువురు మైందద్వివిదులు దుర్మానఘనులు
పనసతో నల్పెల్చెఁ బనసుని మేన దరీముఖుం డొరఁగె దరీముఖమునఁ
గుముదుఁ డై వ్రాలెఁ గుముదుండు గూలె యంగ
దుండు దుండగి మథితాంగదుండు గాఁగ
నస్రము ల్పొడలఁగ ధర నత్తమిల్లె
నెందుఁ జేరనివార లిఁ కేమి లెక్క. ౩౩౯

మ॥ మదనాగంబులు ద్రొక్కఁ గొందఱు మహామాత్రంబు లచ్ఛ్వాసము
లొప్పదువ న్వాతహతిం దొలంగి చను నంభోదంబు లై కొందఱున్
దుది సింగంబుల దాడికిం దెరలి నిర్ఘాతం బు లౌ హస్తు ల
గ్లైదియుం దోఁపక గొందఱు న్మడఁగి రోయేణాక్షి! యుచ్చావరుల్. ౩౪౦

క॥ మున్నిటఁ బడిరి కొందఱు, మి న్నేమో గతి యటంచు మిడుకుచుఁ దూరి తే
కన్నెఱ వ్రాలిరి కొందఱు, గొన్నా రెగఁబ్రాకి చెట్లకుం దమున్నట్టిన్. ౩౪౧

ఆ॥ చంపి రటవి యటవి సంద్రమ్ము తీరమ్ము, లందు గిరులయందు నడవులందు
రక్కసులు గడంగి రారాపు సేయుచు, నెదురుపడినవారి నెడయనీక. ౩౪౨

క॥ బిసరుహదృశ! నీపతి యిటు, నసైన్యుఁ డై మడిసె నింక ప్రాణాగ్రిము కీ
కసయుతము రజోధ్వ స్తము, వెసఁదెచ్చిరితచ్ఛిరంబు వేయేమిటికిన్. ౩౪౩

తే॥ పరమదుర్ధర్షుఁ డమ్మాయుఁ బడఁతి వినఁగఁ, బలుకుచు నె యొక్క రక్కసిఁ జక్కఁగాంచి
కించిదుల్లసితం బొప్పఁ గృతిఁ దలంచు, రీతి దళుకొ త్త నుత్తాలుఁ డాతఁ డపుడు.

క॥ విద్యుజ్జిహ్వునిఁ బిలువు మ, హాహాద్యుతుఁ డవ్వాఁడు దెచ్చె నొసఁగ నదృగమున్
దద్యోగిశరముఁ జాపము, నాద్యంతము లరసి తెలుప నౌ నల నోలయున్. ౩౪౪

తే॥ అని పలుకునంతలోనె విన్యాస మొప్ప, నాశరశరాసనము లుత్తమాంగమును బి
రానఁ గొనివచ్చి ప్రణతులు రాణఁదనరఁ, గూర్చి నిలఁబడె నసుర్యాళి కుచ్చితమున

తే॥ వచ్చినం గని యప్పడవాలు మెచ్చి, తెచ్చి తేకదగుర్చిచ్చి యాధీరు శిరము
పచ్చినెత్తురుతో నట్లు పరఁగఁ జెలువు, నచ్చెలువుఁ గాంచుఁగాప్రుల నుబల గృపణా.

క॥ ఆయమ యెదుటం బెట్టుము, మాయనితమకమున నట్లు పడు యువతి నిజ
ప్రియ స్తము మోమరయుట, నాయమ కద యమని కేతనం బతఁ డనయున్.

ఆ॥ అనిన వాఁడు వల్లె యని బాలహరిణాక్షి, ముందు దృష్టిపథము నోలగించి
కాలి శిర్ష మైంద్రజాల మయ్యెడఁ దార్చి, యోల మొనసె నమరజాలవినుత.

క॥ అందుకొని శరశరాసము, లం దార్చెం దాను మొక్కలంబులు విఖ్యా
తిం దనరినయవి యనుచు న, మందేచ్ఛుఁడు వాఁడు లోకమాన్యచరిత్రా !
క॥ కను మిదె నీమగని శిరం, బనితర మిదె ధనువు జ్యాసమాయుతము మదిం
గొనుము ప్రహస్తుఁడు నిశ న, మ్మనుజునిఁ దెగటార్చి తెచ్చెమానిని! కడఁకన్.
క॥ విద్యుజ్జిహ్వునిచే నా, ప్రద్యోతనుఁ డిచటు సేర్పఁ బనిచెను నీయా
యుద్యోగము సెడె నంతయు, సద్యోలాభంబు వడయఁ జర్చింపు మెదన్. ౩౫౨
తే॥ అవశ వికె వశ్య వౌదు గాకనుచుఁ బలికి
యాపిసాచి యదను వేచియట్టు లుండ
విల్లు నమ్ములు దల మ్రోలవెలయఁ గాంచి
ముదిత బలుశోక సాగరమ్మున మునింగి. ౩౫౩
సీ॥ హనుమనిచే సమాఖ్యాత మైనట్టి సుగ్రీవమైత్రీకథాస్ఫురణ లెంచి
వరుస నవ్వానరవాహిని సాగరాభ్యాగత యను వార్త నన్వయించి
మోము గన్నులు కురు ల్ముఖవర్ణ మాశిరోమణియు నట్లే యుంట మలయఁ గాంచి
మదిలో నభిజ్ఞానమండలి గలయంతవట్టు చూపట్టుట వావిఁ బెంచి
యుమ్మలిక ముప్పతిల్ల నాయమ్మ కురరి, యట్టు లాక్రోశ మొనరించె నాస వాసె
ననుచుఁ దనవడ్డపా శ్రైల్ల నావహిల్లి, తల్లడం బొడఁగూర్ప నొత్తిల్లి తెరలి.

—♦ సీతాదేవి రాముని మాయాశిరముం జూచి దుఃఖించుట ♦—

క॥ తలఁపులు ఫలించెఁ గైకా!, కులనందనుఁ డెడలె నింకఁ గుదురుకొను మదిన్
నిలువుము కులనాశనమున, కలవడె నీకలహాశీల మనుగత మనుచున్, ౩౫౫
తే॥ ఏమి విప్రియ మొనరించె నిత్థచరితుఁ, డార్యుఁ డగు రాముఁ డాతని యంతమునకు
గారణమ వైతి చీరలు గట్టఁబంచి, వెడలనడఁచితి వడవుల వెతలు గుడువ.
క॥ అను నుడి నొడువుచునె తప, స్విని జనకుని బాల మ్రోల సిరిసెడ నొరగెన్
వినికృత్త మైన కదలిక, యనువృత్తము నెఱియ వడఁకు నవయవములతోన్.
ఆ॥ ఒకముహూర్తమునకు నూ ర్పెడల్చుచు జీవ, మందినట్టు లగుచు నమ్మృగాక్షి
యాశిరంబుఁ బుణికి యాఘ్రాణ మొనరించి, తొడరి పలికెఁ బలుకు తొట్రిలంగ.
ఉ॥ ఆహత నైతి వీర ! నియమానుగతవ్రత ! రామచంద్ర ! యా
బాహుబలం బరిందమము పశ్చిమ యా దశ నిచ్చగించెనే
సీహరిణాక్షి కీవికృతి నెట్టనఁ గూర్చితె సాధువృత్తికిన్
సాహసవృత్తి మేలె తన సాధ్వి మొఱంగి చనంగ నిద్దెసన్. ౩౫౯
ఆ॥ తప్పఁబలుకుదాన దయితుండు తనకన్న, మున్న చనుట యెన్న ముదిత దోస
మతిసువృత్తుఁడవు మహాత్ముండ వీ విట్టు, లరుగుదే మదీయ మఘము కాక. ౩౬౦

తే॥ దుఃఖితో దుఃఖ మిమ్మెయిఁ దొలియఁ గాంచి. మన్యుసాగరమునను నిర్మగ్న నన
నన్ను రక్షింప దొరఁకొంటి నాథ యట్టి, దొర వరయఁగంటి విట్లు లక్ష్యగతంబు.
తే॥ అమ్మహితుకాలు కౌసలు నాత్మజాత, దేవి మదుపాస్య దేవత ధేను వాత్స
వత్సముం బలె నినుఁ బాసి వాసి సెడఁగ, వత్సల వివత్సఁ జేసితే వలను సూపి.
క॥ ఏయోజ నెవరు నిను దీ, ర్ఘాయుస్సముపేతుఁ గాఁగ నాడి రచింత్ర
శ్రీయోగ! వారి నుడు ల, ల్పాయుష్కుఁడ వీవు గాఁగ నన్నృతము లయ్యెన్.
ఉ॥ కారణభూత మై జగము గ్రాసముగాఁ గొనసేర్చు కాల మా
నేరిమిఁ బక్వభూతునిఁగ నిన్ను నొనర్పఁగ నొడ్లప్రజ్ఞపై
నేరము మోపు లేమిటి క నింద్యుఁడ వెల్ల యెఱింగి తర్జద్మ
క్పారముఁ గంటి మృత్యుముఖ గహ్వర మంది తపఃలో లలాలునన్. ౩౬౪
తే॥ కమలలోచన ! మత్ప్రాణసముఁ దతోతి
ఘను నతినృశంస రౌద్ర యా కాలరాత్రి
లేఁగి యొడిచి పొదివి యాహరించె నేమి
సేయుదాన స్ఫురింప దుపాయ మొదియు. ౩౬౫
తే॥ ననుఁ దపస్విని విడనాడి నాయ మేమొ, ప్రియతమంబోలె నెట్టనఁ బృథివి నట్టు
లలిమి యాశ్లేష మొనరించి యత్తమిల్లి, యుపశయానుఁడవై వేయుగు భుజాగ్ర
క॥ ఇదె కాదె వీరశేఖర, సదనున నాతోడి నిరతి నర్చావిధులం
బొదలింపఁబడిన విల్లది, ముదమున సుమమాల్యగంధ ముఖ్యార్ఘములన్. ౩౬౭
క॥ నీతండ్రి నాదు మామ వి, నీతాగ్రణి పితృగణం బనింద్యము స్వయమా
నీతముగా స్వర్గమునఁ ద్వ, దాతతపద మొనసి ముదితుఁ డయ్యె నసంశన్. ౩౬౮
తే॥ నీదురాజర్షి కులము ద్యో నిష్ఠితంబు, సుకృతిజన కాంక్షణీయంబుఁ జూపకుండ
వచట నక్షత్రభూతుండ వగుచుఁ దనదు, పున్నములపోవు నెలకొని యన్నసూప.
ఆ॥ బాల నన్ను బాల్య పరిణీత సహధర్మ, చారిణిం బ్రిసక్త సాధ్వి భార్య
నేమి దలఁచి యిట్టు వీక్షింప వే మని, పలుక వుచితముల సుభాషితముల.
క॥ మఱవంగ నగునె పెండిలి, నెఱపిన యాప్రతిన ధర్మ నిష్ఠుఁడ వీయ
క్క ఱనేని వీడు దే నను, మొఱంగ కావన్న నచటు కొనయింపఁగ దే. ౩౭౧
క॥ ఉత్తమగతిమంతులలో, నుత్తముఁడవు నన్నుఁ ద్రోచి యొంటిగ నరుగన్
బొత్తెడలితో మఱచితో, యిత్తలముం బాసి యచటి కెఱుక మరఁగుచోన్.
తే॥ సకలకల్యాణసంపత్ప్ర సక్తిఁ గని మ, దేకలోక పరిష్వంగ మొనసి యెసక
మెసఁగు నానీశరీర మి ప్డసదు లైన, పాదుకవ్యాదములకుఁ బాల్పడెనె యకట.
ఆ॥ ఆప్తదక్షిణంబు లధ్వరముఖ్యంబు, లాచరింప కిట్లు లైతి వేల
నీదుకాలములోన నెఱిగన్నవారెల్ల, నగ్నిహోత్రు లై మహత్త్వ మంద. ౩౭౪

మ॥ ఇలు సేరం గనెనేని లక్ష్మణుఁ డాకం దెట్లనఁ గౌసల్య యు
మ్మలికం బెక్కుడు గాఁగ వత్స ! కడునేమం బూని చన్నట్టి వా
రలలో నెక్కటి గాను పించితివి దూరం బయ్యె నాద్వంద్వ మే
కలన న్నాగ నతండు దెల్పు సొద శక్యంబే విచారింపఁగన్. ౩౨౬

చ॥ అడుగఁగ వీడరాక బలు నంగదమైఁ గడుఁ గ్రిస్సి యాతఁ డీ
వడువున రక్కసు ల్తొడరి వారక యుద్ధమ రేయి చొచ్చి ని
న్నొడయని నీసుహృద్బలము నూరకె చంపి రనంగ నప్పు డా
బడుగున కెట్టి దైన గతి పాల్పడునో తరమే వచింపఁగన్. ౩౨౭

తే॥ సుప్తహతుఁడై చనిన తన సుతుని గతియు
రక్కసుల యిక్క నున్న నా వార్తఫలము
హృదయ మువదీర్ణ మొనరించి యెనయు నంతఁ
బడుటయే కాక పై నొక్క పలుకు గలదె. ౩౨౮

ఆ॥ ఏ ననార్య నాదు హేతుకృతిన చువ్వె
సత్త్వవంతుఁ డేలఁ జాలి నట్టి
ఘనుఁడు వార్ధి దాఁటి కడకు గోష్పదమందుఁ
నిహతుఁడయ్యె రాముఁ డహతుఁ డహహ. ౩౨౯

తే॥ స్వకులపాంసని యిది యన్నజాడ గనఁడు దాశరథి మోహమున నన్నుఁ దావరించె
నరయ నయ్యార్యపుత్రుని హాని నొనర్పఁ, బాల్పడిన మిత్తి గాని నేభార్యగాను

ఆ॥ పీఁటమీఁది పెండ్లి పెడవెట్టి చూచిన, దాన ము న్నొనర్చి యేనుఁ గాక
యనుభవింతు రెవ్వ రఖిలాతిథికి భార్య, నయ్యు నేఁటి కిట్టులైనదాన. ౩౩౦

ఉ॥ రావణ! పున్నె మబ్బెడు బిరాన మదీయము కాయ మట్టె నా
[illegible]నవముగీము రాము మెయిఁ జేర్పుము తీర్పుగ సంస్కరింపు ము
ద్భావమునం దదీయ మగు పట్టినయుంగలదాన దానము
న్నీ వొనరించినట్లు లగు నేను శుభోదయ మందఁగాంచెదన్. ౩౩౧

ఆ॥ పతికిఁ దనదుభర్త చనిన లోకమె లోక, మతనిఁ బాసి యొక్క యరనిముసము
నిలువ దిటట ధర్మనిష్ఠితుం డద్దేవుఁ, గూర్చి మంచిగతికిఁ గూర్చి మనుము. ౩౩౨

క॥ అని ప్రాకృతత్వ మవలం, బన మొనరించుచు సరోజపత్త్రేక్షణ నె
ట్టన శోకపరీతాత్మత, ధనువు శిరము మఱియుఁ గనుచుఁ దడబడచుండన్. ౩౩౩

ఉ॥ ఒక్కఁడు రక్కసుండు పతి నొయ్యనఁ జేరి జయింపు మార్య! యం
చొక్కటఁ బల్కి కే ల్మొగిచి యుజ్జితుఁగా నొనరించి పొంచి నాఁ
డక్కఱ వాహినీపతి ప్రహస్తుఁడు దెల్పఁగ బంచినాఁడు నీ
వక్కడ కేగుదేరఁ జనునయ్య! యటంచు వచించి క్రమ్మఱన్. ౩౩౪

మ॥ అను కోలాహలము ల్సెలంగ దనుజాధ్యక్షు ల్మహాయూథము
ల్గొనకొంచుం గరలంగ నాయుధములం గొంచుం యుగాంతప్రవా
తనిర్యాఘత్వము గ్రోల సద్దెసల దోర్దర్పంబు చెన్నార నె
ట్టన సంచార మొనర్చి రొడ్ల పరికట్టంజాలు శీలంబులన్. ౧౯౯

క॥ అంతట నే చని హరివరు లంతిపురింగుండఁ బురము నలమి రెచటునం
దంతిరథము తే దటుంచు నుదంతము గానణుని తోడ దైత్యులు నలుకన్. ౨౦౦

ఆ॥ సగిరి గుప్త యయ్యెనా నదభ్రస్మృతి తోనె పెచ్చుపెరిగి యలుక చిచ్చు ముట్ట
డింప రక్షణము గు ణింపఁగాఁ బనిచి ప్రాసాద మెక్కె రాక్షసప్రభుండు. ౨౦౧

ఉ॥ కన్నులఁ గాంచెఁ గన్నులనుగట్టినయట్టులె విన్నయంత లా
నన్నరనాథు వాహిని బయళ్ళ నగంబులఁ గాననంబులన్
మన్నున మిన్నునం దనక మార్పడఁజేయఁగ లెక్క ద్రిక్కగా
నన్నెలమాయలాఁ కోటుల నయ్యెడునో యని విన్నవోవుచున్. ౨౦౨

శా॥ ఇన్నేలం గబళింతురో దెసల మా యింత్రో చద ల్ద్రింతురో
మున్నీర న్నడి సున్న సేయుదురుకో ముప్పోకల స్వేఁకలం
గొన్నా రెమ్మెయి వీరి గెల్వనగు వైకుంఠు లదా యంచు లో
న న్నిర్వేదము పొగి యూర్పులకు న న్న ల్సేయ సన్నాహుఁ డై. ౨౦౩

ఆ॥ అట్లు దీర్ఘకాల మాలోచన మొనర్చి ధీరభావ మొప్పఁ దీటుకొనఁగఁ
గనులు విచ్చి రాముఁ గపివరేణ్యబలమ్ముఁగలయఁజూచె మరలఁ గమలనయన!

క॥ వెలిగొడుగుల నీడలఁ దమ్మలఘుశ్రీ నట్టుగాంచు నాతనిఁ గని యు
త్కలమగు రోసంబున మోమలంకరింప నొకవింత హాసం బొలయన్. ౨౦౪

ఆ॥ రాముఁ డర్ధశశిశ రముఁ బూన్చి యుద్ధానఁబడి కిరీటములును భాసురాత
పత్రములుఁ దెరల్చె భంగజాపత్రపముంప వాఁడు తలఁగె ముదిత! వింటె.

—♦ రామాజ్ఞప్తులై కపిభటులు లంకపైఁ గవియుట ♦—

ఉ॥ లగ్గల కెక్కఁ బంచె నటు లాఁతిపురమ్మపయి న్వనాటులం
దిగ్గన దానిఁ గగ్గ నెడు తీరున సీత తలంపులోని దై
భగ్గు రసంగఁ గోపపరిపాకవిశేష మె సంగఁజేయ నా
దిగ్గజకుంభకస్తని విదేహజ యెట్లగు నేమొ యంచొగిన్. ౨౦౫

ఆ॥ ధర్మమూర్తి రామదైవతం బటు లానసేయు నంతలోనె సింహనాద
ములు సెలంగి దెసల ముప్పోకలకుఁ గూర్పనొండొకొండ్ల నొంట నొరసికొనుచు.

ఆ॥ కొండశిలల దీనిఁ గొనకుఁ బూడ్తుమొ పిడికిళ్ళఁ బొడిచిపొడిచి క్రిందువాఁడు
నేసి ప్రోవువెట్టి శీర్ణమ్మొనర్తుమో యని తలంత్రు వానరాధిపసులు. ౨౦౬

సీ॥ కొనముట్ట శిఖరము ల్గొండలు పెకలించి కొనివచ్చి వైతురు కోర్కె లలర
నటు మహాతరువుల నందించువారల మెచ్చి కైంకొందురు మేను లెగయ
నెగసి తన్నులు దన్ని యింతింతముక్కలు గావింత్రు నెట్టనఁ గడఁక దనరఁ
బిడికిటిపోటులఁ బీచం బడంగించి యొండెడఁ బడఁద్రోతు రుబ్బు సెడఁగఁ
బరిఘ లొంటఁ బూన్చి పటు పౌనర్చిరి మహావరణముల నగల్చి నటులు తోర
ణముల ద్రచ్చి యిడిరి సమభూమిగాఁ జేయనింక లంక యుండు నెట్టు లనుచు.

ఉ॥ బంగరుమేను ల ల్లరుణభాసము లా మొగము ల్ప్రసంగ స
య్యాంగజమూర్తి జీవములె యన్నియు నంచు రిపు ల్దలంక లం
కాంగములం గలంప నయి యాఁడిపెట్టిరి రాక్షసేంద్రు స
ప్వాం గిటు గ్రుంగుఁగాత మని బోరన వా రసవద్యభావనా! ౨౧౧

శా॥ కోటీకోటుల లెక్కకుం గవియుచు న్గోల్పోక నాటించుచు న్
బాటీకోచితభర్మహర్మ్యముల దౌర్భాగ్యంబు వాటించుచు న్
మాటన్ గోపురతోరణప్రతతి సంచూర్ణంబు గావించుచు న్
బోటీ! యాటలు పాటలు న్నెఱపి రాపో రెన్నఁగాఁ జక్కనే. ౨౧౨

ఆ॥ అతిబలుండు రాముఁడజితుండు జయ మొందు లక్ష్మణుండు నెలయు లాఁతినాఁగి
నేలపాలుసేయు నేత సుగ్రీవుండు తత్ప్రపోషణము గదపలినాఁడు. ౨౧౩

మ॥ అని యిట్లార్పులు నింగిముట్ట బలుసయ్యాట ల్సలంగ న్ రిపు
ల్గని భీతిల్లఁగ నుల్లసిల్లు ధృతిఁ దత్ప్రాకారముల్ద్రోచి యే
చిన దర్పంబునఁ జొచ్చి విచ్చలవిడిం జేడ్పాటు గూర్పంగఁ ద
ప్పని దీము ప్పను ఘోషణ ల్దెసలకుం బ్రాకెం దివౌకస్సుతా! ౨౧౪

వ॥ ఆసమయంబున ము న్నొనరించుకొనిన సమయంబునన యన్నినెలవులం దన్ని
పన్నుగడలు గడలుకొనం బన్నుచున్న యన్నెఱి నెఱజాణతనంబు మిగులను
వీరబాహుసుబాహులు ప్రాకారంబులు నిరాకారంబులు గావించు నయ్యుప వే
శనంబున స్కంధావారనివేశనంబు సమర్థించు విశేషార్థంబుఁ గైకొని ప్రఘసుం
డును బనసుండును బహుసైన్యంబులతోఁ దనకుం దోడ్పడం బడవాలునకు సహా
యంబుగా జితకాశు లగు పదికోటులు కీశవర్యులతోఁ గుముదుం డీశానదిశం
దార్కొని పూర్వద్వారసేనారక్షణంబున కోపి నిలుచునట్లును వీరుఁ డగు
శతవలి వింశతికోటులతో నాగ్నేయి న్నెలకొని దక్షిణానీకినిపైఁ గన్నిడి మెలం
గునట్లును నఱువదికోటులతోఁ దార తండ్రి యగు సుషేణుండును నైరృతపు
దిక్కుం ద్రొక్కి పశ్చిమద్వారంబున సేనాపారావారంబుఁ బాలింపఁ బాలు
పడునట్లును సర్వహరీశ్వరుం డగు సుగ్రీవుండు మధ్యమగుల్మంబు వెన్నుదన్ని
వాయవ్య దిశ నుండినవాఁడు సహలక్ష్మణుం డై యుత్తరద్వారం బాక్రమించి

మించిన శ్రీరామదేవుని యండం బాయక నాయకరంబు పొగడొందు నెగడొందు నట్లును భీమదర్శనుండును మహాకాయుండును నక్షీణవిక్రముండు నగు గవాక్షుండును విపక్షనిబర్హణుండును ఋక్షవ్యూహనాథుండు నగు ధూమ్రుండును గోటికోటిసైన్యంబులతో నాలీలామనుజేశ్వరుని కెలంకులన తొలంకునట్లును నిబంధనంబు సంధానించి గజగవయగంధమాదనశరభులుం దారును బరిధానవనం బొప్పారి సర్వహరివాహినీపరిరక్షణంబున మెలంగుచుండువారుగా నియ్యకొని రయ్యెడ మహాబలవీర్యుం డగు విభీషణుండు సన్నద్ధుండును గదాపాణియునై సచివులతో రామనరేంద్రుని బలమ్ము బలమ్ముగా నాసీరసీమను గైకొనియుండె నట్టియెడ ౨౧౭

క॥ పరబలములు పైకొని సంబరమునఁ బరవళ్లు సేయఁ బరఁగుటఁ గని స
త్వరమున నిజసైన్యముల కంబరచరరిపుఁ డాజ్ఞ సేసెఁ బ్రస్థానంబున్ ౨౧౮

—◆ రావణుండు తనసైన్యములను యుద్ధమునకు నెలవిచ్చుట ◆—

తే॥ అట్లు తన్ముఖనిర్గతం బైన పలుకు చెవికి సోఁకినయంత నే సిగ్గు మనుచుఁ
దరలి రెసఁసిరి సింహనాదములు కొసర్చి రశనినిర్ఘోషములఁ బోల నసురవరులు.

సీ॥ చంద్రబింబాస్య లగు నల ప్రమోదైకభేరిక స్తోమనాదాహతి భీమలగుచు
ముఖరనాదరతమ్ములు మోదసి ఘోరనమ్ముగా ఘోషిల్లె శంఖము లొక్కట్ల కోలది
గజములు ల్లాయతపు ల్గను లెంచి యేమొకో మొరసె నాశలను వైముఖ్య మొదవఁ
జక్క సేయఁ గ్రమసన్నద్ధనాదంబు లశనినిర్హ్రాదాప్తి ననువదించె

గీ॥ రానరా హేషణమున నగ్ర గామభూమి
నుం దమకమటంచు దరిలేని మొక్కలమున
సముదమస్మృతిపూర్వ్యమాణము ల్సాగర ప్ర
వేగములు యట్లసురభటుల్ నెడలు నపుడు ౨౧౯

తే॥ మిలిమీనులు కప్పల మొఱఁగులీను క్రొన్నగల యొప్పిదముల సంకులు ధరించి
వారు విస్ఫుటబలాకికానఖులతోడి యంబుదంబులు నాఁ బొల్చి రంబుజాక్షి.

ఉ॥ వారలరాకఁ గాంచి వరవారణతుల్యులు వానరోత్తముల్
భూరిబలుల్ విసర్పిరి ప్రభూతము లౌ ఘనగర్జితంబులన్
బూరిత మయ్యె నామలయభూధర మే యన నేల నేలతో
బోరటి లెస్స ఘం బటులె భోర్కొనెఁ దన్మహిమేఖలాటుర్భల్ ౨౨౦

క॥ దేవాసురుల కున లెనేయా వానరరాక్షసులకు నయ్యె సమర మ
హావేగ వేగవృత్తులు తీవర పడు వారిపట్లఁ దేటపడంగన్. ౨౨౧

—• యుద్ధప్రారంభము •—

ఆ॥ స్వస్వవిక్రమములఁ జాటుచు ఘోరుల వైరు లగిచి తాఁకి వనచరులను
బొడువఁజొచ్చి రోకటఁ బొలుచు గదాశక్తి శూలఖడ్గభిందివాలములను. ౧౧౨
మ॥ జయ మొప్పారుఁ బ్లవంగమాధిపతికిన్ క్ష్మాపుత్రికాజానికిన్
జయ మా మాకును వారి ప్రాపు గలుగన్ సంగ్రామరంగంబునన్
భయ మెన్నం బనిలే దటంచుఁ గడఁకన్ భాషించుచున్ స్వీయ సూ
హ్వాయముం దెల్పుచు వానరు ల్దొడరి రాయ్యన్మార్గముల న్మార్గొనన్. ౧౧౩
ఆ॥ కడఁగి యమ్మహోగ్రకాయులు నెలరేఁగి పూచినట్టి దైత్యపుంగవులను
గొట్టఁదొడరి రోకటఁ గొండల బండలఁ జేతిబలువు మెఱయఁ గొట్టువిసరి. ౧౧౪
తే॥ గోళ్ల వచ్చిరి పండ్లచే గ్రొచ్చి రెండ్రువే లిడఁగ సందు లేకుండ వేగితు లయి
మెట్టులేనియు విదలించి యిడిరి పగఱఁగ్రోఁతు లవ్వార లా వెంటఁ గొఱఁత గలదె.
ఉ॥ కొండల మంది రక్కసులు గొందఱు వప్రములందు నిల్చి యా
క్రింద నెదిర్చు వారిపయిఁ గ్రిక్కిరియించిరి భిందివాలముల్
ప్రందఁగఁజేయు శూలములు ప్రాని మెకా లది యోర్చి మార్తురన్
ముందల లాఁగి లాఁగి రొగి ముట్టఁగఁదాఁకి వియద్విహారు లై. ౧౧౫
తే॥ అట్టిసంకుల సమరంబు నందు మాంస శోణితాంకంబు పంకంబు చూడ నొప్పె
ధార మెడలించు కొననెంచు పట్టునందు నేల కొదవిన రోసంబు నెఱసె ననఁగ.
తే॥ అంతకంతకు బలకోప మతిశయిల్లె వారు పీ రనఁబోని యప్పోరితమున
మూఁక లేకట తోడి దై మొనయు దేరు పరవశత్వంబునకు వశపడుచుఁ బొడువ.
ఉ॥ ఓపు పిసాచికోలుపులు లుగ్రరణంబున నేపు మీఱఁగాఁ
బైపయి వ్రాలి రుద్దవిడి బంగరుపోడుము లొప్పు గుఱ్ఱముల్
ప్రాపుగ భానుమండలనిభంబులు వహ్నిశిఖాధ్వజంబు లు
చ్ఛ్రిపథముల్ రథంబులు విశిష్టసుకంటకము ల్దొలంకఁగన్. ౧౧౮
తే॥ ఆర్పు లెసఁగ రావణు జయ మభిలషించి
భీమకర్ముల తా మట్టు లాముకొనఁగ
రామవిజయంబు రూపించు రాణవొసఁగ
వానరచమూసముద్రంబు వారిఁ బొదివె. ౧౩౦

—• వానర రాక్షసవీరుల ద్వంద్వయుద్ధములు •—

మ॥ సమయం బియ్యదె యంచు ద్వంద్వసమరోత్సాహంబు వాటిల్ల రో
స మనేకాకృతు లూనె నాఁగ నుభయుల్ సన్నద్ధు లై యుద్ధతిన్

సమదేభంబుల భంగి మార్కొనిరి త త్సరంభ మీక్షించి త్రా
సమయంబు ల్తమహృత్ప్రదేశములుగా స్వర్వాసు లూపాడఁగన్. ౧౩౨

తే॥ వాలిపుత్రునితోఁ గడు వాలి క్రాలి యెదిరి పోరంగఁ దొడరె నయ్యింద్రజిత్తు
మున్ను నన్నుఁ దలంపక ముట్టికొనిన యంతకునిఁ బోల్చ నగుచు లతాంతలలిత.

సీ॥ సంపాతి తొడరెఁ బ్రజంఘరాక్షసునితో మలసెఁ బోరఁగ జంబుమాలి హనుమ
సక్రోధుఁ డవ్విభీషణుఁడు మిత్రఘ్నునిఁ దాఁకె గజుం డట్లు తపనుఁ బొదివె
నీలుండు దొరఁకొనె నెఱి నికుంభునితోడఁ బ్రఘసుని వానర ప్రభు వెదిర్చె
మఱి విరూపాక్షు లక్ష్మణుఁ డాఁటఁగదిసె శ్రీమంతు రామేంద్రుని మార్కొనంగ
గీల్కొనిరి నల్వు రాయగ్నికేతురశ్మికేతుసుప్తఘ్నయజ్ఞకో పాతియోధ
వరులు మైందున కగపడె వజ్రముష్టి ద్వివిదుఁ డశనిప్రభుని పోటు దీటుకొనియె.

క॥ రణదుర్ధరుఁడు ప్రతపనుఁడు గుణవంతుని నలుని నెమకి గూర్చుకొనె విచ
క్షణు నాసుషేణు దుర్మర్షణు విద్యున్మాలి నడసెఁ బ్రతియోధునిఁగన్. ౧౩౪

ఉ॥ ఎన్నికఁ గన్నవారె దను జేంద్రుని బంటులు వానరేంద్రు క
న్నన్న మెలంగువారిఁ గొని సంయుగము న్బొనరించి రీవ యం
చెన్నఁగ నిట్లు లట్లు లన నేరికి శక్య మగున్ రణంబు సం
పన్నము రోమహర్షణము ప్రాజ్యము కీర్త్యము నై ప్రవర్తిలన్. ౧౩౫

క॥ అన్యోన్యజయాకాంక్షు లసన్యాదృశములుగఁ బోరి రాపోరితపు
న్విన్యాసం బెన్నఁ జనునన్యము లన్యముల చూవె యగరాజసుతా! ౧౩౬

ఆ॥ కేశశాద్వలములు గిఱికొన నట్టలు కాష్ఠసంచయములు గాఁగ రక్త
నదులు నాఁటె బిట్టు పొదలుచు మారిరాక్షసాంగజనిత లై రణాంగణమున.

క॥ అంగదునిం గదఁగొని యా జిం గసలున మోఁదె నింద్ర జిత్తు పవిఁ బ్రస
క్తిం గేగు దాని నెన్నకయంగము వెనిచిన యమర్ష మన నై పెలుచన్. ౧౩౭

ఆ॥ వాఁడు వాని స్వర్ణ వర్ణనీయరథంబు నూడ్చి రథ్యసమితి నుక్కడంచి
సారథిని వధించి సరభసుం డై యార్చె సమరు లర్చ్యుఁ డీతఁ డనుచుఁ బొగడ.

తే. మూఁడు బాణములం గ్రుచ్చి ముమ్మరింప నాప్రజంఘుని సంపాతి యవనిఁ గూల్చె
సప్తపర్ణశరంబున నౌ నటంచు సచివు కరలాఘవము విభీషణుఁడు మెచ్చ. ౧౪౦

తే॥ జంబుమాలి రథస్థుఁ డై యంబరభవుతనయుని స్తనాంతరంబు బెల్చన నగల్చె
నతఁ డలిగి యాతని రథంబు నతనితోడఁ జూర్ణిత మొనర్చి యార్చెఁ బ్రసూనకలిక.

చ॥ ప్రతపనుఁ డార్చుచు న్నలుని పైఁ బఱతెంచి శరప్రపాతమున్
వితత మొనర్పఁ దత్ప్రదర విద్ధుఁడు వాఁ డది లెక్కసేయ క
ద్భుతముగ వాని గ్రుడ్లు దలతోఁ గొనగోళ్ళఁ బెకల్చి వైచెఁ బో
రిత మిది బెట్టిదం బని యరిప్రకరం బొగిఁ బిచ్చలింపఁగన్. ౧౪౧

తే॥ గ్రసన మొనరించు ప్రఘసునిఁ గాంచి సేన రభస మెడలంగ నైసప రాకు నెంచి
సప్తపర్ణంబునన వానిఁ జక్కడంచి మించె వ్రేల్మిడిఁ బ్రథితుఁ డమ్మిహిరసుతుఁడు.

ఆ॥ అగ్నికేతుముఖ్యు లానల్వు రుద్ధతు లడరి రాము ముంచి రస్త్రవృష్టి
నగ్నిశిఖలఁబోలు నన్ని తూఁపుల వారి జముని ప్రోలి కనిచె జనవిభుండు.

ఆ॥ అడరు వజ్రముష్టి కని మైందుఁ డొకముష్టిఁ గూర్చె దాన నవనిఁ గూలె నసుర
వాని తేరు పేరు వారువంబుల తీరుగానరాద కలదె గతియు మీఁద. ౨౮౫

క॥ పురగోపుర మటూతఁడు దెరలినఁ బలుదెఱువు లైన దితిజబలముల్
బోరిగొనె నితఁడు సమక్షముధరాధరం బట్టు లేచి ధరవరతనయా. ౨౮౬

క॥ నీలు న్నీలాంజనరుచిజాలున్ జలదంబు రవి ప్రసక్తి నికుంభుం
డోలి శరములఁ గరమ్ములయాలీలన్ బ్రీలఁ గొట్టి యార్చెం బెలుచన్. ౨౮౭

క॥ మఱిమఱి కరలాఘవ మేర్పఱచిన శరశతము లతనిపై నెఱసిన న
క్కఱ తోఁపకునికిఁ గని పనిసెఱిచితి ననె నసుర నవ్వు సెలవులఁ బాఱన్.

ఆ॥ సెలుఁ డడరి విష్ణునెఱి నాతనిద యైన రథము చక్రమున నరాతిశిరము
నఱికి వైచెఁ దోన నాథుండ ననకుండ యంతతలయుఁ దఱిగి యనువుసూపె.

క॥ అశని సమస్పర్శుండపుడశనిప్రభు గిరిశిఖాప్రహతుఁ జేయఁగ ని
ర్వశుఁ డయ్యె వాఁడు ద్వివిదునిస్వశరాశనిశతములం బ్రసక్తు నొనర్చెన్.

ఆ॥ క్రోధమూర్ఛితుండు కోవిదుం డాద్వివిదుండు దుడఁగీడ! పండు మనుచు
సాల మొండు దెచ్చి చదిపెరక్కసు రథ రథ్యసూతయుతు సుర లున్నతింప.

శా॥ విద్యున్మాలి రథస్థుఁ డై వితత మా వేగంబున స్స్వర్ణపుం
ఖద్యోతమ్ముల నమ్ములం బఱపినం గాలుష్య మొప్ప న్హరి
ప్రద్యోతుండు సుషేణుఁ డేచి విపుల గ్రావంబున న్వాని సం
పద్యోగాకృతి స్యందనోత్తమము నిర్భగ్నంబుఁ గావించినన్. ౨౯౨

క॥ గదఁ గొని గనుకనినిల నిలబ్రదికితె యసురా! యటంచు బలుశిలఁ గొని య
వ్విదితుఁ డరుదేర రాక్షసుఁడది ప్లవగోత్తముని వక్ష మంటఁగ విసరెన్. ౨౯౩

ఆ॥ ఘోర మాగదాప్రహార మాతఁడు లెక్కసేయ కెదిరి నిలిచి ఛాయఁ గాంచి
వాని గుండె వగుల వైచె గుం డెదఁ బిండిఁ గొట్ట నసుర మడిసెఁ గోమలాంగి.

తే॥ దేవదానవయుద్ధంబు తెఱఁగుసూపు నమ్మహాయోధనమున దైత్యౌఘ మట్లు
నాశ మందంగఁ దొడరెఁ గీనాశుఁ డడరి కీశరూపముల్గా నెనన్న కీలుదోఁప.

ఉ॥ భగ్నములయ్యెఁ బెన్గదలు పట్టసతోమరఖడ్గశక్తులు
ద్విగ్నము లై పడెం గరులు దీర్ణము లౌ రథరథ్యసంతతుల్.
మగ్నము లయ్యె రక్తఝర మాంసచయాంకితపంకమం దసం
భుగ్నతఁ గీసు లాశరులు భోరనఁ బోరొనరించు నత్తఱిన్. ౨౯౬

తే॥ చెడియుఁ జెలుపన చూతు రోచెల్ల యూపి సాచు లద్దాన నద్దాని పూచి మాయ
దేమసఁగనచ్చు సంగరం బింతనంత సంద్ర మెదిరించు సను సడిసన్నఁ గాంచె.

క॥ కరితురగస్యందనవానరాసురాంగచయశకలనాళాస్రఝరీ
ధర వైతరణీనదితోఁ సరిపోల్పఁగ నయ్యె నాప్రచారమునఁ జెలీ! ౨౫౮

ఆ॥ చామర గ్రాసంగులు చక్రాక్షయుగదండములు పతాకలును సమూహ మగుచుఁ
దెప్పదేల నాసధర ఝురపూరంబు పైని నెగసిపడెఁ గబంధవితతి. ౨౫౯

క॥ ఆమూయులు తనువులు దిన గోమాయుసకంకగృధ్రకూటగ్రహముల్
గామాయత్తతఁ బోరఁబడెఁగా మాయట్టిను వచింపఁగా రది మగువా! ౨౬౦

ఉ॥ ధ్వస్తసపత్నుఁగా హరివతంసుల ఘాటి నిరస్తశౌర్యులై
ప్రస్ఫురపాతజాసృగుపపన్నసమస్తశరీరభాగులై
ప్రస్తవికాసులై నిలువఁజాలమి వీడఁగరామి నెంచి సూ
ర్యాస్తమయాభికాంక్షు లయి రాశరు లోశరజన్మమాతృకా!

తే॥ సంగతుం డయ్యె నయ్యె నస్తాగతుండు కాలగతి ద్రోనరాని దా కారణమున
రవి యఖిలసుఖకారిణి రాత్రి వచ్చెఁ బ్రాణహారిణి యై వారి పాల బాల! ౨౬౨

రాత్రితుములయుద్ధము.

తరల॥ పరజయాభిరతు ల్పరస్పరబద్ధవైరులు ఘోరు లా
సురులు వానరు లుద్ధతిం దలి చూచి యోచి ప్రచార మ
బ్బురముగాఁ దలిరంగఁ జొచ్చిరి పోరు దారుణ మయ్యె న
ప్పురుసునం జగమెల్ల నేఁకటఁ బ్రాఁకె నే మని చీఁకటుల్. ౨౬౩

క॥ రక్కసుఁడనా యనుచుఁ గపులక్కపివా! నీ నటంచు నారక్కసు ల
ట్టుక్కుమిగిలి తమపేళ్ళను వక్కాణించుచును పోరువారైరి సఖీ!

ఆ॥ తలఁగ దేల యెదిరిఁ దాఁకి విదారింపు మడఁచి యిడుము పొడుపు మలుకవీడఁ
బోకు మనెడు నుడులు పొరిఁబొరి వినసయ్యెఁ దుముల మైన రాత్రిసమరమునను.

క॥ కాలు ల్కాంచనకంకటచేలులఁ రక్కసులు బిట్టుచీకటిలోనే
శైలమునఁ లోసిఘలతికాజాతేత్తును లట్లు దృక్ప్రసక్తి కయి రుమా! ౨౬౬

శా॥ ఆదుష్పారతమంబులోనఁ బోలదిం ద్గాక్రోశ మొప్పార ను
న్మాదోద్ధత్యము మీరఁ బ్రాలి కపుల న్మందింప భక్షింప దు
ర్వాదంబు ల్పచరింపఁజాలి రయి రవ్వా పెంచ కవ్వైరులన్
క్ష్వేదక్ష్వేదములం బొనర్పఁ గపిలాఖ్యుల్పళ్ళ చేఁ గోళ్ళచేఁ. ౨౬౭

ఆ॥ అగ్నిశిఖలఁ బోలు నవ్వారి ధ్వజముల హాటకోచ్చయముల హాయచయముల
గరుల స్యందనముల గ్రచ్చిరి ద్రచ్చిరి విఱిచి రడఁచి రావవీరు లడరి. ౨౬౮

తే॥ మారిమసఁగిన యట్టులై మారిమసఁగ రాశ్వికుల నశ్వములతోడ హాస్తిపకుల
హాస్తిపకులంబుతోడ సమస్తవైరిసంచయ మసంచయము గాఁగ నైలచరులు.
ఆ॥ అగ్గిపిడుగు లట్టు లాశీవిషము లట్లు జెట్టిదమ్ము లరివిభేదకమ్ము
లమ్ములనిచి యనిచి యారామలక్ష్మణు లసురవిసర మొకట నలఁచి రగజ.
క॥ దృశ్యాదృశ్యంబుల సంపశ్యులు వా రడఁచుచుండఁ బ్రభుతేజము సం
దృశ్య మన నయ్యె నయ్యెడ రాశ్యుచితు బగుచు నయ్యరాతితతులకున్. ౨౭౧
తే॥ వానరుల నావహించె నవ్వసన విభుని శక్తి యని యెంచి రమరులా సక్తి నెఱయ
నల్ల లాడంగఁ దొడరె నయ్యసురసేన సౌరసేనాధినాయక జనని! వింటె.
వ॥ వెండియుఁ బ్రచండతర తురంగఖురవిధ్వస్తంబును రథనేమిక్షతదేశదత్తహాస్తంబు
నగు రణభూమిపరాగంబు పరాగంబుల ముంపంజాలి యుధ్యస్మహాయోధుల
కర్ణనయనంబుల యయనంబులఁ గప్పం జెప్పరాని ముప్పునం బడియుఁ దప్ప
రానిద యగు తమతమకంబు గూర్చు నెఱిన పోరం బో రతిఘోరంబును రోమ
హార్షణంబును. బ్రవృద్ధతర్షణంబు నై యొప్పార నందు రుధిరోదలు నపరోధలు
నగునదు లుద్భవిల్లె భటఘనార్భటులం దెసలు ఘూర్ణిల్లె. శంఖభేరీమృదంగ
పణవవాద్యనిస్వనంబు లొక్కటఁ బిక్కటిల్లె నక్కదనంబునకుం బఱతెంచు
వారును. నఱచువారును బఱచువారును మలయువారును బొలయువారును.
నగు పేరుగల వీరుల సన్నాదంబు లవ్వానితో సంవాదం బొనరించె. శక్తిశూల
పరశ్వధాదులచే నిహతు లగు వానరుల కళేబరంబులును బర్వతశిలాపాతం
బులచే నిపాతితు లగు రక్షఃపతిసపక్షుల భూషణోచితానయనంబులును గొడు
గులు బడగలు నమ్ములు హారమ్ములును హారితపుష్పాద్యుపహారమ్ములుగా
రణమేదినీరంగం బొరుల యంతరంగంబులకు దుర్జ్ఞేయంబు దుర్నిరీక్షంబు శ్మశా
యితంబు నై యద్భుతంబునాఁ గనుపట్టె నప్పట్టున. ౨౭౩
క॥ హరిరాక్షసహారిణి యైహరిహరి యాకాలరాత్రి యనఁ దగె నారా
తిరి యెల్లభూతముల కదిదురతిక్రమ గాఁగ నట్లు దోఁచున కాదే. ౨౭౪
క॥ శరవృష్టులు గురియుచు నాశరు లాదాశరథి నెదురఁ జాల్కొని రొగిఁ బై
మిరికాపత్తియు సరి యగు తెరువున కొకపరి మరల్చు దివ్యర్షినుతా. ౨౭౫
తే॥ అట్లు క్రుద్ధులై రాముపై నడరువారి ఘోషణలు భీషణలు గాఁగఁ గొఱలసయ్యె
నాఱు సంద్రంబు లొక్కట నమ్మహార్ణవంబు సొరఁబొఱు కల్పకా లంబసంగ.
వ॥ దుర్ధర్షులు దురాసదులు మహాకాయులు నగు యమశత్రుమహాపార్శ్వమహోదర
వజ్రదంష్ట్రశుకసారణు లను నమ్మేటిమగ లాఱుగు రొక్కటం జక్కజేరి యుక్కు
మీఱి యురవడించిన.
౨౭౬

క॥ అందఱఁ గనుఁగొని యాశ్రితమందారము దాశరథి సమందహాసితుఁ డై
ముం దరసి పలికె నిటు లరవిందానన వింటె వాని విశ్రుతగుణముల్. ౨౯౧

సీ॥ అఖిలపూజ్యుఁడు బ్రహ్మ యసురు కిచ్చెను వరం బద్దాన ముజ్జగం బలఁచ వీఁడు
మనపాలఁ బడినాఁడు మలసి తా నీనాఁడు తద్వచఃకలన యాథార్థ్య మెలయ
వలయు మీ రంత కు వానరేంద్రుని వీడకుండుఁడు వెఱవెంచి యోసరిల్లి
క్షమియింపఁ దక్కొంట శమియింప నౌ వెంట వలను గన్గొని గెల్వవచ్చు నింక
ననుచు బ్రాహ్మ మస్త్ర మవధాని యై మదిఁ జేర్చి యావహిలు చేసినంతఁ
జూచుచుండె నతని సూనృతం బొకనోటఁ బొగడఁదర మె చిత్ర బోధసహిత!

శా॥ ఇంతీ! కర్కశుఁ డట్లు రావణసుతుం డేనోమయుం డట్లు తా
నంతర్ధానము నొంది రాఘవుల మాయామోహవిభ్రాంతులం
బంతం బొప్ప నలంతు నం చలుక మైఁ బాటించి వజ్రాశని
క్రాంతంబు ల్పరఁగింపఁగాఁదొడరె వీఁ కం దీక్ష్ణబాణౌఘముల్ ౨౯3

ఆ॥ సర్వభూతముల కసంద్రుశ్యుఁ డై యట్లు కసిమసంగి సర్వగాత్రములను
దాశరథుల నొగి విదారింపఁగాఁజొచ్చెఁ గూటయోధి వాఁడు కుధరతనయ ౨౯౪

తే॥ కాద్రవేయమ్ములనె బాణగతికిఁ దార్చి యంగుళాద్రమ్ము బ్రాహ్మమ్మున నలవరించి
యంతరము సేసి యమ్మేయి నస్త్రతతుల నన్నదమ్ముల బంధించె నాసతాంగి.

క॥ కన్నులపండువుగా నాయన్నలఁ గనుఁగొనుచు సమరమందు మెలఁగు సం
పన్నులు వానరవరు లాపన్నుల నవ్వేళఁ గని రపధ్వాంతకలా ౨౯౬

ఆ॥ ఎదిరి నిల్వఁజాల రెవ్వార లేని నా కట్టి జోలి యేల యని తలంగి
యప్రకాశగతుఁడ నై వారి సాధింతు నని తలంచి యింత లతఁ డొసర్చె.

క॥ సౌమిత్రి బ్రహ్మాస్త్రము తో మనుజాశినుతు నిపుడ ద్రుంతు ననె విభుం
డామాట విని తలఁకె వాఁడాముదలఁ గొనం డదేమి యభిమానంబో. ౨౯౮

ఉ॥ అమ్మేయి బద్ధుఁ డై రఘువరాన్వయుఁ డింత యెఱింగి వాని దా
నిమ్మరయంగఁ బంచెఁ ద్రిదశేంద్రసమానులు చిత్రకర్మ లా
దిమ్మరి పొవు పోక గని తెల్పుఁ డటంచుఁ బదుంద్రుఁ గీశసిం
హమ్ముల వా రధీశ్వరుని యానతిఁ గైకొని హృష్టచిత్తు లై. ౨౯౯

వ॥ సుషేణదాయాదయుగనీలాంగదశరభద్విషదవినతజాంబవత్సానుప్రస్థఋషభస్కంధు లనువారు భీమనగపాదపాదపంబుల మూఁపుల మోపుకొని దశదిశలరయుచు నాకసంబు సొచ్చి యవ్వాని యవస్థానంబు నెమకి పడయం జూచుననసరం బున. 300

క॥ ఆవేగవంతులం గనియావేగము నెఱయఁ దొంటి యావేశముతో
నే వేగవత్తరేషువులే వేఁగడలుకొనఁ జేసె నిషువిద్వనుతా. 301

ఆ॥ భీమవేగయుతు లభీకు లా నవ్వారు వానివలనఁ గనిరి వారణంబుఁ
గాసవైరి వానిఁ గాలికావృతు భాను నట్టు లంధకార మలముకొనఁగ. ౩౦౨

క॥ తరముతరముగా శరములువరఁగి తనువు లొరయ విన్నబాటు గదుర నే
వెరవును దోపమి గమికొనిధరపైఁ బడి రార్తు లగుచు ధరణీధరజా! ౩౦౩

ఉ॥ అంతట రామలక్ష్మణుల సంతకసన్నిభుఁ డాశరుండు వి
భ్రాంతులఁ జేయుపొంటెఁ బ్రదరంబులు మేనుల నించి సించి యెం
దంతర మింత చొప్పడని యట్టు లొనర్చె రుషాక్తరక్తనే
త్రాంతుఁడ వై కడల్కొనెడు నార్పులు నేడ్పులు మి న్నగల్పఁగన్. ౩౦౪

క॥ క్షతమార్గంబుల రక్తస్రుతు లొప్పఁగఁ దత్తనువులు సొగయక సంపు
ష్పితకింశుకతరువులతో వితండ మొనరింపఁదొడరె విధిముఖవినుతా! ౩౦౫

క॥ భిన్నాంజనచయకల్పుఁడుద న్నదలో మెచ్చుకొనుచు దాశరథులతో
సన్నైర్ఋతుఁ డిట్లనెఁ గ్రుధఁబన్నిన తమమున నె డాఁగి పర్వేందుముఖీ. ౩౦౬

ఆ॥ యుద్ధ మిట్టు లోల మొంది యే నొసరింపశక్రుఁ డైన నల్ల చక్రధరుఁడ
నైనఁ జేర నేర రన మీరు నరు లెంతవారు స న్నెదిర్చి వలను నెఱప. ౩౦౭

క॥ ఈ మిస్మిరుపుర శరజాలామయసంగ్రస్తతనుల ననుతు జముని డా
సీమకుఁ దోడ్పడువా రెవ రామెయి విదళింతుఁ గ్రోతు లందఱ నొకటన్. ౩౦౮

క॥ అని రామలక్ష్మణుల వాఁడనిస ప్రసరించి ఘోర యగు శరసమితిన్
దనియక చొనిపెను మర్మములను ఛేదింపంగ మఱియు లాస్యోల్లాసా! ౩౦౯

క॥ కన్నత్తి చూడఁజాలనియున్నెటికిం గూర్చె వారి నసవద్యుల సం
పన్న స్వనవేషములనన్నియుతికి నియతి గలదె యఖిలవిన్యాత్రీ. ౩౧౦

ఆ॥ నస్వఁదొడరె నెడఁగు నటనము లొప్పసరించెనన్నదమ్ము లిట్టు లై రటంచు
పాడు వారి లవుని నగు ధ్వజమ్ములు ముక్తదానుకములు ప్రాలుదారిఁ సాల.

వ॥ అంతయు గ్రాహిచుండు నిరోధయుసయోను లగు నవీరవముల నెమ్మనులు శర
పేష్టితసర్వాంగంబులు పరమపీడితంబులు నై జలప్రస్రవణంబుల పోల్కి నస్ర
జాలంబుల స్రవింపం జేయుచునుడ నంగుళీమాత్రంబేనియు నంతరం బనరాక
యుపిద్ధంబును, సవిభిన్నంబును, నస్యంబును నగు తలం బని లేక వీకఁ సెడ
బంగరుపిడులు సితాగ్రంబులు, సుమార్గతంబులు నైన యాశుగంబుల నారాచం
బుల నర్ధనారాచంబుల భల్లంబుల సంజలికంబుల వత్సదంతంబుల సింహదంష్ట్రం
బుల క్షురంబులఁ జేతులతీఁట నొనసం బరవసంబునఁ బఱపి పఱపి గ్రొచ్చిగ్రొచ్చి
విదళించివిదళించి యీరెంటను మద్బాణాసనంబు లయ్యెం జుఁడీ. ము
న్నింద్రునిం గెల్చినది గెలుపు గా దిదియే పదిలం బైన యదియని ఘననిస్స్వన
సంవాదంబుగా సింహనాదంబు సేసిన. ౩౧౨

ఆ॥ తొలుత బాణతల్ప మొలసిన యన్నదుర్ధర్షు రాముఁ బూరుషర్షభుఁ దస
కన్ను లెత్తి చూచి గతిసెడి యేడ్చుచు నాస లెడలఁ దమ్ముఁ డవనిఁ బడియె.
చ॥ హరివరు లట్లు వీరశయ నాంతరసంగతులం గరస్ఫుర
త్ప్రరుచిరవిజ్యచాపుల నపాపులఁ గన్గొని కన్గొన ల్సెనల్
పరువిడ నశ్రుపాతములఁ బొల్పడఁ జేయఁ బ్రతప్తులై పొరిం
బొరి విలపించి రంబరము భూమియుఁ గాంచుచు మించు నెవ్వగన్. ౩౧౪
ఆ॥ వాఁడు విసువు లేక వర్షించి వర్షించి ఘనుఁడవోలె నొక్కగతి దలంచి
యుండఁగా విభీషణుండు సుగ్రీవుండుఁ జేరఁ బోటి రచటు సింహవాహా!. ౩౧౫
క॥ అందఱుఁ గనుఁగొని రసురుండెం దడఁగినవాఁడో యనుచు నెఱుఁగ రయిరి ని
ష్పందితు మాయాచ్ఛన్నుఁ గనందివిరె విభీషణుఁడు కనత్త్రప్రతిభన్. ౩౧౬
క॥ అప్రతిమకర్ము నాతనినప్రతిభటు నప్రతిక్రియావిష్టు నయ
శ్రీప్రవణుఁడు గనె మాయావప్రాంతరవస్థితు న్నివారితదురితా! ౩౧౭
ఆ॥ వాని వరము పూచి వఱలుట విక్రమం బసమ మగు టసమ్మస్యల్లు గనుట
వీరవరులు నేల వివశత నుంటయు నతఁడు తలఁచి తెగువ నందఁ డయ్యె. ౩౧౮
క॥ అంతట నే నెక్కటి సామంతుఁడ నైతి నని నిక్కి మఘవరిపుఁడు శ్రీ
మంతుల నవనిశయులఁ గనియింతిం తనరాని యరుస మెసలారంగన్. ౩౧౯
క॥ పరిపార్శ్వగతులు రాక్షసవరభటు లుప్పొంగ వారివల నరయుచు నె
ల్లరు విన నిట్లనెఁ దనదగుపరాక్రమము నెగడుభంగిఁ బాటలగంధీ!. ౩౨౦
సీ॥ కంటిరే దూషణు ఖరునిఁ జంపినవార లతిబలాఢ్యులు వీరె యన్నదమ్ము
లారామలక్ష్మణాహ్వయులు ధరాశయులై యున్నవారు నిరాశయులుగ
మద్బాణపాతము ల్మలయించె నిమ్మోయి బంధనమ్ముల వీడుపాటు గూర్పఁ
దెలియ రింద్రాదులు దివిజర్షు లసురులు మొనసిర యేనియు మొత్తములుగఁ
దండ్రి దేనికతన దరిలేని చింతతోఁ గడపు రేయి సెజ్జఁ గసఁడు పోయి
గలఁక లంక వాన కారున నేఱు నాఁ గాంచె నయ్యనర్థగతి తలంగ. ౩౨౧
క॥ ఈయందఱు విక్రమణములాయెన్ శరదంబుదముల యార్భటు లట్లే
పోయె న్నిష్ఫలములుగా నాయంబకములు గడల్కొనం జల మెడలన్. ౩౨౨
క॥ అని వారలతో నొడువుచుఘనదర్పుఁడు వాఁడు సర్వకపిసైన్యపులన్
మొనకొనె నిర్భేదింపఁగననితరశరముల స్మరప్రియార్చితచరణా!. ౩౨౩
సీ॥ నీలునిఁ దొమ్మిది వాలమ్ములం గ్రొచ్చి మైందద్వివిదుల సమ్మదము దకల
మూఁడు మూఁడులుఁగులు మొనయించి యలజాంబవంతుని నక్షమ్ము నగులనొకటి
పరఁగించి హనుమనిఁ బదిబాణముల నొంచి శరభు గవాక్షుని జంట జంట
తూఁపుల బడలించి యేపారు నంగదు ననుచు గోలాంగూలనాథు నట్లు

క॥ అని నీటం జేయిడి యాతని మేల్కొందోయిఁ దుడిచి తద్దయు జలము
ల్గొని విద్యామంత్రజపంబొనర్చి దృగ్గ్మార్జనప్రయోజన నెఱపెన్॥ ౩౩౬

ఆ॥ అట్లు మొగము నిమిరి యాధర్మమూర్తి ప్లవంగమాధినాథు వలను గాంచి
సంభ్రమం బడంచి సమయోచితంబుగా నిట్టులనియె మదగజేంద్రగమన! ౩౩౭

వ॥ కపిరాజేంద్రా! యియ్యది వైక్లబ్యంబు వలగొను కాలంబు గాదు సుమీ ప్రియసఖా! యియ్యకాలంబున నట్టి యతిస్నేహం బవలంబించినచో నదియుంగ ప్రాణావసానంబు నుపకల్పింపం జాలి యుండు నట్లుగావున సర్వారంభవినాశకరంబు లగు నకార్యకారణంబుల తెరువు విడనాడి ససైన్యు లగు నిమ్మాన్యులం హితంబునకై మంతనంబున ననుచింతింపుము. కాదేని నవ్వీరవరేణ్యు లిరువురుం బ్రబోధం బెనయునంతవట్టు వీరలం బరిపోషించుకొను జతనంబునఁ నుండుము. లబ్ధసంజ్ఞు లగు నీకాకుత్థ్సులే మనభయం బపనయింపంగలవారు. మాయాకల్పితం బీశస్త్రబంధంబు రాము నొండొక్కం డేమియుం జేయం జాలదు. గతాయువులకు దుర్లభ యగు లక్ష్మి యిమ్మహాత్ముని వదనంబు వదలక పొదలుచున్నయది. యింతయుం దలంచి నీకై నీ వూరటగొని బలంబు బోరిడిల్లఁ దెఱంగుపడుము తగినభంగి నే నెల్లకర్జంబులుం దిరిగి చక్కపఱు సంచరించువాఁడ హరివరేణ్యా! చూచితే యాహరివీరు లచటను నిప్పొంగనులం బిత్తరిచూపులు చూచుచుం బులకితాంగులై నిక్కువీనులతోఁ దిలుచుచిట్టక్కనినం దెరలుచు నొండొకండ్ల కర్ణప్రాంతంబుల మూతు లిడుచున్నవా రట్టట్టు దెల్లాడు నన్నుఁ గాంచి వీఁ డింద్రజిత్తై యను తలంపునం గొబ్బరిలు. త్వరపడుము సంజ్ఞాపనంబున నవ్వారి వారింపుము భుక్తపూర్వం బగు సుమహాల్యాంబుకరణిం బ్రాసం బెల్లరుఁ ద్యజింతురుగాత నింక సరుసం బొడఁగనుగొన్న మని యాతని నవ్వేరవున ముచ్చటల హెచ్చరించి యారాక్షసేంద్రుం డగు విభీషణుండు కాందిశీకం బగు ననీకంబు సమాశ్వాసింపం బ్రసక్తించుచుండె నయ్యవసరంబున. ౩౩౮

క॥ మాయావి మేఘనాదుఁడు పాయని కుతుకమున స్వీయబలంబుం గొని తా
నీయుఱవునఁ దండ్రి యొడయుమాయింపం జనియె లోకమాన్యచరిత్రా! ౩౩౯

ఆ॥ లంక సేరఁగాంచి లావరి వాఁడు సాశంకుఁడైన గుసుసి యుంకపాళి
నౌరయఁ దఱియ నరిగి యోర నెక్కొని మ్రొక్కి దోసిలొగ్గి ప్రీతిఁగొనుకఁ బలికె.

—♦ఇంద్రజిత్తు రావణునకుఁ దన పరాక్రమమును వెల్లడించుట.♦—

క॥ నీ విట్టులైతి వెవ్వరిభావంబునఁ జేర్చి యొండు పడయని మదితో
నా వెరవరు లిప్పుడు నాచేవంబడి రవని నింత సిద్ధం బధిపా. ౩౪౦

మ॥ అనునంతం దన యున్కి వీడి తనయుం హర్షోద్గతిం గౌఁగిలిం
చి నిమేషాతిగదృష్టి మేకొన ధృతి శ్రీ మించి శీర్షంబు మూ
ర్కొని నాయన్న! యలంచితే రిపుల నీకోపంబు చూపించితే
తనయాసృగ్యముఁ బెంచితే జగములం దార్కొనగా నిక్కటిన్. 3రగ

ఆ॥ అనుచుఁ బాలసుదిండు లందఱు విని పొంగ పేనివలనఁ గులము వెలసె నని పొ
సంగఁ బలికి యడిగి స్వవృత్తాంతంబు వార కతఁడు దెలుప నలనుగాంచి.

వ. హర్ష వేగానుగతాంతరాత్ముండై యమ్మహారథునిం బొగడి యుల్లసి పొగడుచు నా
శరనాథుండు దాశరథివలని సంజ్వరం బెడలి కడలి దాఁటితి నని యుబ్బుమైఁ
బ్రబ్బుకొనె నంత నచ్చట

ఉ॥ అంతలు సేసి రావణి యనంతరుఁడై చన నార్తులయ్యుఁ దా
రంతకుఁ జాలు మేలి భటు లంగదజాంబవదాదు లట్టు లా
భ్యంతరుఁ డంజనాత్మజుఁడు నందఱు నెక్కొనఁజేసి వారి సం
భ్రాంతతఁ బాపి రాజసుతగ్రక్షణమును బొనరించుచుండఁగన్.

క॥ సెరవారు శిలలు ద్రుమములు సరభసులై తాల్చి శృంగము చలియించిన నా
శరు లేగుదెంచి రని మొగ్గరము గరము దీర్చుకొను రకంబున నుండన్. 3రగ

తే॥ రావణుం డంత నంతఃపురమున కరుగుచుని సుతుని వీడి క్షితిసుత నరయుచున్న
రాక్షసస్త్రీలఁ బిలున బిరానఁ బనిచె సేవకజనంబులఁ బ్రహ్మస్థభాన మొప్ప.

ఆ॥ వార లేగి తెలుప వచ్చి రచ్చటికిఁ ద్రిజటయు మునొకసంగ శాసనమున
కగ్గ మైన వృత్తి నవ్వారు వారితో నిట్టు లనిరెమె రాక్షసేశ్వరుండు. 3రథ

ఉ॥ వింటిరె యింద్రజిత్తు నృగినీపతినూనులఁ గూల్చి వచ్చె నా
కంటక మూఁడె నిప్పటికి గాదిలితమ్ముని తోడ రాముఁ డా
పంటునలంతిపైఁ బడి విపాకము దోఁపఁగ నున్నవాఁ డి టే
మంటిరి నాక తెల్పుఁడు ధరాత్మజ కిత్తటి వర్తమానమున్. 3రఱ

ఆ॥ పుష్పకమున నునిచి పుణ్యబోఁడిఁ గొనిచనియానవీక నతని నరయు మనుఁడు
రామ సిచ్చు లెనని రాకఁ గోరుచు నన్ను లెక్క సేయకుండె నుక్కివమున. 3రగ

తే॥ నేఁడు కాలవశతోఁ పనీతు రామునతనితోడిద గతి యని నట్టి తమ్ముఁ
గని నిరాశ మై యొంటఁ గ్క గతియు లేకతనకుఁ దాన కా! నాహుపా త్తెనయకు నెన్న.

క॥ భగ్నాశంకయు ననముద్విగ్నయు నిరపేక్షయు నయి వెర వెంచి గుణా
భుగ్నన వాలంకృతిసంలగ్నమనోగతుల నన్ను లాలించు బలే, 3౧౧

ఆ॥ అనుచు మూర్ఖుఁ డాదురాత్ముండు రావణుఁడాదు లోటుకు లెంచి యటు లనన్ను
వార మనుచుఁ దరలి వరవిమానముఁగొనివచ్చి రయ్యశోక వనికఁ దటియు. 3౧౨

ఉ॥ దేవికి వార్తఁ గూర్చి యుప దేశ మొనర్చి లతాంగి భర్తృశో
కావిలఁ బుష్పకాఖ్యమున నల్లనఁ జేర్చి ప్రసక్తి దోఁపఁగా
భావిని యైన యా త్రిజట భామకుఁ దోడయి రాఁగ ద్యోగతిన్
ద్రోవక వార లయ్యెడకుఁ దోడ్కొనిపోయిరి స్త్రైణభూషణా! 3౯3

ఆ॥ వెఱ్ఱివాఁడొ మేలివెరవింత గలవాఁడొ కాని రావణుండు కలన లొప్ప
లంక నప్పుడపు డలంకరింపఁగఁ బంచె నెల్లయెడలఁ బడగ లెత్తుఁ డనియె.

క॥ మనయింద్రజిత్తుచే దురమున వినిహతు లైరి సుభట ముఖ్యులు రఘునం
దను లని పురమున నెల్లెడననువొందఁగఁ జాటఁబంపుఁ డనె సత్వరుఁ డై. 3౯౯

యుద్ధరంగమున ససైన్యబద్ధు లయిన రామలక్ష్మణులఁ గని సీత విచారపడుట.

తే॥ అట్లు గొంపోయి రణరంగమల్లఁ గాంచి సీత కెలఁగించి రాక్షస స్త్రీలు కీశ
సైన్యము నిపాతితం బైన జాడతోడ సొలసి రఘువీరు లొరఁగిన చోటు గూడ.

క॥ మునుకొని ప్రహృష్టమానసులను బిశితాశులను జూచె లలితాంగి ప్లవం
గనివహ మతిదుఃఖార్తంబనంతరం బరయఁగనె భయాకుల యగుచున్. 3౯౨

సీ॥ శరతల్పముల నడినన్న లేర్పడకుండ నొరఁగి చిత్తర్వు లట్లున్నవారి
ప్రేలిడ సందేడఁ గ్రాలు ముల్కుల శర సంభంబు లివి నాఁగఁ దనరువారిఁ
బుండరీకాక్షు లీపురుషులు స్కందనిశాఖు లం చనుటకుఁ జాలువారిఁ
బెందూళి గ్రమ్మినఁబృథుకాంతి మేల్బంతి వీడ కా సను భాతి నెలయువారి

తే॥ నమరతుల్యు స్వభర్తఁ దదనుజు లక్ష్మణాఖ్యుఁ గనుఁగొని బొమ్మపగిది కాఠినివగాని
యై వితర్కంబు నెఱయ నిట్లనియె సీత లోకనరాతి సుమంగళాంగి నసహిత.

క॥ కరుణము లగు నప్పలుకులఁ గడు కామునిపు లెట్లు దెలుపఁగా నేస్తురో యో
సుచరిత మూర్తీ! నీ వా తెఱఁగు నడిగిన నేను బ్రాచినిత్రిని ద్రాగ్ర్యయుత. 3౯౫

క॥ జ్ఞానులు లాక్షణికులు దన్నా నెఱిఁ బుత్రిణిరయు సుగళాంచితయు నగన్
మానిత యిది యని రవ్వానినొప్పవ నస్మృతపచనులే యైనొక్కో. 3౦౦

ఆ॥ యజ్వమహిషి యిది మహాసత్రికి సుపత్ని యానిరి లక్షణంబు లూని నన్నుఁ
గూర్చి యంత లేసి కోవిదు లట్టివా రస్మృతివాదు లైరె యాకట నడుమ. 3౦౧

ఆ॥ నాసవిత్రి మోల నాసంశ్రవణమునస్మితదృగాద లోలయు సిరులనవధి
యిది శుభాత్మ యంచు నెల్లకార్తాంతికులాడి రదియు మిథ్యయనఁగవలసె.

తే॥ వీరపార్థివపత్నివి వీరజనని వట్లు నిశ్వేలవిభవ పీ వౌదు వనుచు
మునులు దీవించి రమ్మోయి ముచ్చటలకు గతి యొకం డున్నె విభుఁ డిట్లుగూలిపడిన.

క॥ నాపదముల నీపద్మములీపగిది న్వెలయుచుండ నేపాపం బీ
యాపదఁ గూర్చెం బతితో దీపింపదె యిట్టి సతి ప్రథితరాజ్యమునన్. 3౦౮

ఆ॥ విధిన లోఁడు రెట్టి వికృతచిహ్నంబుల నింతు లట్టి పోఁగు లియ్యెడలునఁ
బడయనేర నెంత వరికించియును మేలి లక్షణములె నిష్ఫలంబులయ్యె. ౩౬౫
సీ॥ తస్యనాసికతిలపద్మసుములు మత్స్యసములు సమనీలసూక్ష్మలక్ష్మములు కురులు
కలియుఁబ్రామలు జంఘ లరోమశములు వృత్తము లవిరళ నాస దంతిపంక్తి
శంఖము ల్నేత్రాసము లుద్యమములు చరణమ్ము లూరువుల్ గుల్ఫమ్ము లుపచితములు
స్నిగ్ధంబు లనువృత్త శిఖనఖసముముల యంగుళు లెపయుమ పీనకుచంబు గంబు
మగ్నమామాకము నిమగ్న యుత్సంగిని నాభిచితము లురము ననుచు వెలఁదు
లధిమణిప్రభంబ గానా మేని నగ్న ముల్లంగ స్హాము లెన్న సామ్యహావులు.
క॥ అడుగు లటు ప్రేఘ్న ధరన్పైనెపం లేక ప్రతిష్ఠితత్వ మీమాప న్నెంచుచు
బడయును సడయదె యిన్నెఱిపడఁగుక యెందుం బ్రతిష్ఠ భవ్యాత్మిక యై.
ఆ॥ అలరు పాణిపాద మరుణవర్ణంబు సమగ్రయునవపవం బనంతరాశి
మిదియె రాజ్యలక్ష్మి యెల్లసామ్రాజ్యమ్ము నేలఁజాలు భర్త నెనయు ననిరి.
క॥ నాచెలుసవ్వ మొగముఁ గనియాచతురులు పలికి రిట్టి యంగన పతితోఁ
సాచివ్య మొప్ప సకలశుభోచితరాజ్యాభిషేక మొలయు నటంచున్. ౩౬౯
ఆ॥ నాతలంచినవియు ననుచు పెద్ద లెఱింగి పలికినవియు వ్యర్థభావ మెసనె
నేమి గలదో దీని కింక నపూర్వ మౌ కర్మ మెంచిచూడఁ గానఁబడదు. ౩౭౦
క॥ ముప్పాలము లెత్తివచ్చినదప్పక గెలుపుసిరిఁ గొనఁగఁ దానల మటు దా
నప్పాటం బడియుండఁగ నిప్పగిదిం గాంచుచుంటి నే మానితనే. ౩౭౧
క॥ ఆనెవ్వగ లెగయ జనస్థానము శోధించి వార్తఁ దడవి యనుతరం
బౌ నీరధి సాధించి యహీనులు గోష్పదము నంది యిట్లు పడుదు రే. ౩౭౨
ఆ॥ అల్ల బ్రహ్మశీర్ష మాగ్నేయవాయవ్య వారుణమ్ము లైంద్రదనరశరమ్ము
మున్న గాఁగఁ బెరసి రన్నదమ్ము లమోఘ పాతకృతుల వీరి పాల నవియు.
ఉ॥ మాయలమారి వాఁడు మఱు మాయ మొఱంగి తొలంగి యప్పుడే
మాయెనొ వాసన్రాపముల నన్నను దమ్ముని నిట్లు సేసెఁ గా
కేమెల పెట్టి యైన నిల నెంచిననో విదలించి యైన రే
పాయక కాలదండమును బట్టిన పట్టినయేని నాజిలోన్. ౩౭౪
క॥ మన్నాథు దృష్టిపథమునఁబన్నిన రిపుఁ డెట్టులేని బ్రదికిచనంబోఁ
డెన్నఁగ రాని మనోజవమున్న ప్రణరంగమున మహోగ్రుఁడ యైనన్. ౩౭౫
ఆ॥ కాలయమునకు లేదు గద భార మాకృతాంతుండు దలఁప నెంతు మర్దయుండు
గాక యున్నఁ బోర ఘనుఁడు రాముఁ డిట్లు వడునె యొకనిచేత భ్రాతతోడ. ౩౭౬
ఉ॥ నావతి కంతగా వగవ నాథుని సోదరు లక్ష్మణాఖ్యుని
ప్పావుచిఁ గూర్చు యట్లుడలఁ బావని దల్లిఁ దలంప నాదుమే

నీపగిది న్నశించు నని యెన్నఁ దపస్వివి యైన యత్త బి
ట్టూపెడు వంతపా లగుట కుమ్మలికమ్మున గ్రుగ్గిపోయెదన్. 3౪౮

తే॥ తలఁచుచుండు నాదు దైవతం బాయను తన్నుఁగూర్చిపోడఁ దరుణిపోడ
రాముఁ డెప్పు డెపుడు రాఁగలవాఁడోకో వ్రతము పరిసమాప్తి వచ్చు ననుచు.

క॥ ఎవ్వారి కేమి యున్నది మవ్వము సెడఁ బడిన వీరు మఱి యెట్లెట్లో
నొవ్వేద బ్రదుకుఁగాంచెడునవ్విధమే లేదయేని నాదటి సొదలోన్. 3౪౯

ఆ॥ సీత నాఁడె చనియె శ్రీరాము నెడఁబాసియువిద యొంగుచోట నుండు నదియె
యన్ని కష్టదశల ననుభవింపఁగఁ దోఁచినట్టి దీపిసాచి యనఁగరాదె. 3౫౦

తే॥ అనుమఁ డటు దెల్పి చనిన యీ యంతరమున నాన బాధించె దాన నిట్లనద సైతిఁ
గాక రక్కసిచేపడ్డ కాలమున నెమేను బాయని దీజంత మేలు గనునె. 3౫౧

ఆ॥ తీఱె ఋణము నాకు దేవున కద్దారిమాయదారిమెకము మలసినంత
రామ! రామ! యంచు రహి జపించుచునుంటి మై దొలఁగ కేమి మబ్బు పడెనో.

క॥ అనుచు విలపించు నాయమఁగని త్రిజటాభిఖ్య యెఱుకఁ గన్నకలనతోఁ
దన నిరతి సెడని యాధృతిమనమున నిద్దంపుఁ గరుణ మలసి నెరయఁగన్. 3౫3

ఆ॥ కనుల నీరు దుడిచి కల్యాణి! నీ విట్లు వగలఁ బొగులనగునె వాసిసెడదె
నీదుభర్త బ్రదుకు నెఱిఁగాంచియున్నాఁడునాదు పలుకు లరసి నయము గనుము.

ఆ॥ తగినకారణములు తరుణి! యే వచియించునవి మహత్తరము లనంతరములు
రామలక్ష్మణులు విరామమ్ము లే కింక మేలుకాంత్రు మేలుపాలు గొనుము.

—♦ త్రిజట రామలక్ష్మణులు బ్రదికియుంటకు తగు కారణము లెఱిఁగించుట ♦—

క॥ తమపతి మడిసిన యోధులు సుముఖతఁ గాంచుదురె దెసలు చూడఁజనరె బీ
రము సారము నెలకొలిపెడునమర్షపుండెఱఁగు మెఱయ నట్లు నిలుతురే 3౫౬

మ॥ కలదమ్మా! నిహతప్రధాన యయినం గాలూన కాసేన దా
జలధి న్నిర్గతకర్ణ నౌకయటు లోజం బాయనౌఁగాక యా
చలము న్వీడక తొంటిచందమున నౌజ్జ్వల్యంబు పెంపార మే
ల్కలన న్నెక్కొనుచుండ నొడ్లఁబొదువం గార్కొంట మార్కొంటయున్. 3౫౮

క॥ సేనఁ గనుఁగొంటె యెమ్మెయి నీనాథునిఁగాచుకొనుచు నెఱి నున్నదియో
చాన! యసంభ్రమతాధృతులూని ప్రవర్తించు దాని యురవల్పంబే. 3౫౫

ఆ॥ పుష్పకాఖ్య మిది సుపూజ్యంబు దివ్యంబునగు విమాన మట్టు లైనవారి
నువిద ! మోఁచిచనఁగ నొల్ల దియ్యానవా లంది కల్లనిజము లరసికొనుము.

తే॥ ఏను బ్రీతి నివేదించుదాన సదనుమానములు నానుడులు నమ్మి మనుము మేలు
గాంతు వెల్లవిధముల నీకాంతుఁడే జయించు నింతయు నీమది నెంచు మెలమి.

ఆ॥ అన్నులార నేను నోడువనమ్మ! యోనాఁడు నుదర్శనంబు లొరసి తక్క మరసి
పలుకుచాన నాను భావ మొందఁదలఁచి చారిత్రశీలముల బవిత్రనగుట. 3౯౧
క॥ సురలసురులేక సంహారమును సత్వరనటులు దొసఁగొందరు నా
వరు వరము నగవు నవ్వగ నురవడఁగినవారి లట్లు లుచ్ఛాగనుమా! 3౯౨
సీ॥ సన్న లేకున్న నీసంజ్ఞానమూర్తు లిట్లుండను లక్ష్మి తమ్ములసియుండ
గతసత్త్వజీవితు లగ్గగి వారల మోములందు వైకృత మప్పుడుండఁగోఁచుఁ
దమ్ము మాయావి శరమ్ములు గ్రమ్మిన నివారవ్రాయెను తీరు సెలపినారు
మూర్ఛితు లివ్వారు మొనయఁబోవుచునున్నవారు నెట్టనఁ దనరారు తెలివి
శోకమోహంబు లెడలి త్రిసద్ధ వగుచునిష్టదేవత భావింపు నుల్లగతుల
మేలుగాంచెద వొండెదఁ బోల దింకసుదతి నాపల్కుఁబడి మేల్మి చూచికొనుము.
క॥ అనునంతం బ్రాంజలి యైయనుపమగుణశీల బాల యఘగావృత మ
ట్లనవద్యము నీస్నేహముమనిచితి సఖి యనియె నిత్యమహోత్సోల్లాసా 3౯౪
ఉ॥ గీష్పతి శిష్యురా లనఁగఁ గీర్తిత యాత్రిజటాఖ్య యంతఁ దాఁ
బుష్పకము న్మరల్చుకొని భూసుతఁ జేర్చి నశోకసీమ న
బ్బాష్పపినద్ధనేత్ర నెరిఁ బాపె నలంతలు వాయు నింకిటన్
గోష్పద మౌను రామునకుఁ గోమలి! యీదుర నుంచుఁ దెల్పుచున్. 3౯౫
ఆ॥ రావణాజ్ఞ మెయిని రాక్షసీజనము మున్నెట్టు లట్లు సీత నెనసి నిలిచె
విభుని కుశల మెపుడు విందునో యనుచు నద్దేవి చిత్త మెరియఁ దిప్పురుండె.
మ॥ శరబంధం బతిఘోర మ ట్లునసి భూశయ్యాశయాను ల్మహీ
శ్వరపుత్రు ల్రుధిరోక్షితు ల్తతరజస్సంఛన్నదేహు ల్ఫణీ
శ్వరసామాన్యతదోఁప బున్న లిడుచుం బన్నుండ సుగ్రీవుఁడుం
బరివారంబును గొల్చియుండిరి మహాప్రస్తార మొప్పారఁగన్ 3౯౬
ఆ॥ శోకదీర్ణమానసుల యయ్యు నవ్వా నుదీర్ణకోషు లగుచు దెసలు గనుచు
నోగులఁ గలఁచు నిర్ణయోద్వృత్తి నుండిరి దైవసాహ్య మొదవు తఱిఁ దలంచి.

—♦ రాముఁడు తెలివొంది లక్ష్మణుఁ గూర్చి శోకించుట ♦—

క॥ అంతట మేల్కాంచె వారల సంతాపము దీర రామచంద్రుఁడు శరబం
ధాంతరితుఁ డయ్యు బీర మనంతము సత్త్వమును నిజమహత్త్వముఁ దెలుపన్.
ఆ॥ మేలుకొనియుఁ దనకు మేలు కోరఁ డదేమి వత్సలతమొ సుప్తనాఁడు దమ్ముఁ
డటులె వ్రాలియుండె నన్నుగుప్తుఁడు క్షితి దీనుఁ డగుచు ననుచుఁ దెలియఁగాంచి.
సీ॥ సీతతోఁ బని యేమి జీవితం బింకేల వీఁ డిట్లు పడియుండ వెరవు గలదె
న్యాజఁ బోలిన సతి సాంపరాయికసఖుఁ డిట్టి తమ్ముఁడు నెందు నేని లేడు

క॥ అనుచుండ నావిభీషణుఁ డనుపమగుణుఁ డగుచు పేర హరిరాజని చెం
నని జాంబవంతుపిం గని ఘనబలమున కింత దెలిపి మలయుంపు మనఁగన్. ౨౦౯
ఆ॥ ఆతఁ డరిగి యిట్టులాడు కే మన విభీషణునిఁ గాంచి యనుమఁ జనెడు వాఁగి
నాఁగి యందఱకు నయం బొప్పఁ దెలిపినఁ దిరిగి వారలెల్లఁ దెలిసికొనిరి. ౨౧౦

—♦ విభీషణ విచారము ♦

ఉ॥ సన్నుతుఁ డౌ విభీషణుఁడు సంభ్రమ మొప్పఁగ రాము లక్ష్మణున్
సన్నుతుఁ డై కనుంగొని విచారము దోఁపఁగ నిమ్మహాత్ము లీ
పన్నగబాణబంధముల పాల్పడి రెట్లు విముక్తిఁ గాంతు రం
చెన్నుచు శోకపూరహతి నిట్టటు లై మది చెట్ట దేలఁగాన్. ౨౧౧
తే. హస్తము జలార్ద్రి మొనరించి యారఘూద్వ
హుల నయనయుగ్మముల నెయ్య మొప్పఁ దుడిచి
యధికతరశోకసంపీడితాత్ముఁ డగుచు
నతఁడు విలపించె నప్పు డోయలరుఁబోఁడి! ౨౧౨
ఆ॥ కూటయోధు లైన కూళలు రక్కసు ల్పొంచి యియ్యవస్థఁ బంచి యిడిరి
సాంయుగీను లధికసత్త్వులు సద్ధర్మపరులు నైన యట్టి నరవరులకు. ౨౧౩
ఉ॥ అన్నకుఁ బుత్రుఁ డీతఁ డన నయ్యెను బెద్దల పేరువాప య
న్నన్న కుపుత్రుఁ డట్టి జను లౌ నన రక్కసబుద్ధి నిట్టు లీ
యన్నలఁ ద్రోఁచె నార్జవ మయమ్ము నయమ్మును గల్గువారి నే
మన్నను బోల దిందఱను నైతి మనాథుల యట్లు లీకృతిన్. ౨౧౪
ఆ॥ శరశతముల వీరు సంవిద్ధు లై వీరు లస్రసిక్తు లగుచు నవనిఁ దెరలి
శల్యకముల యట్లు సందృశ్యమాను లై యున్నవార లింక నొకటి గలదె. ౨౧౫
ఉ॥ ఎవ్వరి వీర్య మూతఁగొని యేను ప్రతిష్ఠఁ గొనంగ నౌదు సం
చవ్వరదార్ఢ్య మొప్ప ననయంబు నయంబున మించినాఁడనో
యవ్వసుధాధినాథులు మహాత్ములు రిత్తకు రిత్త ముష్కరు
ల్నవ్వఁగ నెవ్వగంబడి యనాథులపోలెఁ బరుండి రేమనన్. ౨౧౬
ఆ॥ ఏను బ్రదికి బ్రదుకు లేనివాఁడను నష్టనిఖిలతర్షహర్షనిశ్చయుఁడను
నైతి నాసపత్నుఁ డైన రావణుఁ డఖిలార్థకామనిరతుఁ డయ్యె నిపుడు. ౨౧౭
క॥ అని వగచునతని హరిపతి గొని పరిరంభణ మొనర్చి కోవిదుఁడవు నీ
వనఘ! యిటు లాడె యింతకుమును దెలిపితి గాదె నాదు మోహం బెడలన్.
ఆ॥ సందియంబు లేదు సకలధర్మజ్ఞుండ వందువాఁడ వీవ యఖిలరాక్ష
సాధిరాజ్యపదము నగు లంకయు సనాథయగుల కోర్కి పార మరయఁబోదు.

తే॥ ఆత్మయిక మొందువారు గారన్నదమ్ములీమహాత్ములు మోహ మిచ్చెడదొలంగి
రణమున నధింద్రజిత్తు సగణు రావణు నటంచు క్రదికరణవిశుద్ధి తగ నీవు తెలిసికొనుము.

క॥ అను సాంత్వనమున నాతని ననువొప్పం దేర్చి శ్వశురు సఖిలజ్ఞు సుషే
ణునిఁ గనుఁగొని యిట్లనె సయ్యనతనయుఁడు ప్రాభవం బనిద్భృశ మొలయన్.

ఉ॥ విక్రమవంతు లైన హరివీరులు గొందఱు తోడరా దొరల్
సక్రమలబ్ధసంజ్ఞులగు జాడకుఁ దోడ్పడ నోపి నీదు తైత్రి
విక్రమలీల గ్రాల మనవీటికి వీరలఁ గొంచుఁబొమ్ము నే
శక్రవిరోధిఁ జంపి సిరి చొప్పన మైథిలి రాముఁ జేర్చెదన్. ౪౨౨

క॥ అని తెలిపినఁ గర్జము తెఱఁగనుపద మతఁ డెంచి యిట్టు లనె నాతనితో
ననఘా! యిక్కాలం బేననుమానించిన విశేష మభివర్ణింతున్. ౪౨౩

సీ॥ తొల్లి దేవాసురు ల్తొడరి పోరంగఁ బో రతిఘోరతరమునా నడరుచుండ
వేల్పుల బహుశస్త్రవేత్తలు దానవు లొరసి యాయువుపట్టు లురలఁ జేయ
నాబృహస్పతి వారి నరసి యార్తుల హతసంజ్ఞుల నిహతులఁ జక్కఁబఱుప
సన్మంత్రవిద్య లోషధు లుపాధులు గాఁగ వర్తించె నెప్పటివలను మలయ
గెలుపు గాంచి సురలు వెలయు నయ్యావి యెల్ల క్షీరసాగరంబు జెనయుచంద్ర
మట్లు ద్రోణసంజ్ఞ మగు గట్టుపట్టునందునిచి రాత్మనీన లని యెఱింగి. ౪౨౪

తే॥ అమృత మొదవిన యెంకియు నదియకాన నోషధిప్రకరం బందె యుండు నెపుడు
సరణి సంజీవకరణి విశల్యకరణి ముఖ్యములు వానిలోన నిమ్ములు ఘటింప.

క॥ అవి గొని తేరఁగ నిపుడే జవమున నరుగనగువారు సంపాతిముఖుల్
ప్రవరుం డందఱిలోపల నవిహతగతి వాయుసూతి యమ్మెయిధృతికిన్. ౪౨౬

క॥ అన విభుఁ డానతి సేసిన హనుమానుఁడు వల్లె యని ప్రయాణ మొనర్చెన్
జనితానందంబున నొడ్లును నే మే మనిరి ధర్మలోలమనీషా ! ౪౨౭

వ॥ అట్టియెడ. ౪౨౮

—◆ గ రు డా గ మ న ము ◆—

సీ॥ మెఱుఁగుఁదీఁగెలతోడి మేఘబృందంబులు దెరలి దిక్కులకు బోదెలు వానర్ప
నబ్ధిలో రసపూర మట్టిట్టు లై యిలపైఁ జల్లుపోరాటఁ బరఁగఁ జేయ
మేదిని పొదలు నమ్మెయికిఁ దజ్జములు మహాద్రుమములు సంద్రమందు ప్రవాల
స్థలజలజంతువు ల్సంభ్రమపడి యంతరాంతరం బెనసి యందడఁగి చనఁగ
నాకముహూర్తమున నె యుద్భవిల్లిన యట్టు లరుగుదెంచె వినత వరతనూజుఁ
డెల్లవాన రేంద్రు లిది యుజ్జ్వలాగ్ని తేజం బనంగ గరుఁడుఁ డంబరమున. ౪౨౯

ఉ॥ బంగరుటెక్క లగ్నిశిఖభాతి వెలుంగుల నీను మేను ప్రశ
స్త్యాంగమయంబు లంగము లహర్పతితేజము వాయువేగ ము
ప్పొంగెడు శీతరశ్మిరుచి పోడిమి మెచ్చని మోము సత్కృపా
పాంగతరంగితేక్షలు మహాత్ముని తార్క్ష్యుడితండె చూడ సనక్. ౪౩౦

ఆ॥ తటియవచ్చువాని తత్త్వ మూరసెనేమొ యుత్ప్రభాన మెసని యూపునాగ
బద్ధులం బొనర్చి పరంగెడు ఘణు లెల్ల విద్రుతంబు లయ్యె విస్వజుసుసి ! ౪౩౧

క॥ ఆమాయలెల్ల నాయెడ నేమాయెనొ కానఁబడక యెడసెం దడసి రా
నేమో యామెయిపురుషుండామాయం దలంప నజునకైనం దరిమే. ౪౩౨

మ॥ అభినందించె సువర్ణుఁ డాఘనుల నొయ్యం జేరి వా రిట్లు ప్ర
త్యభినందించిరి వాని నాతఁ డమృత వ్యానద్ధహస్తద్వయిన్
విభు లవ్వారల మోముల న్నిమిరె నున్నిద్రేక్షము ల్చంద్రస
న్నిభము ల్లక్షణ ముల్లసిల్లె నవి శ్రీనిర్వేలలీలాచితిన్. ౪౩౩

తే॥ వైనతేయకరోపసంస్పర్శమునను వ్రణము లన్నియుఁ బూడె సువర్ణము లయి
యట్లు సుస్నిగ్ధములు నయి యనుపదంబె మేను లొప్పారె మేనకో స్నిలదుదయ !

క॥ తేజము వీర్యము బల మట్లోజం బుత్సాహమహిమ మురుదర్శనమున్
బూజితధీస్మృతిధృతులును నోజ న్వారలదెస ద్విగుణీకృతము లయ్యెన్ ౪౩౫

ఆ॥ మహితవాసవోపమానుల నమ్మెయి మేలుకొలిపి వాఁడు మేలుగోరి
యెలమిఁ గౌఁగిలించె హృష్టాత్ములై వారుఁ దన్ను నలముకొనఁగఁ దరళనయన!

క॥ సకలజగదేకకల్యాణకలాసంపాదనప్రణయిసంభవుఁ డా
యకలంకమూర్తి రాముఁడు వికిరేంద్రునిఁ గాంచి ప్రీతి వెలయఁగఁ బలికెన్.

సీ॥ తాత నీదగు ప్రసాదంబున రావణిప్రభవంబు వ్యసనంబుఁ బాయఁద్రోచి
పూర్వవద్బలకలాపూర్ణుల మైతి మట్లఖిలసేనయుఁ గాంచె నభ్యుదయము
మాతండ్రి దశరథు మాపితామహు నజుఁ జూచినట్టులె చొక్కెఁ జూడ్కి మరియు
వరరూపుఁడవు దివ్యవస్త్రస్రగనులేపనుఁడవు పూజ్యాంగ వెవ్వఁడవు నీవు
దెలుపుమయ్య యిట్టి తేజం బసామాన్యమెల్లభువనముల వహింపఁజాలి
యున్నయది మదీయ మోజంబుఁ బెనుప నైయెనసె నాదు సుకృత మెంతగలదొ.

—♦ గరుడకృతరామస్తుతి ♦—

క॥ అని యడిగిన నమ్మాయామనుజునిఁ గని కనుగొలుగుల మహితానందా
శ్రునివహ మెలమిం బేర్కొన ననియె మహామహుఁ డతం డహార్యవరసుతా!

క॥ నీకింకరులమ యిందఱమో కరుణానీరధీ రసోజ్జ్వలమూర్తీ!
యేకరణిఁ దెలుపువారము లోకాలోకమున నీ వలోకుఁడ వడుగన్. ౪౪౦

ఆ॥ బ్రహ్మదత్తవరముఁ బాటించి యసురునకోహటించి యెఱిఁగి యుంటి వీవు
బ్రహ్మ యేమిసేయుఁ బాములా బంధించునవియు శేషశాయి వైన నిన్ను. ౨౨౧
తే॥ వైనతేయుండ గరుడుండ వలనెఱింగివచ్చినాఁడ నీదగుకూర్మి హెచ్చినాఁడఁ
బరఁగినాఁడను గాదె నా బాహిరంబుప్రాణ మనుచు నీ వెన్నంగ భద్రమూర్తి!
ఆ॥ మాయికంబు దీని మాయింప నెనసితి నీయుపేక్షసేయు నెఱి నెఱింగి
యిది సురాసురులకు నింద్రున కేనియుఁబాపరాని దస్త్రబంధనంబు. ౨౨౩
క॥ మాయాబలమున వరకృతమై యెలసిన చలమునను మహాసురుఁ డిమ్మై
నోయసురారీ! పఱపెనుదాయతనము దనరఁ దద్విధప్రదరములన్. ౨౨౪
సీ॥ నీసత్త్వమునకల్మి నిలిచితి నిలిపితి నీవు దమ్మునితోడ నింతసేనఁ
బదనుకోఱలు విషోల్బణము లౌ క్షాద్రవేయములె యిన్నియు మాఱె నస్త్రములుగ
నధిరౌద్ర మట్లు బ్రహ్మాస్త్రంబు జతపడె ధర్మజ్ఞుఁడవ యయ్యుఁ దవులుకొంటి
విద్దాన నోడ్డైన నింతకుమున్నె భస్మీభూతు లైపోరె మెలఁగువారె
సత్యవిక్రముఁడవు సర్వాత్ముఁడవు సభాగ్యుఁడవు నీవు గోరుకొనినయట్టు
లెవ్వియును ఫలించు నిద్ధతేజుఁడవ కానెన్నియును నడంగు నింత నిజము. ౨౨౫
క॥ త్వరపడి యరుదెంచితి స్నేహారమాకృష్టి స్వకృత్య మనుపాలింపన్
గరముఁ బొనరారె నయ్యాది కరముద్రాపితము త్వత్ప్రకాశ మెసంగన్. ౨౨౬
శా॥ కాని మ్మింతటివార లంచు రిపులం గాఱింప నా నార్జవం
బే నమ్మం దఱి నాఁ బ్రమాద మొగి నిట్లే కూటయోధు ల్సురా
రీను ల్జిహ్మలు పాపు లం చరయ నూహింపంగ నాఁ దంద్రి! నీ
కేనా తెల్పెదువాఁడ నీదగు తలం పె ట్టట్టు వర్తింపవే. ౨౨౭
ఆ॥ నీకు శత్రులందు నెఱయు వాత్సల్యంబు ధర్మవందుఁ దవులు తఱుగ కుండు
నిట్టి యెల్లలోక మెలయింపఁ బొడసూపితదియు స్మృతిహితంబ యగుటకతన.
క॥ అనుచుఁ బునఃపునరాలింగనముం బొనరించి రామ! ఘన మీభాగ్యం
బెనయందర మే నీ విదియనుమోదించినదె యనఁగ నై యొప్పనిచోన్. ౨౨౯
తే॥ అనుగుఁజెలికానిఁగాఁగ న న్ననవరతముఁబోలఁగా నేలుకొంటివి పొడవుసేసి
దొరసె సద్దాస నింతకుతూహలంబు సఖ్య మట్టిద యౌఁ గాదె జగతిలోన.
మ॥ సెల వి మ్మోరఘునాథ! యాశ్రితమహాశ్రీప్రాపకా! యుద్ధసం
కలనం బంతయుఁ దీర్చి రాక్షసవిభుం గార్చిచ్చులంబోని య
మ్ములఁ బోకార్చి సబాలవృద్ధ మగు నిమ్మ న్వాని తమ్ముండు నీ
చెలిమిం జేకొన సీతతోఁ దనరు ని న్సేవింపఁగావచ్చెదన్. ౨౩౧
క॥ అని యడిగి రాముఁ డనుమతిఁ బొనరింపఁ గపు ల్నుతింపఁ బొరిఁబొరి వినతు
ల్మొనయించి ప్రదక్షిణవిధిననఘుం డతఁ డరిగెఁ బవనున ట్లభ్రగతిన్. ౨౩౨

క॥ రుజఁబాసి తీరుఁగాంచినవిజితర్వరుల నారఘుప్రవీరులఁ గని వా
యుజముఖులు యూథనాథులునిజముత్సాహంబుఁ బెనుప నెలకొని రంత౯.

—◆ నాగబంధముక్తు లగు రామలక్ష్మణులఁ గని కపు లుత్సహించుట ◆—

సీ॥ తోఁకలెత్తి విదుర్పఁ దొడఁగెడు వా రట్లు సింహనాదంబులు సేయువారు
భేరీస్వనంబులు బెరయింప నౌ వారు తతమృదంగధ్వను ల్దార్చువారు
శంఖము ల్గొంచు నిశ్శంకఁ బూరించువా రాస్ఫోటన లొనర్చి యలరువారు
ద్రుమము లుత్పాటించి తోడ్తోడ నడరువా రగములఁ బెకలించి యెగయువారు
రక్కసుల బెదరించుచు రాముజయముఁ బేర్కొనుచు బాటలాటలు దర్కి మొలయ
నెఱపువారును నై కపు లతిమి రపుడు లంక వాకిళ్ళనెల్లఁ గలానిధాన! ౪౯౪
ఆ॥ అట్టు లానిశీథమం దమందమ్ములు భీషణమ్ము లైన ఘోషణములు
మొనసి యొక్కఁడై తుములమై నిదాఘాత్యయము మొగిళ్ళ నాదమై యెసంగె.
క॥ ఆయుత్సాహముఁ బొగడఁగ వేయుమొగంబులుగలట్టి వెరవరి కగునే
మో యొక్కని కగు నసఁగా నాయుల్లము మెచ్చఁబోదు నగరాజసుతా! ౪౯౬
ఆ॥ అనుచు మేలివార్త నభవుం డెఱింగింప విని భవాని దేవ! ననుచురీతిఁ
దెలిపినాఁడ వింకఁ దేటతెల్లము సేయు మవలి దగు గథాంశ మనుచు వేఁడ.
శా॥ మాయాతీతగుణోపలక్షితమహామాయాధిసంస్థాన! చి
చ్ఛాయాసంశ్రయసర్వలోకనిచయస్వాతంత్ర్యసామ్రాజ్య! వి
ద్యాయోగప్రసితానుభావ్య!యనవద్యా!స్వప్రకాశా!శ్రుతా
మేయానందరసస్వభావసదయోన్మీలత్ప్రభావాంచితా! ౪౯౭
క॥ అమ్నాయలక్ష్యసారసమామ్నాతకలాసమగ్ర! యఖిలజ్ఞా! ప్ర
ద్యుమ్నప్రాభవసంజ్ఞిక నిమ్నగతోద్ధరణశీలనిజసంస్మరణా! ౪౯౮
మాలిని॥ నిరవధికవిలాసా నిత్యసంపన్నివాసా! నిరసితగుణదోషా నిస్తులశ్రీవిశేషా!
విరచితబహురూపా విశ్వవిజ్ఞానదీపా! విగహితభవపాశా వేదమార్గప్రకాశా!

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబున
యుద్ధకాండంబు పూర్వభాగంబునం
బంచమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయ గురవే నమః.

# శ్రీరామకథామృతము

## యుద్ధకాండము.

### పూర్వభాగము.

### షష్ఠాశ్వాసము.



శ్రీమహిత ధర్మయోగ
క్షేమంకరచరణ! భక్తచింతామణి! తే
జోమండలాంతరుద్యత
కామాద్యరివర్గ నికృతి ఖండన నిపుణా!

తే॥ అవధరింపుము భక్తచిత్తానుషంగుఁ డంగజారాతి యిట్లనె నగజతోడ
రామసేన నిరత్యయభ్రాజమాన సరభసోత్సాహయాన యా సమయమునను. ౧

—♦రామసేనల యుత్సాహమును విని రావణుఁడు చారులఁ బంపుట.♦—

ఆ॥ చదురుసేసి తనదు సచివులు గొల్వఁగా నుండి దేవకంటకుండు వినియె
మానినెుకము లాఱిమల్లులు బలియురు నింగి వగులఁ దార్చు నెఱయుఱుములు.

క॥ విని యెల్లరఁ గనుఁగొని యి ట్లనె రక్కసిమన్నెకాఁ డయత్నపరిభవం
బనితర మియ్యది పగతుఱయనుత్తమపీతిఁ దెలుపన య్యెడుఁ దలఁపన్. ౩

ఉ॥ అద్దమరేయి మిన్నగల నార్తురె మార్తురు కల్పకాలమం
దుద్దవిడి న్మొగి ళ్లఱచునోజ బయల్పడ సంద్రమిత్తఱిన్
దద్దయు క్షోభముం బెరసె దాశరథు ల్శరపాశబద్ధులై
మొద్దులభంగి ద్రోవపడిరి మోస మిదేమొ యెఱుంగ మింతకున్. ౪

ఆ॥ ఇట్టి పెద్దమ్రోఁత లిప్పట్టునం బుట్టు వెనసి నాదుచేని మొనయఁగాంచి
కలుగరానిశంకఁ గలిగించె నవ్వారు మడిసి మరలఁ బ్రిదికి మలసి రనుచు. ౬
క॥ అని పరిసరపరివర్తులఁగని వైళమె చని కృంశిపఁగా నగు వేళన్
బనుపడిన హర్షకారణ మనాప్తతతిదెస నెఱింగి యరుదెండనినన్. ౭
తే॥ వారు సంభ్రాంతు లగుచుఁ బ్రాకారమెక్కి యినతనూజసురక్షిత నిర్థతేజఁ
గాంచి రాసేన నట్లు మేల్కాంచి మెలఁగు త్యక్తఘోరాస్త్రబంధుల దాశరథుల
ఆ॥ ఉబుకు తెలివితేట లూర్జితం బగు తేజ మంతకన్న మిన్న యైన వేగ
మల్లవారిపట్ల నారసినంతనే యిమ్ముసెడిరి రాక్షసేంద్రుభటులు. ౯
ఆ॥ హృదయముల భయంబు వదనంబుల విషణ్ణ భావ మట్టు లుట్టిపడఁగ గుండె
గుబ్బు రనఁగఁ జెదరి గుప్పున ప్రాకార లంఘనం బొనర్చి లంకసేరి. ౧౦
తే॥ దీనముఖు లయి రావణుఁ దేఱిపాఱఁ జూడలే కెట్లొ చూచి యచ్చెరువుమాట
యున్నయది యున్నయట్టులే యొక్కఁడేని దాఁపనోపక తెలిపిరంతయుఁ దలార్లు

—♦ చారులు రావణునకు రామసేనల విశేషములు నుడువుట ♦—

తే॥ కొండచట్టుపల్కొట్టినదుండగీని కొఱలుమగఁటిమి నుడికించి కొఱఁతవెట్టి
నట్టి జెట్టి నీకొమరుండు మట్టుమీఱి నాగుబాములఁ గట్టెఁగా నరవరులను. ౧౨
క॥ వా రిపుడు బంధముక్తులుఁగా రాజిలుచున్నవారు కదనక్షోణిన్
దారితపాశము లగు మదవారణములభంగి సంప్రవర్ధితకరులై. ౧౩
ఆ॥ నిష్ప్రకంపభుజులు నిర్నిద్రు లగు వారి యొడళులం దొకింత యొకఁడ యేని
గంటి గానరాదు కపు లన్న నమ్మైన యమరియున్నవార లభయు లగుచు. ౧౪
క॥ ఏమని తెలుపుదు మధిపా! యీరామెయి తేజం బొకంట నగుఁ గా దనఁగా
మామదికిఁ దోఁప దింకిట సేమముఁ గూర్పంగ నీక చెల్లెడు ననినన్. ౧౫

—♦ రావణుని విషాదము ♦—

చ॥ అది విని రాక్షసేంద్రుఁడు మహాబలుఁ డంచితవిక్రముండు నె
మ్మదిఁ గడుచింతతో నెడరుమాపుడు సూపుచు నేపుమీఱు మో
మదిగొని పెన్విషాదమున కై యతిదీనత నోహటిల్లఁ జొ
క్కొదవఁగ నిట్లనెం దనమహోన్నతియుం దలపోయ కత్తఱిన్. ౧౬
తే॥ బ్రహ్మదత్తవరంబులం బ్రథితిఁ గాంచి మొనయు నాశీవిషముల నమోఘములు ర
విప్రకాశములును నగు విశిఖములుగఁ జేసిబంధించెఁగద యింద్రజిత్తు నరుల. ౧౭
ఆ॥ అట్టి యస్త్రబంధ మలమ విముక్తులై యున్నకడఁక వార లుండి రనిన
సందియంబెడంద జాల్కొనుచున్నది మనబలౌఘ మింక మను నె యనుచు. ౧౮

